# ఆ కాంతి

మన దేశంలో ప్రకాశించిన ఆ కాంతి సామాన్య కాంతి కాదు. ఎన్నో సంవత్సరాలుగా మన దేశాన్ని తేజోమయం కావించిన ఆ కాంతి యికముందు కూడా యీ దేశంలో ఎన్నో సంవత్సరాలపాటు తన ప్రకాశాన్ని దశదిశల ప్రసరిస్తుంది. వెయ్యి ఏండ్లు గడిచాక యీ దేశంలో ఆ కాంతి యింకా వెలుగుతూనే వుంటుంది. ప్రపంచానికది యింకా కనిపిస్తూనే వుంటుంది. అసంఖ్యాక హృదయాలకు శాంతినీ ఓదార్పునూ ప్రసాదిస్తూనే వుంటుంది. ఆ కాంతి కేవలం వర్తమానానికే పరిమితం కాలేదు. చిరంతన సత్యాలను ప్రబోధిస్తూ మనల్ని తప్పుదారుల నుండి మరలిస్తూ, సరియైన త్రోవ మనకు చూపుతూ, తరతరాల ప్రాచీన చారిత్రిక వైభవానికి నెలవైన యీ దేశాన్ని తిరిగి స్వాతంత్ర్య గమ్యం వైపు నడిపిస్తూ వెలిగిన కాంతి అది.

**జవహర్‌లాల్ నెహ్రూ**



## అతడెప్పుడూ వున్నాడు

అతడు సామాన్య వ్యక్తి
అతడసామాన్య వ్యక్తి
తృణం కంటే తేలిక
మేరువు కంటే ధీరుడు
అగర్భ శ్రీమంతుడు
నిత్య దరిద్ర నారాయణుడు...
అతడిప్పుడు లేడు
అతడెప్పుడూ వున్నాడు.

-శ్రీ శ్రీ

## పవిత్ర జీవితం

మహాత్మాగాంధీ గొప్పతనం ఆయన పడిన కష్టాలలో లేదు: ఆయన జరిపిన పోరాటాలలో లేదు; ఆయన సాధించిన విజయాలలో లేదు. ఆయన జీవించిన పవిత్ర జీవితంలో వుంది.

డా. రాధాకృష్ణన్

## భాగ్యనగర భాగ్యం

"శ్రీరాముని పాదధూళి సోకినంత మాత్రాన శిలగా వుండిన అహల్య పునర్జన్మ ఎత్తినట్లు ఇక్కడికి మీ రాక వల్ల భాగ్యనగర ప్రజలు చైతన్యవంతులైనారు."

(1934లో గాంధీజీ హైదరాబాదు వచ్చినప్పుడు)

# ఆంధ్ర ప్రదేశ్

అక్టోబరు, 1971

(ఆశ్వీయుజ-కార్తీకం, 1893 శా. శ)

సచిత్ర మాస పత్రిక

సంపుటి: 15 సంచిక: 9




ప్రధాన సంపాదకులు : పెండ్యాల వామనరావు

సంపాదకులు : కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి

ముఖచిత్రం:
దీపావళి వెలుగులు

రెండో అట్ట :
మహాత్మునికి జోహార్లు

పేజీ



**వెల : 50 పైసలు**

**సాలు చందా: 6 రూపాయలు**

రిజిస్టర్డ్ నెం. 133

# శుభారంభం

ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ఆశీస్సులతో శ్రీ పి. వి. నరసింహారావుగారి నాయకత్వాన కొత్త కాంగ్రెసు మంత్రివర్గం అధికారంలోకి రావడంతో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమైంది. ఇంతటితో రాష్ట్ర వ్యవహారాలలో నెలకొనివున్న ఒక రకపు సందిగ్ధ పరిస్థితి తొలగిపోవడమే కాక రాష్ట్ర సమైక్యతా భావ సుస్థిరత అనే నవోదయం అయింది. కొత్త ముఖ్యమంత్రికి "అనేక కష్ట నష్టాలకోర్చి రాష్ట్ర సమైక్యతకోసం కృషిచేసిన" మాజీ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారి సహకారమే కాక వెనకటి ప్రజాసమితికి చెందిన యితర నాయకుల సహకారం కూడా లభించడం శుభారంభమనే చెప్పాలి. పదవీ స్వీకరణ జరిగిన సెప్టెంబరు 30 వ తేదీ రాత్రి ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రంనుండి ప్రసంగిస్తూ ముఖ్య మంత్రి పేర్కొన్నట్లు యిటీవలి కాలంలో జరిగిన సంఘటనలన్నీ కేవలం పీడకలలుగా భావించి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర, సమగ్రాభివృద్ధికీ, సుస్థిరతకూ అందరూ సమైక్యంగా దృఢ సంకల్పంతో కృషిచేయడం ఎంతైనా అవసరం. ముఖ్యమంత్రీ, యితరులూ చేసిన ప్రకటనల ద్వారా స్పష్ట మయినట్లు, మాజీ ప్రజాసమితి సభ్యులు రాజభవన్‌లో మంత్రులుగా ప్రమాణ స్వీకారం చేసిన సందర్భంలో తిరిగి "సమైక్యతా" వాతావరణం వెల్లి విరిసింది. కొంతకాలంగా ఎడమొగం పెడమొగంగా గడిపిన మిత్రులు మళ్ళీ ఛలోక్తులతో, ఆలింగనాలతో, స్నేహంగా, సంతోషంగా సంభాషణలతో కాలక్షేపం చేశారు. నిజానికి, వారు స్వాతంత్ర్య సమరాంగణంలో భుజం భుజం కలిపి చేదోడు వాదోడుగా పనిచేసి సుఖదుఃఖాలలో పాలు పంచుకున్నవారే.

తెలంగాణా సమస్యా పరిష్కారానికి ప్రధానమంత్రి చేసే సూచనలను "తూ చా తప్ప కుండా, త్వరితంగా" అమలు పరుస్తానని ముఖ్యమంత్రి, స్పష్టంగా ప్రకటించారు. దీనివల్ల తెలం గాణా ప్రజల్లో పునర్విశ్వాసం ఏర్పడి, వారు కేవలం తెలంగాణా ప్రాంత అభివృద్ధికే కాకుండా, రాష్ట్రంలోని మిగిలిన ప్రాంతాల అభివృద్ధికి కూడా తమ శక్తి సామర్థ్యాలు వినియోగించి కృషి చేస్తారు. "ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా, నేను ఏ ఒక్క ప్రాంతానికీ చెందినవాడుగా వ్యవహ రించను. తెలంగాణాకు సంబంధించిన ప్రత్యేక సమస్యల పరిష్కారానికి అవసరమైన చర్యలన్నీ తీసుకోవడంతోపాటు, రాష్ట్రంలోని ప్రతి ప్రాంతంలోని ప్రజలకూ సంతృప్తికరంగా ప్రవర్తించ డమే నా కర్తవ్యంగా భావిస్తాను" అని తమ రేడియో ప్రసంగంలో ముఖ్యమంత్రి ఉద్ఘాటించారు.

ఆర్థికాభివృద్ధి త్వరితగతిలో సాధించడానికీ, ఆర్థిక వ్యత్యాసాలు తొలగించడానికీ రాష్ట్ర స్థాయిలో అవసరమైన, సాధ్యమైన అన్ని చర్యలను తీసుకోవడంద్వారా జాతీయ లక్ష్యమైన సోషలిస్టు సమాజ స్థాపనకు గట్టిగా తాము కృషిచేయగలమని శ్రీ నరసింహారావుగారు స్పష్టంగా ప్రకటించారు. మన మతాతీత, లౌకిక రాజ్య వ్యవస్థ సూత్రాలకు అనుగుణంగా తమ ప్రభుత్వ విధానం వుంటుందని భాషా, మత విషయిక అల్పసంఖ్యాక వర్గాల ప్రజలను ఉద్దేశించి ఆయన ప్రత్యేకంగా హామీ యిచ్చారు. రెండవ ప్రాంతీయ భాషగా చాలాకాలంగా ఉర్దూకు ఉన్న ప్రత్యేక స్థానానికి భంగం ఏమీ వుండదనికూడా ఆయన హామీ యిచ్చారు. అదే సమయంలో తెలుగును అధికారభాషగా పరిపాలనా వ్యవస్థ పైస్థాయిలలోకూడా ప్రవేశ పెట్టడానికి తీసుకోదలచిన కొన్ని చర్యలనుకూడా ఆయన వెల్లడించారు. చారిత్రిక కారణాలవల్లనూ, ఉత్తర, దక్షిణ ప్రాంతాల మధ్య సేతువుగా వున్నందువల్లనూ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం దేశమంతటిలోనూ ఉదార విధానాలు అనుసరించే రాష్ట్రంగా పేరు ప్రతిష్ఠలు పొందిందని కూడా ముఖ్యమంత్రి పేర్కొన్నారు. ఇక ముందుకూడా మన రాష్ట్రం ఉదార విధానాలనే అనుసరిస్తూ వుంటుందనీ, పైగా మన రాష్ట్రం దేశంలోని అత్యంత అభ్యుదయకరమైన రాష్ట్రాలలో ఒకటిగా వృద్ధి చెందడానికి కృషిజరుగు తుందనికూడా ఆయన హామీయిచ్చారు.

తక్షణ కర్తవ్యమైన అనావృష్టి పరిస్థితుల సాధక బాధకాలను తొలగించడానికీ, వ్యయ కర్తన విధానం కొనసాగించడానికీ నిర్ణయించడంద్వారా నూతన మంత్రివర్గం మంచి విధానాల అనుసరణకు నాంది పలికింది. అంతేకాక సంఘంలోని బలహీన వర్గాల ప్రజల పరిస్థితులు మెరుగు పరిచే విషయంలో యిటీవల కొంతకాలంగా రాష్ట్రప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహించి పనిచేస్తున్నది. తత్ఫలితంగా కొన్ని నిర్దిష్టమైన చర్యలుకూడా తీసుకోవడం జరిగింది. మంత్రులు తమ పర్యటనలలో హరిజనుల యిండ్లను సందర్శించాలని చేసుకున్న నిర్ణయంవల్ల, శతాబ్దాలుగా సాంఘిక న్యాయానికి నోచుకోని యీ వర్గాల ప్రజల్లో తిరిగి కొత్తగా ఆత్మ విశ్వాస జ్యోతి వెలిగించాలనే లక్ష్యం నెరవేరుతుంది.

శుభారంభం, సంపూర్ణ విజయానికి సూచిక గదా !

— పి. వి. ఆర్.



# ప్రగతి సాధనకు ఐక్యంగా కృషిచేద్దాం

పి. వి. నరసింహారావు

ఆంధ్రప్రదేశ్ నూతన మంత్రివర్గ ప్రమాణ స్వీకరణ సందర్భంగా 30-9-71 తేదీ రాత్రి ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రం నుండి ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు గారు చేసిన రేడియో ప్రసంగం పూర్తి పాఠం.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఒక బలమైన, సమైక్యతా రాష్ట్రంగా రూపొందించి, రాష్ట్ర అభివృద్ధికీ, ప్రజల సంక్షేమానికీ పాటు పడాలనే దృఢ సంకల్పంతో రాష్ట్ర ముఖ్యమంత్రి పదవీ బాధ్యతలను నేను నాడు సవినయంగా స్వీకరించాను. విజయ దశమి పర్వదిన సందర్భంగా నూతన మంత్రివర్గం అధికారంలోకి రావడం శుభంకరమైన విషయం. ఈ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రజలందరికీ నా హృదయపూర్వక శుభాకాంక్షలు.

## నూతన అధ్యాయం

తెలంగాణా ప్రాంతానికి చెందిన వ్యక్తి ముఖ్యమంత్రి కావడానికి వీలుగా మన ప్రధానమంత్రి యిటీవల కొన్ని చర్యలు తీసుకున్నారు. తత్ఫలితంగా శ్రీమతి ఇందిరా గాంధీ ఆశీర్వాద బలంతో నేను ముఖ్యమంత్రిగా ఎన్నిక కావడం జరిగింది. మన రాష్ట్రంలో సంభవించిన వరదలు, అనావృష్టి పరిస్థితుల మాట అలా వుంచినా, గత రెండు సంవత్సరాల కాలం మన రాష్ట్రానికి చాలా గడ్డు కాలంగా పరిణమించింది. ఒక ప్రాంతానికి చెందిన ప్రజల మనస్సుల్లో మరొక ప్రాంతం పట్ల విశ్వాసం సడలిందా, అనే సందేహం ఏర్పడింది. దాని ఫలితంగా జరిగిన అనేక సంఘటనలు ప్రజలందరికీ తెలిసినవే. ప్రధాన మంత్రి చొరవ తీసుకొని పని చేసినందువలనూ, లోగడ ప్రజాసమితి పేరుతో వున్న సంస్థ నాయకులు యిచ్చిన సహకారం వల్లనూ మళ్ళీ ఐక్యత పునరుద్ధరించే సదవకాశం లభించింది. దీనివల్ల మన రాష్ట్ర చరిత్రలో సమైక్యత, సదవగాహనలతో కూడిన నూతనాధ్యాయం ప్రారంభమైంది. రాష్ట్ర అభివృద్ధికీ ప్రగతికీ సమైక్యతా సదవగాహనలు తప్పనిసరిగా వుండవలసిన లక్షణాలు. ఇంతకు ముందు ప్రజాసమితి అనే పేరుతో పనిచేసిన సంస్థలోని సభ్యులు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమగ్రాభివృద్ధికి సహకరించడానికి నిశ్చయించడం చాలా సంతృప్తికరమైన విషయం.

## న్యాయబద్ధమైన పరిపాలన

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలంగాణా అంతర్భాగమే ఐనా దాని సమస్యలు దానికి ఉన్నాయి. అభివృద్ధి విషయంలోనూ, మానసిక భావనల విషయంలోనూ తెలంగాణాకు గల ప్రత్యేక సమస్యలను పరిష్కరించడానికి ప్రభుత్వం శాయశక్తులా కృషిచేస్తున్నది. చాలాకాలంగా నిర్లక్ష్యం చేయబడిన తెలంగాణా ప్రాంతపు సమస్యలన్నింటికీ శాశ్వత పరిష్కారమార్గాలు సాధించే ప్రత్యేకశ్రద్ధ బాధ్యతను ప్రధానమంత్రి స్వీకరించారు. ఇందువల్ల, యీ సందర్భంగా ప్రధానమంత్రి చేసే సూచనలను తూచా తప్పకుండా. త్వరితంగా

అమలు పరచే విధానాన్ని నేను అనుసరిస్తాను. ఏ రాష్ట్రంలోనైనా వివిధరంగాలలో త్వరితగతిలో అభివృద్ధి సాధించడానికి సుస్థిరమైన, న్యాయబద్ధమైన పరిపాలనావ్యవస్థ చాలా అవసరం. అందువల్ల, ఎట్టి పరిస్థితుల్లోనైనా, ప్రజలందరికీ న్యాయం జరుగుతుందనీ, నిర్భయంగా, నిస్వార్థంగా నిర్ణయాలు తీసుకోవడం జరుగుతుందనీ ప్రజలలో దృఢమైన విశ్వాసాన్ని కలిగించడం నా ప్రథమ కర్తవ్యంగా నేను పరిగణిస్తున్నాను. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా, నేను ఏ ఒక్క ప్రాంతానికీ చెందినవాడుగా వ్యవహరించను. తెలంగాణాకు సంబంధించిన ప్రత్యేక సమస్యల పరిష్కారానికి అవసరమైన చర్యలన్నీ తీసుకోవడంతో పాటు రాష్ట్రంలోని ప్రతి ప్రాంతంలోని ప్రజలకు సంతృప్తికరంగా ప్రవర్తించడమే నా కర్తవ్యంగా భావిస్తాను.

## ఆర్థిక వ్యత్యాసాల తొలగింపు

మన రాష్ట్రంలో ప్రస్తుతం నెలకొని వున్న, కనీ వినీ ఎరుగని అనావృష్టి పరిస్థితుల భీభత్సాన్ని తొలగించడం నా తక్షణ కర్తవ్యం. అనావృష్టి పరిస్థితులకు గురి అయిన ప్రజల బాధలను తొలగించడానికి జిల్లాలలో పర్యటించవలసిందనీ, అక్కడికక్కడే అవసరమైన నిర్ణయాలు తీసుకోవలసిందనీ నేను నా సహచరులైన మంత్రులను కోరుతున్నాను. ఈ సందర్భంలో కేంద్ర ప్రభుత్వపు నిపుణుల బృందాలు మన రాష్ట్రాన్ని సందర్శించాయి. వారు సమర్పించే నివేదికలు పరిశీలించి కేంద్ర ప్రభుత్వం మనకు ధనసహాయం అందజేస్తుంది. ఇప్పటికే కొంతవరకు సహాయం అందింది. అనావృష్టి నివారణ కార్యక్రమాలు ప్రారంభించడానికి మరికొంత సహాయం కూడా మనకు లభిస్తుంది. అనేక శతాబ్దాలుగా వెనుకబడినతనం అనుభవిస్తున్న షెడ్యూలు జాతులు, షెడ్యూలు కులాలు, వెనుకబడిన తరగతులు మొదలగు బలహీనవర్గాల ప్రజల అభివృద్ధికీ, వారి సంక్షేమానికీ సంబంధించి అవసరమైన అన్ని చర్యలను కూడా కొత్త మంత్రివర్గం తీసుకుంటుంది. జాతీయ స్థాయిలో మన లక్ష్యం సోషలిస్టు సమాజ స్థాపన; సోషలిజం అనే చరమ లక్ష్యాన్ని చేరుకునేందుకు వీలుగా త్వరితంగా ప్రగతి సాధించడం. ఈ లక్ష్యాన్ని అందుకోవాలంటే, భూమి లేని నిరుపేదలకు భూమి లభింప జేయడం, అఖిల భారత స్థాయిలో అనుసరించే విధానాలకు అనుగుణంగా భూసంస్కరణలు అమలు పరచడం, పారిశ్రామిక అభివృద్ధి మొదలగునవి మాత్రమేకాక, ప్రజల్లో వివిధవర్గాల మధ్యగల ఆర్థిక వ్యత్యాసాలను తొలగించడం కూడా చాలా అవసరం.

## పౌరులందరు సమానులే

నూతన మంత్రివర్గంతో మనస్ఫూర్తిగా సహకరించవలసిందనీ, త్వరితగతిలో ఆర్థికాభివృద్ధి సాధించడంలోనూ, వృత్తి ఉద్యోగ వసతులను ఎక్కువ చేసుకోవడంలోనూ ప్రభుత్వానికి సహాయం అందివ్వవలసిందనీ, మత, భాషా విషయిక అల్ప సంఖ్యాక వర్గాల ప్రజలతోసహా, రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు చెందిన అందరు ప్రజలకూ నేను యీ సందర్భంగా విజ్ఞప్తి చేస్తున్నాను. మన దేశంలో మతాతీతమైన రాజ్య వ్యవస్థ అమలు జరుగుతున్నది. ఇందులో జాతి, మత, కుల, భాషా భేదాలతో నిమిత్తం లేకుండా ప్రతిపౌరుడికీ సమానమైన హక్కులు వున్నాయి. భాష విషయంలోగానీ, భాషా, మత సంబంధమైన అల్పసంఖ్యాక వర్గాల విషయాలలో గానీ అనుసరింపబడుతున్న విధానాల దృష్ట్యా, మన రాష్ట్రం దేశమంతటిలోనూ ఉదార విధానాలు అనుసరించే రాష్ట్రంగా పేరు పొందింది. నేను కూడా అవే విధానాలను అనుసరిస్తాను. మనరాష్ట్రం దేశంలోని అత్యంత అభ్యుదయకరమైన రాష్ట్రాలలో ఒకటిగా అభివృద్ధి చెందాలని నా వాంఛ. ఈ లక్ష్యసాధన కోసం నేను గట్టిగా కృషి చేస్తాను. సామాన్య ప్రజల సంక్షేమం కోసం, బాధలు అనుభవిస్తున్న బీద ప్రజలు,మధ్య తరగతి ప్రజల ప్రయోజనార్థం హృదయ పూర్వకంగా కృషిచేస్తాననీ, నా శాయ శక్తులా పని చేస్తాననీ హామీ యిస్తున్నాను.

## ఐక్యంగా కృషి చేద్దాం

అనేక కష్టనష్టాలకు ఓర్చి, రాష్ట్ర సమైక్యతను సంరక్షించడానికి కృషి చేసిన మాజీ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. అలాగే తెలంగాణా అభివృద్ధికి ప్రధాని ప్రణాళికను అమలు పరచడంలో నేను చేయవలసివున్న కృషిలో సంపూర్ణ సహకారం అందిస్తామని వాగ్దానం చేసిన ప్రజాసమితి వర్గాల వారికి కూడా కృతజ్ఞుణ్ణి. ఈనాడు మనం తీసుకోబోతున్న నిర్ణయాలు దీర్ఘకాలికంగా మన రాష్ట్ర భవిష్యత్తును తీర్చి దిద్దేవిగా వుంటాయి. ఇటువంటి క్లిష్టసమయంలో ముఖ్యమంత్రి పదవి స్వీకరించిన నాకు ఆంధ్రప్రదేశ్ ప్రజలందరి అభిమాన, ఆశీస్సులు తప్పక లభించగలవని విశ్వసిస్తున్నాను. ప్రజలందరికీ మరొక్కమారు నా శుభాకాంక్షలు అందిస్తున్నాను. ఇటీవల రాష్ట్రంలో జరిగిన సంఘటనలను కేవలం ఒక దుస్స్వప్నంగా మాత్రమే భావించి, రాష్ట్ర సమైక్యతకూ, సుస్థిరత్వానికీ, ప్రగతి సాధనకూ ఐక్యంగా కృషి చేస్తామని యీ శుభ సమయాన శపథం చేసుకుందాం.

---

# జాతీయోద్యమ వీర యోధుడు

# ఆంధ్ర కేసరి ప్రకాశం

పంద్రంగి రాజేశ్వరరావు



ఈ ఏడాది ఆగస్టు 23 నుంచి ప్రారంభంకానున్న టంగుటూరి ప్రకాశంగారి శతజయంతి సంవత్సరానికి వర్తమాన పరిస్థితుల్లో చాలా ప్రాముఖ్యం ఉంది. ఆంధ్రుల చరిత్ర ఒక అర్ధశతాబ్దికి పైగా ఆయన జీవితంతో ముడిపడి వుంది. జాతీయోద్యమంలో ప్రకాశం గారికి అనుయాయిగా, వారితో పాటు సహ ఖైదీగావున్న యీ వ్యాసరచయిత గత స్మృతులను తిరగతోడు కుంటున్నప్పుడు నోబిల్ బహుమతి పొందిన 'డాక్టర్ జివాగో' నవలలో కథానాయకుడు యోరీ జివాగో మాటల్లో సుప్రసిద్ధ రష్యా రచయిత బోరిస్ పెస్టర్‌నాక్ అక్టోబరు తిరుగుబాటు గురించి చెప్పిన మాటలు గుర్తుకొస్తున్నాయి. తన ప్రేయసి లరిస్సాతో యూరీ జివాగో ఇలా అన్నాడు. "మన చుట్టూ ఏం జరుగుతోందో ఒకసారి ఆలోచించు, ఇటువంటి సమయంలో నువ్వూ, నేనూ జీవిస్తున్నాం. స్వేచ్ఛ—నిజమైన స్వేచ్ఛ-కేవలం మాటల మూటలు కాదు అసలైన స్వేచ్ఛ—అనుకోకుండా ఆకాశం నుండి భూమికి దిగింది. అటువంటి సంఘటన ఎప్పుడో ఒక్క-సారి మాత్రమే జరుగుతుంది. ఈ చైతన్యంలో నేనూ ఒక భాగం కావాలనుకుంటున్నాను".

---

### ప్రకాశం జిల్లా

ఒంగోలు జిల్లా పేరును "ప్రకాశం జిల్లా" గా మార్చాలని 1971 సెప్టెంబరు 13వ తేదీన జరిగిన మంత్రివర్గ సమావేశంలో ప్రభుత్వం నిర్ణయించింది.

---

# ప్రజల మనిషి ప్రకాశం

## తన చరిత్రే మన చరిత్ర

ప్రకాశం గారు 1872 ఆగస్టు 23 న ఒంగోలు జిల్లా కనుపర్తి గ్రామంలో జన్మించారు. ఆయన తండ్రిగారు గోపాలకృష్ణయ్య గారు వెంకటగిరి జమీలో చిన్న ఉద్యోగి. ఆయన ప్రకాశం గారి 11వ ఏట స్వర్గస్థులయ్యారు. ఆయన సంపాదించిన ఆస్తి అంటూ ఏమీలేదు. అటువంటి పరిస్థితుల్లో తన కొడుక్కి ఇంగ్లీషు చదువు చెప్పించాలని ప్రకాశంగారి తల్లి సుబ్బమ్మ గారు చాలా ధైర్యంగా ఎవరేమనుకున్నా లక్ష్యపెట్టక ఒంగోలులో ఒక హోటలును నడపాలనుకుంది. ప్రకాశానికి చెడు సహవాసాలున్నప్పటికీ మిడిల్‌స్కూలు పరీక్షలో ఫస్ట్ క్లాసులో పాసయ్యాడు. నల్లకోటు ధరించే ప్లీడర్లను చూసి వారు బాగా ఆర్జన చేస్తుండడం విని తనుకూడా న్యాయవాదికావాలని అనుకున్నాడు ప్రకాశంగారు ఎప్పుడో. భవిష్యత్తులో జరగబోయే సంఘటనలకు యిప్పుడు వర్తమానంలోనే వాటి చిహ్నాలు కనిపిస్తాయంటారు. బాల్యంలో ఆయన హృదయంలో నాటుకున్న ఆ చిన్న కోరిక పెరిగి పెద్దది కావడానికి తగిన వనరులు ఆయనకు లేకపోయినప్పటికీ న్యాయవాదుల్లో అగ్రాసనాన్నీ, జాతీయోద్యమంలో నాయకత్వాన్ని చేపట్టేందుకు ఆయనకు జీవితంలో రాసిపెట్టివుంది.

పూనా కంపెనీ వాళ్ళు హిందీలో వేసే నాటకాలను చూసిన తర్వాత ప్రకాశంగారి ఆసక్తి చదువుమీదనుంచి అటువైపు మరలింది. ఆవూళ్ళో మిషన్ హైస్కూల్లో చదువుచెప్పే హనుమంతరావు నాయుడు గారికి నాటకాలమీద విశేషమైన ఆసక్తి వుండేది. బాలప్రకాశానికి చక్కటి పర్సనాలిటీ, కుదురైన ఆకారం, తెల్లని శరీరచ్ఛాయ వుండడం వల్ల నాటకాలలో స్త్రీ పాత్రల్ని ధరిస్తుండేవాడు. అందువల్లనే హనుమంతరావు నాయుడు, ప్రకాశం గార్ల మధ్య సాన్నిహిత్యం ఏర్పడింది. రాజమండ్రి గతచరిత్రను విన్న ప్రకాశం గారికి ఆవూరు చూడాలనిపించింది. వేసవి సెలవుల్లో నాయుడు గారితో కలిసి రాజమండ్రి వెళ్ళాడు.

అక్కడ చూడదగ్గ ప్రదేశాలన్నిటినీ చూసిన తరువాత తాను ఒక్కడే తిరిగి ఒంగోలు వచ్చేయాలనుకున్నాడు ఎందువల్లనంటే హనుమంతరావు నాయుడు గారికి రాజమండ్రిలో ఉద్యోగం రావడంవల్ల అక్కడే వుండిపోవలసి వచ్చింది. అయితే ప్రకాశం గారిని కూడా, రాజమండ్రిలో వుండిపోయి చదువు కొనసాగించమనీ, తాను చేతనైనంత సహాయం చేస్తాననీ ఆయన చెప్పాడు. ప్రకాశంగారు వెంటనే ఒప్పుకున్నాడు. ఇది కేవలం కాకతాళీయంగానే జరిగింది. మానవ జీవితాన్ని మలచడంలో అనుకోని సంఘటనలే ఎంతో ప్రాముఖ్యాన్ని వహిస్తాయి కొడుకు దూరమైపోతున్నాడని తల్లి బాధ పడ్డప్పటికీ మరో మంచిచోట తన కొడుకు బాగుపడుతున్నాడు లెమ్మని తనను తాను సమాధాన పరుచుకుంది ఆమె. హనుమంతరావు నాయుడు గారు ప్రకాశం గారిని స్కూల్లో చేర్చి స్కాలర్ షిప్పుకూడా సంపాదించి పెట్టారు. అయితే నాటకాల్లో పాల్గోవడంవల్లా, వీధుల్లో ఆకతాయి కుర్రాళ్ళతో కలసితిరిగి పోట్లాటలు, కొట్లాటల్లో పాల్గోవడంవల్లా మెట్రిక్యులేషన్ పరీక్ష పోయింది. కాని ఆ తరువాత మళ్ళీ ప్రయివేటుగా పరీక్షకు కట్టి పాసయి రాజమండ్రిలోనే కాలేజిలో ఎఫ్. ఏ లో చేరాడు. అక్కడి ప్రిన్సిపాల్ మెట్కాఫ్ అభిమానాన్ని చూరగొన్నాడు. అయితే ప్రకాశం గారు తీవ్ర ధోరణివల్ల తరుచుగా క్లాసులోని విద్యార్థులతో ఘర్షణ పడుతుండేవాడు. ఒకసారి నాయుడు గారితో నాటక బృందం వెంట కాకినాడ వెళ్ళాడు ఆయన. అక్కడ అర్ధరాత్రివేళ ప్రకాశం గారిని ఒక రౌడీ చిదగ్గొట్టాడు. ప్రకాశంగారుకూడా ఏం తీసిపోలేదు. సమయం గురించి కాచుకూర్చుని పట్టపగలు అతన్ని చిదగ్గొట్టాడు. ప్రకాశంగారిమీద క్రిమినల్ కేసు పెట్టబడినప్పటికీ దైవికంగా అది తప్పిపోయింది.

ప్రకాశంగారు బాల్యంలో కన్న కలల్ని ఫలప్రదం చేద్దామని నాయుడుగారు ఆయనను మద్రాసు పంపించారు. ప్లీడరుగా తిరిగి వచ్చి రాజమండ్రిలోనే ప్రాక్టీసుపెట్టి కొన్ని నెలల్లోనే పేరులోకి వచ్చాడు ఆయన కీర్తి నలుమూలలా వ్యాపించింది. ఇతర చోట్లనించి కూడా కేసులు ఆయన వద్దకు వస్తుండేవి. ఆయన కీర్తి ప్రతిష్ఠలు చూసి అసూయపడిన సహచరులు ఆయన్ను దొంగ సాక్ష్యం కేసులో యిరికించారు. అయితే ఆయన దాని నుండి గౌరవంగా తప్పుకోగలిగాడు. నిర్దోషిగా నిరూపించుకున్నాడు.

టంగుటూరి ప్రకాశం పంతులుగారు తమ 30వ ఏట రాజ

# సాహసానికి మరో పేరు

మండ్రి పురపాలక సంఘం అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. పలుకుబడిగల పెద్దల ప్రతిఘటన వున్నప్పటికీ ఆయన ఎన్నికల్లో విజయం సాధించారు. ఆ ఎన్నిక ప్రకటనను జారీకాకుండా ఆయన ప్రత్యర్థులు జాప్యంచేసి, ఆయన మీద వ్యతిరేకంగా పిటీషన్లు పెట్టినప్పటికీ ప్రకాశంగారు ఏ మాత్రం భయపడక స్వయంగా మద్రాసు వెళ్ళి ఉన్నతాధికారుల్ని కలుసుకుని, చివరకు గవర్నరును కూడా కలిసి తన ఎన్నిక ప్రకటనను గజెటులో ప్రకటించేట్టు చేసుకోగలిగారు.

హైకోర్టులో తన ప్రతిభను ప్రదర్శించడానికి వీలుగా, బారిస్టరు స్వామినాథన్ సలహా మేరకు తాను బారిస్టరు కావాలని

# త్యాగానికి తల్లి వేరు

ప్రకాశంగారు నిశ్చయించుకున్నారు. తన దగ్గరికివచ్చే డబ్బున్న క్లయింట్ల సహాయంతో లండన్‌కు ప్రయాణమయ్యారు. స్వతహాగా ప్రకాశంగారు సాహసి కావడంవల్ల ఆయన అక్కడ నిశ్శబ్దంగా వుండలేకపోయారు అందువల్ల ఆయన ఇండియా సొసైటీలో చేరారు. భారత దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించడమే ఈ సంఘం లక్ష్యం. ఆ నాడు దాదాభాయ్ నౌరోజి ప్రసిద్ధ జాతీయ నాయకుడు. పార్లమెంటరీ ఎన్నికల్లో ప్రకాశంగారు ఆయన గురించి ప్రచారం చేశారు. పోలింగ బూత్‌లో నౌరోజీ ఏజంటుగా కూడా వ్యవహరించారు. ప్రకాశంగారిని బాగా ఆకర్షించిన వాళ్ళు హెన్రీ కాటన్, విలియం వెడ్డర్బర్న్. ఉద్యోగం నించి రిటైరైన యీ యిరువురు సివిలియన్ అధికార్లకు భారతదేశానికి సేవ చేయడమంటే చాలా యిష్టం. తమకు వచ్చిన పింఛను డబ్బును, ఇంకా మరికొంత వ్యక్తిగత ఆస్తిని భారతదేశం నిమిత్తం వారు ఖర్చు పెట్టారు. లోగడ కాంగ్రెసు అధ్యక్షులుగా వున్న డబ్ల్యు.సి. బెనర్జి, ఆర్. సి. దత్‌గార్లతో ప్రకాశంగారికి సాన్నిహిత్యం ఏర్పడింది. లాలా లజపతిరాయ్‌ని కూడా ఆయన కలుసుకున్నారు. ప్రసిద్ధ విప్లవవాది శ్యామ్‌జీ కృష్ణవర్మతో కూడా ఆయనకు పరిచయం ఏర్పడింది.

ఆ గ్రంథరచనలో తోడ్పడ్డారు. రఫుస్ ఐజాక్ అనే న్యాయవాది వద్దకూడా ఆయన పనిచేశారు. బ్రిటిష్ ప్రభుత్వం మీద రంజిత్‌సింగ్ కొడుకు దిలీప్‌సింగ్ పెట్టినకేసులో ఐజాక్‌కు ప్రకాశం తోడ్పడ్డారు. చదువులో ప్రకాశం గారికి ఎన్.ఎస్. సర్కార్ అనేఆయన ఎప్పుడూ పోటీగా వుంటుండేవాడు. ఆయన ఆ తర్వాత భారత ప్రభుత్వంలో న్యాయశాఖ సభ్యుడుగా పనిచేశాడు. ప్రకాశంగారు పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులు కావడమేకాక యోగ్యతా పత్రాన్నీ బహుమతిని కూడా సంపాదించుకున్నారు.

ఫస్ట్ టర్మ్ అయ్యాక ప్రకాశంగారు రాజమండ్రి వచ్చారు. బ్రిటిష్‌వారి సుగుణాలను తనలో ప్రోదిచేసుకుని, నిండువ్యక్తిత్వంతో రాజమండ్రి చేరుకున్నారు. ఆరోజుల్లో విదేశాలకు వెళ్ళివచ్చినవారు సంప్రదాయనుసారంగా పరిశుద్ధులు కావలసివుంది. ప్రకాశంగారు అలా పరిశుద్ధులు కావడానికి నిరాకరించారు. సనాతన హిందువుల ఆగ్రహాన్నికూడా ఆయన లెక్కచేయలేదు. శంకరాచార్యులువారు ఆయన్ను కులంనించి బహిష్కరిస్తూ జారీచేసిన ఉత్తర్వును కూడా ప్రకాశంగారు ఖాతరు చేయలేదు. లండనుకు తిరిగి వెళ్ళిన తర్వాత చదువుమీద శ్రద్ధవహించారు. కోర్టులలో జరిగే ముఖ్యమైన కేసులకు హాజరయి పరిశీలిస్తూండేవారు. మద్రాసు హైకోర్టు రిటైర్డ్ జడ్జి అయిన షెప్పర్డ్ అనే ఆయన ఇండియన్ కాంట్రాక్ట్ ఆక్టు అనే గ్రంథం వ్రాస్తూంటే ప్రకాశంగారు ఆయనకు

మద్రాసులోని కొంతమంది న్యాయవాదులకు ప్రకాశం గారిని గూర్చి షెప్పర్డ్ పరిచయ లేఖలు వ్రాసి యిస్తూ మైలా

(తరువాయి 44వ పేజీలో)

# గాంధీజీ అడుగుజాడల్లో
# బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం

ఎ. పండరినాథ్

గాంధీజీ అడుగు జాడలలో నడుస్తూ జాతీయోద్యమంలో పాల్గొన్న అగ్రశ్రేణి ఆంధ్రులలో బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం ఒకరు. వీరు సుప్రసిద్ధ ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు. వీరు గుంటూరు జిల్లాలోని ఫిరంగిపురంలో జన్మించారు. తండ్రి రామ శాస్త్రిగారు. వీరు బెజవాడలో మెట్రిక్యులేషన్ వరకు చదివి ఆ తరువాత కలకత్తాలోని నేషనల్ మెడికల్ కాలేజీలో నాలుగు సంవత్సరాల పాటు వైద్య విద్య నభ్యసించి కలకత్తాలో కొంతకాలం పాటు హౌస్ సర్జన్‌గా పని చేసారు. ఆ తరువాత రాజమహేంద్రవరంలో వైద్య వృత్తిని ప్రారంభించి గొప్ప కీర్తినీ ధనాన్నీ గడించారు.

## విప్లవ కారులతో పరిచయం

వీరిలో సహజంగానే జాతీయతా భావం నెలకొని ఉన్నది. కలకత్తాలో చదువుకుంటున్న రోజులలో వీరికి వంగదేశ విప్లవ కారులతో పరిచయం కలిగింది. జాతీయ భావంతో పాటు దేశ విమోచన కోసం విప్లవకారులు సాగించే సాహస కృత్యాలు వీరిని మరీ ప్రభావితం చేసాయి.

ఆ రోజుల్లో రాజమహేంద్రవరంలోనూ, గోదావరి జిల్లాలోనూ తలెత్తిన అన్ని సాంఘిక రాజకీయ ఉద్యమాలలో వీరు పాల్గొనే వారు. వీరు ఎందరో యువకులను ఆకర్షించి కాంగ్రెస్ సంస్థలో చేర్చారు. వీరి కృషి ఫలితంగా ఎంతోమంది కళాశాలలను బహిష్కరించి జాతీయోద్యమంలో పాల్గొన్నారు.

## ప్రేక్షకులు కన్నీరు పెట్టారు!

1920 లో సహాయ నిరాకరణోద్యమానికి నాందీగా ప్రారంభించబడిన శాసన సభా బహిష్కారానికి వీరు విశేషంగా కృషి చేసారు. తమ గంభీరోపన్యాసంతో ప్రజలను ప్రభావితంచేసేవారు.

పంజాబు దురంతాలను గూర్చి ఉపన్యసిస్తూ ఉంటే వీరి ఉపన్యాసం విని ఎంతో మంది కన్నీరు గార్చారట. 1921లో వీరు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘానికి సంయుక్త కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. ఆ సంవత్సరమే జిల్లా కలెక్టరు వీరికి కఠిన శిక్ష విధించగా వీరు గ్రామోద్యోగులందరిచేత రాజీనామా నిప్పించి ప్రభుత్వాన్ని స్థంభింప జేయపూనుకున్నారు. అప్పుడు ప్రభుత్వమే వీరికి భయపడ్డది. కాని వీరు ప్రభుత్వానికి స్వయంగా లొంగిపోయారు. అప్పుడు వీరు కడలూరు జైల్లో బంధించబడ్డారు. ఒక సంవత్సరం జైలుశిక్ష ననుభవించిన తర్వాత 92" లో గయకు వెళ్ళి కాంగ్రెస్ సమావేశాల్లో పాల్గొన్నారు.

## గ్రామీణ సేవ

1924 లో గాంధీజీ కారాగారం నుండి విడుదలై గ్రామీణ సేవకు పూనుకున్నప్పుడు వీరు కూడా గాంధీజీ అడుగు జాడల్లో గ్రామీణ, సేవకు పూను కున్నారు. 1925లో వీరు సీతా నగరంలో గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమాన్ని స్థాపించారు అక్కడే వీరు నిర్మాణ కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఖద్దరు ఉత్పత్తి, విక్రయం, అస్పృశ్య తానివారణ, జాతీయ విద్య మొదలైన గాంధేయ కార్యక్రమాలను ప్రారంభించారు

## సంవత్సరం కఠిన శిక్ష

1930 లో జరిగిన ఉప్పు సత్యాగ్రహోద్యమానికి గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమం ఎంతో చేయూత నిచ్చింది. గాంధీజీ పిలుపు విని ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనడానికి వీరి నాయకత్వంలో ఎంతో మంది ఈ ఆశ్రమం నుండే బయలుదేరారు. అప్పుడు వీరికి ఒక సంవత్సరం కఠిన శిక్షపడింది.

రౌండు టేబుల్ సమావేశంనుండి గాంధీజీ స్వదేశానికి తిరిగి వచ్చిన తరువాత దేశంలో మళ్ళీ శాంతి సమరం ప్రారంభ మయింది. వీరు శాంతియుతంగా ఎన్నో పికెటింగ్‌లను ఏర్పాటు చేసారు. 1932లో వీరు రాజమహేంద్రవరంలో శాంతియుతంగా పికెటింగ్ జరుపుతున్నప్పుడు పోలీసులు వీరిపై బాగా లాఠీఛార్జి జరిపారు అప్పుడే వీరి ప్రక్క ఎముక విరిగిపోగా వీరు జీవితాంతం బాధ పడ్డారు. ఈ బాధను లెక్కచేయక ఎన్నో కార్యక్రమాలలో పాల్గొని జైలు శిక్షను అనుభవించారు.

## మృత్యువుతో ముఖాముఖీ

గాంధీజీ తలపెట్టిన అస్పృశ్యతా నివారణోద్యమంలో పాల్గొని ఆంధ్ర ప్రాంతంలో వీరు ఎంతో కృషి చేసారు. సీతా నగరంలో వీరు హరిజన ఆశ్రమాన్ని స్థాపించారు. ఒకవైపు వీరిని ఎముక విరిగిన బాధ వెంటాడుతూనే ఉండగా వీరికి క్షయ వ్యాధి సోకింది. అయినా వాటిని లెక్క చెయ్యక అన్ని ఉద్యమాలలో పాల్గొన్నారు. విరామ మెరుగక నిస్వార్థ బుద్ధితో నిరంతర కృషిచేస్తూ మృత్యు దేవతతో హోరాహోరీ పోరాటం సలిపారు. 1936లో వీరు మృత్యు దేవతకు లొంగిపోయారు.

ఫయిజ్‌పూర్ కాంగ్రెస్ సమావేశాల్లో ఉన్నప్పుడు గాంధీజీకి వీరి మరణవార్త తెలిసింది. వీరి మరణవార్త విని గాంధీజీ రెండు నిమిషాల పాటు కన్నీరు కారుస్తూ నిలబడ్డారు.

స్వాతంత్ర్యోద్యమాలలో పాల్గొని దేశం కోసం తమ సర్వస్వాన్ని అర్పించి చివరికి దేశం కోసం తమ ప్రాణాలనే అర్పించి అజ్ఞాతంగా ఉండిపోయిన దేశ సేవకుల్లో సుబ్రహ్మణ్యం గారు ఒకరు. ఆయన గొప్ప దేశభక్తుడు, త్యాగశీలి, ఉదారుడు. నిగర్వి. అంతేకాదు గొప్పదీక్ష పరుడు.

## స్వరాజ్యమంటే........

నేను కలగంటున్న స్వరాజ్యం నిజానికి బీదవాళ్ళ రాజ్యం. మహారాజులూ, ధనవంతులతో పాటు నిత్యజీవితావసర వస్తువులవలన కలిగే సుఖాలు మీరుకూడా అనుభవించవలసినదే అంటే వారి లాగా రాజ ప్రాసాదాలు మీరు కూడా అనుభవించాలని కాదు. ఆనందమయజీవితానికి అవి అక్కరనే లేదు. మీరైనా నేనైనా వాటిలో నిలువునా మునిగిపోతాం. ధనవంతుడు అనుభవించే సాధారణ జీవిత సౌఖ్యాలు, సౌకర్యాలు అన్నీ మీకు తప్పనిసరిగా వుండాలి. యీ సాధారణ జీవిత సౌకర్యాలను సమకూర్చలేని స్వరాజ్యం స్వరాజ్యమే కాదు.

—మహాత్మాగాంధీ



# గాంధీజీ కలలుగన్న గ్రామ రాజ్యం సర్వోదయ

జి. వెంకటరామారావు

దేశంలోని సాంఘిక ఆర్థిక అసమానతలను ప్రశాంత విప్లవం ద్వారా రూపు మాపాలనే సంకల్పంతో సర్వోదయ కార్యక్రమాన్ని చేబట్టేరు పూజ్యశ్రీ వినోబాజీ. సర్వోదయ కార్యకర్తలలో అకుంఠితమైన త్యాగబుద్ధి, అవిరళ సేవాతత్పరతా వుంటేనే తప్ప ఇంతటి మహత్తరమైన మార్పు ఆచరణలో సాధ్యం కానేరదు.

## సంక్షేమ రాజ్యానికి పై మెట్టు

పెద్ద మొత్తంలో, అధిక సంఖ్యాకమైన ప్రజలకు మేలు వాటిల్లాలనేది సంక్షేమ రాజ్యాల లక్ష్యమైతే సర్వోదయ సిద్ధాంతం ఒక మెట్టు ఉన్నతమైనదనే చెప్పాలి. సంఘంలో అందరికీ, అంటే ఏ ఒక వర్గమూ, వ్యక్తీ తప్పి పోవడమనేది వుండక ఏక కాలంలో మేలు జరుగాలనే కృషిలో సర్వోదయ నాయకులు నిమగ్నులై వున్నారు. అది ఒక మహా యజ్ఞం, ఆ యజ్ఞంలో అందరికీ సమానావకాశాలు లభిస్తాయి. ఈ మనుగడ సాధనలో వర్గ పోరాటాలకు తావుండదు. అనారోగ్యకరంగా పరిణమించే పోటీ లుండవు. ఎటు చూసినా పరస్పర సహకారము, సుహృద్భావ వాతావరణము వెల్లి విరుస్తాయి. జాతీయ సంపద సంఘపరమై వుండాలనే సిద్ధాంతములో ఏ జాతికీ సందేహా లింతవరకు ఉత్పన్నం కాలేదు. జాతీయ సంపదను అందరికి సమానంగా పంచి పెట్టాలనే బాధ్యతను కేవలం ప్రభుత్వాల ఆధీనంలోనే పెట్టినట్లయితే, అద్యతన భావిలో ఇది నెరవేరక పోవచ్చు. పంపిణీలో అనేక అవకతవకలేర్పడుతున్నాయి. ఈ సందర్భంగా ప్రభుత్వాలకు ప్రజల చేయూత మిక్కిలిగా అవసరమైవున్నది. ప్రజలందరు కొంచెం సర్దుబాటుతనాన్నీ, త్యాగబుద్ధినీ అలవరచుకున్నట్లైతే సమాజం ఇంతకన్న ఎక్కువ సుఖశాంతులతో మన గలుగుతుంది. సర్వోదయ కార్యకర్తలు కాంక్షించేది, ప్రజలకు విన్నవించేది ఇదే.

## సర్వోదయ నిర్వచనం

మన సమాజముతో పెనవేసుకు పోయిన ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాలకు, సాంఘిక, ఆర్థిక సిద్ధాంతాలకు సర్వోదయ వ్యాప్తి వలన ఎటువంటి హానిచేకూరదు. స్వశక్తి, స్వావలంబనముపై జీవించే అర్హత పొందడము సర్వోదయ కార్యక్రమములోని మొదటి సిద్ధాంతంగా పేర్కొనబడింది. దీనివలన గ్రామాల ప్రాధాన్యత ఇనుమడిస్తుంది. పట్టణ కేంద్రీకృతములైన ఆర్థిక చిక్కులన్నిటి నుంచి గ్రామాలకు విముక్తి లభిస్తుంది. గ్రామాలన్నీ ప్రాతిపదిక కేంద్రాలుగా ఏర్పడుతాయి తమ కవసరమనిపించే పదార్థాలను గ్రామప్రజలే ఉత్పత్తి జేసుకోగలుగుతారు మహాత్ముడు ఆశించిన 'గ్రామరాజ్యం' సర్వోదయ వల్లనే సాధ్యం అవుతుంది.

## గాంధీజీ దృష్టిలో గ్రామరాజ్యం

గ్రామరాజ్యం గురించిన మహాత్ముని అభిప్రాయాలిలా ఉన్నాయి. "నా అభిప్రాయంలో గ్రామరాజ్యం అనగా ఒక గ్రామం అన్నివిధాలా స్వతంత్ర పంథాలో జీవించే అర్హతను సంపాదించుకోవడమే. తన ప్రజల అవసరాల కొరకు ఇరుగు పొరుగునవున్న గ్రామాలవైపు పట్టణాలవైపు ఆ గ్రామం పరుగెత్తగూడదు

తనకు అవసరమనిపించే ఆహార ధాన్యాలను, పత్తిని గ్రామంలోనే ఉత్పత్తి చేసుకోవాలి. పశుసంపద పోషణకోసం తగినంత పచ్చిక మైదానాల్ని ఏర్పరుచుకోవాలి. వినోద విహారాల నిమిత్తం ఆట స్థలాలను విహారస్థలాలను నిర్మించుకోవాలి. ఇంకా ఏమైనా భూమి మిగిలితే ఆ క్షేత్రాలలో వాణిజ్య పంటలను పండించాలి. ఆ గ్రామములో ఒక పాఠశాల, ఒక చర్చాభవనం (పబ్లిక్‌హాలు) ఉండాలి. తాగటానికి మంచినీటి సదుపాయన్ని ఒనగూర్చుకోవాలి." ప్రగతి పథంలోని యీనాటి గ్రామాలకు ఈ సౌకర్యాలన్నీ సమకూరుతూనే ఉన్నవి.

## సర్వోదయ కార్యక్రమంలో విద్యార్థుల పాత్ర

ప్రజల నైతికబలంపై సర్వోదయ కార్యక్రమము యొక్క విజయము ఆధారపడి వున్నదనేది విస్పష్టమైన అంశం. హింసాత్మక పద్ధతి ద్వారా సాధించనున్న విప్లవాన్ని అహింసాత్మకమైన మార్గంలో సాధించ దలచినప్పుడు ఆ దేశ ప్రజలలో ఎంతైనా మనోధైర్యమూ, నైతికబలమూ అవసరమై ఉంటవి. వివిధ రాజకీయ పక్షాలు విద్యార్థులను ఉపయోగించుకుంటున్న విధంగానే సర్వోదయ కార్యక్రమవ్యాప్తికి విద్యార్థులను వినియోగించుకున్న పక్షంలో కొంత సాంఘిక ప్రయోజనం సమకూరవచ్చు. విద్యార్థులలో స్వేచ్ఛాయుతమైన వివేచనశక్తిని రూపొందించి కార్మికులను వ్యవసాయకూలీలను గౌరవించే దృక్పథాన్ని అలవరచిన పక్షంలో ముందుముందు సమాజానికి మేలు జరుగవచ్చు. తమ దేశపు విద్యార్థులను సాంస్కృతిక రాయబారులుగా పేర్కొంటున్నవి వివిధదేశాలు. వెర్రితలలు వేస్తున్న ప్రాంతీయ సంకుచిత ధోరణులనుంచి విద్యార్థులను దూరంగావుంచి, సర్వోదయ కార్యక్రమం వైపు వారిమేధా సంపత్తి మరలించినట్లైతే గాంధీజీ కలలుగన్న గ్రామరాజ్యాన్ని సాధించుకోవడంతోపాటు జాతీయ సమైక్యతనుగూడ మనం పటిష్ఠపరచుకొన్న వారమవుతాము.

## గ్రామసేవ ద్వారా జాతిసేవ

గ్రామాలకు సేవ జేసినవారు తద్వారా దేశానికి సేవజేసిన వారవుతారని గాంధీజీ పలుసార్లు వక్కాణించారు.

"గ్రామంలో నివసిస్తున్న ప్రతి ఒక్క దరిద్ర నారాయణుడితో విద్యార్థులు సంబంధాన్ని పెట్టుకోవాలి. పాకీవానిగా, నర్సుగా తగాదాల పరిష్కర్తగాతన వివిధ రూపాలను కనబరచాలి. తరువాత ప్రశాంతంగా ఇంటి యజమానిలాగ విశ్రాంతి తీసుకోవాలి. తన పిల్లలు ఇరుగు పొరుగువారి పిల్లల మధ్య ఎలాటి భేదాన్ని చూపరాదు. ధనాన్ని గుప్తంగా దాచక అందరికీ వినియోగ పడేలా చూడాలి. బీదవారి అవసరాలేమిటో కనుగొని తన అవసరాలతో పాటు వారి అవసరాలనూ తీర్చాలి. ఇతరులకు సహాయపడాలనే ఉదారబుద్ధి కలిగివున్నప్పుడు తనవి పరిమితమైన అవసరాలై ఉండాలి, లేక పోయినట్లయితే యితరులకు సహాయపడటం సాధ్యం కాజాలదు. అంటరానితనాన్ని, దేశంలోనున్న కులమత భేదాలను రూపు మాపటానికి కంకణం కట్టుకోవాలి." ఇవి విద్యార్థిలోకానికి, యువతరానికి గాంధీజీ సూచించిన కొన్ని సూక్తులు. సర్వోదయ సిద్ధాంతంలోని ముఖ్యాంశాలు గూడా యివే.

## సర్వోదయ శాఖలు

భూదానము, జీవనదానము, శ్రమదానము, బుద్ధిదానము, సంపత్తిదానము సర్వోదయ కార్యక్రమములోని ముఖ్యశాఖలుగా వున్నవి. దేశానికి సేవ చేయాలనే సంకల్పమున్నవారు, రాజకీయానుబంధాలు లేనివారు వీటిలో వేటినైనా స్వీకరించి ఆచరించవచ్చు. ఇవన్నీ గాంధీజీ కలలుగన్న గ్రామరాజ్యానికి సోపానాలు.

## భూదానోద్యమము

భూమిలేని పేదప్రజలకు భూమిని సంపాదించి పెట్టాలనే లక్ష్యంతో 1951 నుండి రాష్ట్రాలలో పాదయాత్రను ప్రారంభించారు, ఆచార్య వినోభాభావే. అన్నిరాష్ట్రాలలో భూదాన సమితులేర్పడ్డాయి. వాటికి ఆయారాష్ట్ర ప్రభుత్వాల సహాయ సహకారాలు లభ్యమవుతున్నాయి. రాష్ట్రప్రభుత్వాలు గూడా తమ ఆధీనంలో సేద్యయోగ్యంగా వుండి నిరుపయోగంగా పడివున్న భూములను భూదానానికి యిచ్చివేస్తున్నాయి. వెనుకటి మధ్య భారత్ ప్రభుత్వం 2 లక్షల ఎకరాల భూమిని విరాళంగా యిచ్చింది రాంపూర్ మహారాజా రెండున్నర లక్షల ఎకరాల భూమిని ఒక్కరే దానంచేసి భూదానం జేసిన దాతలలో అగ్రగణ్యులనిపించుకున్నారు.

గత పదిహేను సంవత్సరాలుగా భూదానోద్యమంలో ఆచార్య వినోభాభావే దాదాపు 60 వేల మైళ్ళు కాలి నడకన పర్యటించారు. ఈ పర్యటనలో భూదానంగా 42 లక్షల ఎకరాలను, గ్రామదానంగా 145 వేల గ్రామాలను ఆయన స్వీకరించారు. ఈ సేకరించిన భూమిలో ఇంతవరకు 11.75 లక్షల ఎకరాలను 5 లక్షల బీదలకు పంచారు.

సోషలిస్టు సమాజస్థాపనకు సర్వోదయ జేస్తున్నకృషి దేశవిదేశాల గౌరవాన్ని పొందుతున్నది. శ్రీ జైప్రకాశ్ నారాయణ్ వంటి ప్రముఖ నాయకులు సర్వోదయ కార్యకర్తలుగా మారిపోవడం వలన ఈ ఉద్యమానికి విశ్వఖ్యాతి లభించినది. గాంధీజీ కలలుగన్న గ్రామరాజ్యాన్ని సర్వోదయ సిద్ధాంతాలతో వీరు సాధించ గలుగుతున్నారు. మనదేశ చరిత్రలో చరిత్రాత్మకమైన పవిత్ర సంఘటనగా భావితరాల వారు సర్వోదయ ఉద్యమాన్ని పేర్కొంటారు.

# నివాళి

ఆర్. అనంత పద్మనాభరావు

శ్రీ విభవమ్ము సద్గుణ విశిష్టత, సర్వ సమత్వ భావమే
భావి ప్రజాళి ధ్యేయముగ భారతమే నడిపించు నేతయై
యే వరణీయ మూర్తి గడియించె మహాత్మ పదాంచితాత్ముడై
భావి తరాలకున్ పరమపావన మూర్తిగ నిల్చియుండుటల్.

మరువడు రామనామజప మంత్రము, తా కదలంగ జాతియే
పరుగులు తీయుచుండునట. పల్కిన పల్కులు జాతికిన్ శిలా
క్షరములు, దీక్ష బూనినను కాలమె స్థంభనమైన రీతిగా
వరలును. అట్టి జాతిపిత బాపును సంస్మరణమ్ము జేసెదన్.

భారత భాగ్యధాత సలుపందలపోసిన యాగదీక్ష, ఆ
ధీరుని కన్నుసైగ ప్రజ దీక్షను బూనగ వేదవాక్కు, వే
సారిన జాతి జీవనము శాసనజేయు శిలాక్షరమ్ము, లీ
భారత జాతికంతకును పల్కులు మంత్ర సమానమాయెబో!

కాయము బక్క పల్చనిది. కట్టిన వస్త్రపు డాబు లేదు, కొ
ల్లాయి ధరించియుండెడి కళామయమూర్తి, స్వరాజ్య సిద్ధియే
ధ్యేయము! హింసకూడదనియే వచనమ్ము! అహింసయే జగ
చ్ఛ్రేయమటంచు శాశనము జేసెను స్వీయవచోమృతంబునన్.

భారత వీర మాత తన బంగరు బిడ్డల కుగ్గుబాలతో
నేరుపు వీరగాథల ననేకము. శాంతి, నహింసను దెల్పిదో
స్ఫారత దేశ రక్షణకు ప్రాణము లొడ్డగనైన సిద్ధమా
తీరునుదెల్ప జాతిపిత దివ్యచరిత్రమె వేదమంత్రమా!

శాంత్యహింసా చక్ర జాతీయ రథమును
సాగించు మానవ జాతి నేత
సత్యాగ్రహమ్ముల, స్వాతంత్ర్య దీక్షల
జయము సాధించిన శాంత మూర్తి
'రఘుపతి రాఘవ రాజా!' యనుచు మత
సహనమ్ము నేర్పిన సహనమూర్తి
హరిజనోద్ధరణకై అహరహమ్మును దీక్ష
బూనినయట్టి సమ్మోహమూర్తి
జాతిను త్తేజ పరచిన సౌమ్యమూర్తి
జాతి స్వేచ్ఛనుగూర్చిన సత్యమూర్తి
గణ్య చరితాన్వయోదాత్త పుణ్య మూర్తి
మానవాళి నివాళికి మాన్యమూర్తి.



### కీర్తికాయము

న్యాయమ్మునకై పోరిన
ఏ యయ్యకు జరిగె న్యాయ మీ జగమున? నీ
వా యయ్యల సమ ఉజ్జివి
కాయము పోయినను కీర్తి కాయము నిలచెన్

-విద్వాన్ విశ్వం

# రక్షించు బాపూ ! రక్షించు

బాపూ !

అయినాల కనకరత్నాచారి

భయంకర రాక్షస ద్వేషతిమిర సమూహముల
తొలగించ వచ్చిన అమర జ్యోతివి నీవు.

సత్యాహింసలు వివస్త్రలై
వినమ్రతతో నీ వెంట నడచి వచ్చాయి.

నిర్దిష్టమైన నీ మార్గంలో మమ్మల్ని నడపించావు.
కాదు ; మేమే నడచివచ్చాము
నీ అడుగు జాడల్లో, మేమే కాదు,
మన యితిహాసము సైతమూ రొప్పుతూ పరుగెత్తింది.

ఆ నాటి వినిర్మలమైన విరుల బాటల్లో
ఇప్పుడన్నీ ముళ్ళూ, రాళ్ళూ, రప్పలే.

అటు పోతున్నామంటూనే, అనుకుంటూనే
ప్రక్కని లప్పడు డొంకల్లో నడుస్తున్నాము మేము.

అమృతం వర్షించే నీ మార్గం
విష సహిత భుజంగ వల్మీకములకు నెలవైంది నేడు.

మానవాళిపై ప్రసరింప జేసిన
నీ చల్లని వట వృక్షాయత బాహుచ్ఛాయలలో
వేరు పొయ్యలు పెడుతున్నాము మేము
కూర్చున్న కొమ్మనే నరుక్కుంటున్నాము.

సత్యం, అహింస, శాంతి, స్నేహం
ప్రేమ, మమత, కరుణ, భక్తి, విశ్వాసములతో నింపి
నీవు వదలిన యీ ప్రజా నౌకను మా నేర్పుతో
సుడిగుండాలలో త్రోయబూనుతున్నాము

పర్వతాలకు మోపి బ్రద్దలుగొట్ట జూస్తున్నాము
అది మునిగిపోతే ; అది బ్రద్దలైతే
మానవతే నశిస్తుంది, దానవతే వశిస్తుంది.

బాపూ !
మమ్మల్ని కాపాడు
ఇంకొక్కసారి మరలా అవతరించి
మమ్మల్ని రక్షించు
బాపూ ! మమ్మల్ని రక్షించు.





## ఎత్తు మనిషి

హిమాద్రి ఎంత ఎత్తు ? హిమాద్రి ఎవరి సొత్తు
మహాత్మా నీ స్వరూపం
తుహినాద్రికి సంక్షిప్త రూపం
బాపూ నీ చిత్తం ప్రపంచానికి దొరికిన విత్తం

-సి. నారాయణరెడ్డి

## కరువు జిల్లాల పథకం:

# ఒంగోలు జిల్లా



క్రొత్తగా ఏర్పాటు చేసిన ఒంగోలు జిల్లా హెచ్చు భాగము మెట్ట ప్రాంతముగా వున్న వర్షాధారమైన ప్రదేశము. ఈ జిల్లాలోని 9 తాలూకాలలో 5 తాలూకాలు నిత్యము కరువు వాత పడు తాలూకాలుగా ప్రభుత్వమే ప్రకటించినది. జిల్లా విస్తీర్ణము 6.500 చ.మైళ్లలో 5 350 చ. మైళ్ల విస్తీర్ణము కరువు వాతపడు ప్రదేశము

భూములు చూద్దామా_ఒంగోలు, అద్దంకి,చీరాల ప్రాంతము లున్నా, కొద్దిగా గిద్దలూరు, కందుకూరులోతప్ప హెచ్చు భాగము సారరహితమైన భూములు ఈ ప్రాంతాల సరాసరి వర్షపాతము 300 మి. మీ. ఉంటుంది, వర్షాలు సకాలములో పడనందున చెర్వులక్రింద మాగాణిసాగు లేకపోగా, ప్రధానపంటలగు సజ్జ,జొన్న

రావిపాటి మహానంద

కొర్ర దెబ్బతింటున్నవి. ఈ ప్రాంతాల పంటలు ఎప్పుడూ ఈ ప్రాంతాల ప్రజల అవసరాలు తీర్చలేవు. అందుకొరకు వందలాది బస్తాల అక్కుళ్ల బియ్యము, నూకలు, జొన్నలు దిగుమతి చేసుకోవాలి.

వందలాది వ్యవసాయ కూలీలు, వరి నాట్లకు కోతలకు పొగాకు బ్యారను పనులకు, వ్యవసాయ జీతాలకు, రిక్షాలు లాగుటకు సున్నపురాళ్ళ అమ్మకము, సోడాబండ్ల పనులకు సాలుకు 5, 6 మాసాలు భార్యా పిల్లలను యిండ్లవద్ద వదలి యితర ప్రాంతములకు జీవించపోతారు.

## జమీందార్ల పాలనలో

స్వరాజ్యము రాకపూర్వము, దరిశి, పొదిలి కనిగిరి, ఒంగోలులో కొంత భాగము జమీందార్ల పాలనలోవుండి ఏమీ అభి వృద్ధి నెరుగవు. స్వాతంత్ర్యము వచ్చినా ప్రభుత్వ నిరాదరణ ఫలితముగా ఎక్కడేసిన గొంగలి అక్కడే వున్నదన్న సామెత యీ ప్రాంతముపట్ల సార్థకమైనది.

దేశములోని కరువుప్రాంతాల నివారణ పథకము క్రింద సెంట్రల్ గవర్నమెంటు వారు యిచ్చిన గ్రాంటు క్రింద రాయలసీమ జిల్లాలు నాల్గింటిని (మార్కాపురము) గిద్దలూరు తాలూకాలతో తెలంగాణలోని మహబూబునగరు జిల్లాను చేర్చినారు. ఈ పథకముక్రింద సుమారు 15, 16 కోట్ల రూపాయలు గ్రామీణ పథకాలకు ఖర్చుచేస్తారు.

మన వ్యవసాయ పథకాలకు నాగార్జునసాగరు పోచంపాడు ప్రాజెక్టు క్రింద కొంత ఆయకట్టు అభివృద్ధికి రైతులకు ఋణాలు వగైరాలకు ప్రపంచ బ్యాంకు రూ. 30 కోట్లు యిచ్చినట్లు ప్రకటింపబడినది.

రాష్ట్ర ప్రభుత్వ బడ్జెటులో వెనుకబడిన కరువు ప్రాంతాల అభివృద్ధికి, కేటాయించిన రు. 15 కోట్లలో ఈ రాయలసీమకు (మార్కాపురము గిద్దలూరు తాలూకాలతో) 4 కోట్లు, తెలంగాణాకు 9కోట్లు మిగితా రాష్ట్రమంతటిలోని వెనుకబడిన ప్రాంతాలకు రెండు కోట్లు కేటాయించబడినవని పోయిన శాసనసభ సమావేశములో నా ప్రశ్నకు బదులు చెబుతూ ఉప ముఖ్యమంత్రి శ్రీ నరసింగరావుగారు తెల్పిరి.

చిన్న రైతుల అభివృద్ధి పథకము క్రింద సెంట్రల్ గవర్నమెంటు ఒక్కొక్క జిల్లాకు 1.5 కోట్లు కేటాయింపుకు శ్రీకాకుళము కడప, నల్గొండ జిల్లాలను ఎన్నికచేసింది.

వ్యవసాయ కూలీలు, సన్నకారు రైతుల అభివృద్ధి పథకము క్రింద సుద్యోగవసతులు, తదితర అభివృద్ధి సహాయ కార్యక్రమాల క్రింద సెంట్రల్ గవర్నమెంటు జిల్లాకు కోటి రూపాయల వంతున విశాఖ, చిత్తూరు, నల్గొండ జిల్లాలు ఎన్నిక చేసింది.

అమెరికా సహాయంతో నిర్వహింపబడు గ్రామీణ విద్యుదీకరణ (క్లస్టరు) పథకాలక్రింద మార్కాపురం వినుకొండ మొదలగు ప్రాంతాలు చేర్చబడినవే కాని ఒంగోలు జిల్లాలో మిక్కిలి వెనుకబడిన దరిశి, పొదిలి, కనిగిరి, కందుకూరు తాలూకాల ప్రస్తావనయే లేదు.

నెల్లూరు జిల్లాకు దూరంగా యున్నందున అభివృద్ధిచెందమనే బాధతో క్రొత్తజిల్లా కావాలని ఆందోళన సాగించితిమి. ప్రభుత్వము ఆర్థికంగా బక్కచిక్కిన మమ్మందరినుచేర్చి క్రొత్త జిల్లా ఏర్పాటు చేసింది.

ప్రభుత్వము నాగార్జునసాగరు మొదటి రెండవ దశలు కరవు నివారణ పథకము క్రిందనైన తీసికొని దరిశి, పొదిలి మార్కాపురం, కనిగిరి, కందుకూరు తాలూకాలకు నీరు యివ్వవలసిన అవసరం వుంది.

జిల్లాలోని 80% ప్రాంతము కరువు ప్రాంతముగావుండి రహదారి, వైద్య సౌకర్యాలలోగాని, నీటి సాగులోగాని ఎంతో వెనుకబడి వుండే ఒక జిల్లాలోని ప్రాంతాలకు వేరు వేరు న్యాయము, అనగా మార్కాపురం, గిద్దలూరు తాలూకాలకు రాయలసీమ డెవలప్‌మెంటు బోర్డు సౌకర్యాలు, సెంట్రల్ గవర్నమెంటు యిచ్చే ప్రత్యేక పథకాల గ్రాంటు యిస్తూ అంతకన్నా అన్ని రంగాల్లో వెనుకబడివున్న మిగతా తాలూకాలను నిరాదరించుట న్యాయము కాదు.

జన సాంద్రతా, నిరక్ష్యరాస్యత, షెడ్యూలు జాతులు, వర్షపాతము, పంటల ఉత్పత్తి, విద్యుచ్ఛక్తి సప్లయి, పరిశ్రమలు మొదలగు అన్ని రంగాల్లో ఆటు రాయలసీమజిల్లాలు, ప్రభుత్వము వారు చెప్పు తెలంగాణా మహబూబ్‌నగరు, నల్గొండ జిల్లాలకన్న ఒంగోలు జిల్లా ప్రాంతాలు ఎంతో వెనుకబడియున్నవి.

విశాఖ, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలలో పెద్ద పరిశ్రమలు చెరుకు, నూలు మిల్లులు పలకల రాతి పరిశ్రమలు మొదలగునవి వున్నవి. ఒంగోలు జిల్లాలో, చీరాలలో నూలు మిల్లులు తప్ప శూన్యము.

## త్రాగే నీరు

సరియైన మంచినీరు లేక దరిశి, పొదిలి తాలూకాలలో షుమారు 40 గ్రామాలు ఫ్లోరిన్ నీటి బాధను తరతరాల నుండి అనుభవించుచున్నారు. వారానికి రెండు సార్లు మాత్రమే చాకలికి బట్టలువేయు కొచ్చర్లకోట ప్రాంతాలు యింకా దరిశి తాలూకాలో యున్నవి.

ప్రభుత్వమువారు ఒంగోలు జిల్లాలోని యీ దయనీయ పరిస్థితులు గమనించి సెంట్రల్ గవర్నమెంటు ప్రతిపాదించిన స్కీములలో ఒంగోలు జిల్లాను కూడ చేర్పించి, అభివృద్ధి చెందుటకు దోహదమొసంగ కోరుతున్నాను.

## పాఠకులకు....

ఈ సంచిక ఎలా వుంది ?

ఇంకా ఎలా వుండాలని మీ ఉద్దేశం ?

సలహాలు కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

(ప్ర. సం.)

# కోనసీమలో జగ్గన్నతోట ప్రభలతీర్థం

గోర్తి సూర్యనారాయణ

[కోనసీమలో మకర సంక్రాంతి మరునాడు కౌశికాతీరాన జరిగే జగ్గన్నతోట ప్రభల తీర్థానికి కోనసీమ నలుమూలల నుంచి వేలాది జనులువచ్చి, వివిధ గ్రామాల నుంచి ప్రభలమీద వచ్చిన రుద్రులకు అరటిపళ్ళు, కొబ్బరిపళ్ళు ఇచ్చి, కొలుచుకొంటారు. ఈ తీర్థం గురించిన వివరాలు ఈక్రింద వ్యాసంలో పొందుపరుస్తున్నాము—సం.]

ప్రాచీన సంస్కృతికి, సాంప్రదాయాలకు నిలయమైన భారత దేశం, ఈ అణుయుగంలో చంద్రమండలంలో మానవుడు అడుగిడుతున్న కాలంలోకూడ, ప్రాచీన సాంప్రదాయాలను అనుక్రమంగా ఆచరించుతూ వస్తున్నది. కోనసీమలో ఏటేట మకర సంక్రాంతి మరునాడు జరిగే "జగ్గన్నతోట ప్రభలతీర్థం" తరతరాల నుంచి ఆనూచానముగా వస్తున్న సాంప్రదాయానికి ఒక విశిష్టమైన ఉదాహరణ. కొన్ని శతాబ్దాల నుంచి పారంపర్యంగా వస్తున్న ఈ ప్రభలతీర్థం పుట్టుపూర్వోత్తరాలు. ఈ తరం వయోవృద్ధులకు కూడ తెలియవు. ఈ తీర్థం ఎప్పుడు పుట్టిందని ఒక శతవృద్ధుని అడుగగా, వారి తాతముత్తాతలనాటి నుంచి అనుక్రమంగా వచ్చుచున్నదని, వారికికూడ ఎప్పుడు పుట్టిందో తెలియవని అన్నారు.

ఈ తీర్థం జరిగే ప్రదేశం "జగ్గన్నతోట", ఒకప్పుడు జగ్గన్న అనే వ్యక్తికి చెందిన విశాలమైన కొబ్బరితోట. ఇప్పటికి ఆ తోట యాజమాన్యం చాలా చేతులు మారినా జగ్గన్నతోట అనే పేరు మాత్రం శాశ్వతంగా ఉండిపోయింది. ఈ జగ్గన్నతోట తూర్పు గోదావరి జిల్లాలోగల అమలాపురం పట్టణంకు 8 మైళ్ళ దూరంలో గంగలకుర్రు—పుల్లేటికుర్రు గ్రామాలమధ్య కౌశికా తీరాన ఉంది.



జగ్గన్న తోటలో వివిధ గ్రామాల నుంచి వచ్చిన ప్రభలు



కౌశిక నదిని దాటుతున్న గంగలకుర్రు అగ్రహారం ప్రభ

ఈ తీర్థానికి 11 గ్రామాల ప్రభలు వస్తాయి. ఈ పదకొండు గ్రామాల దేవుళ్ళ సమాగమమును ఏకాదశ రుద్రుల సమాగమమని అంటారు. పరిపూర్ణమగు శివతేజ నిలయము అని భావిస్తారు. ప్రభ అంటే తేజస్సు. వీరభద్ర వాహనం. దక్షయజ్ఞ కారణంగా సతీదేవి యోగాగ్నిలో దహనమైనందున శంకరునికి క్రోధము ప్రజ్వరిల్లి, శివతాండవానంతరము, ఉద్భవించిన శివతేజమగు వీరభద్రునికి ప్రభరక్షయై, దక్షయజ్ఞమునకు ఉగ్రమూర్తియై వెళ్ళుటకు ఉపయోగింపబడ్డ వాహనమని శివపురాణంలో చెప్పబడుతోంది. 14 అడుగుల తాటిశూలంకు చిల్లులు పొడిచి వెదురు బద్దలతో పెరబాలిక్ ఆకారంలో (అంటే అర్ధ కోడిగుడ్డు ఆకారంలో) తడక తయారుచేసి, వస్త్రాలతోను, నెమలి పింఛాలతోను, గుమ్మడికాయలతోను గంటలతోను, వివిధాలంకారాలతోనూ అలంకరిస్తారు. ఇందులో కలంకారీ దుప్పటము ఒక ప్రత్యేకాలంకారము ఆ దుప్పటముపై దక్షయజ్ఞకథను స్ఫురింపచేయు చిత్రములు అద్దబడి యుండును. వెనుకతట్టున ఎర్రటిగుడ్డ కప్పబడి యుండును. ఈ ప్రభను ఒక అనువైన బల్లపై నిలబెట్టి బల్ల క్రింద భాగంలో మర్రి ఊడల దండెలను పగ్గములతో బిగించి గ్రామస్థులు అత్యంత భక్తితో, తమ భుజములపై నిడుకొని ఈశ్వరాలయము వద్దకు గొంపోయెదరు. అచ్చట వేదపండితులు వేద మంత్రోచ్చారణలు గావించుచుండ, మంగళవాద్యములు మ్రోగుచుండగా, ఆలయములోని ఈశ్వర విగ్రహమును ప్రభపై అలంకరించి మరల భుజములపై నిడుకొని, దుక్కిదున్నిన కొబ్బరితోటలగుండా కోతకు సిద్ధంగావున్న పంటచేలగుండా, ముళ్ళపొదలగుండా ఆ భక్తిపారవశ్యముచే శ్రమనంతయు లెక్కింపక జగ్గన్నతోట అనబడు తీర్థప్రదేశమునకు గొంపోవుదురు.

తమ సస్యములు పాడైననూ, తమ పొలముల మీదుగా ప్రభను గొంపోవుటకు రైతులు ఎట్టి అభ్యంతరము చేయకపోవుట సరికదా. తమ తోటలు, చేలు, పవిత్రమై అత్యధిక పంట నొసంగునను దృఢవిశ్వాసముతో రైతులు సంతసింతురు. ఈ తీర్థానికివచ్చే 11 గ్రామాల ప్రభలు గంగలకుర్రు, గంగలకుర్రు అగ్రహారం, పాలగుమ్మి, మొసలపల్లి, ఇరుసుమండ, ముక్కామల, నేదునూరు, వక్కలంక, పుల్లేటికుర్రు, వ్యాఘ్రేశ్వరము, కె. పెదపూడి గ్రామాల నుంచి వస్తాయి. ఇందు అత్యంత రమణీయమై తీర్థవాసులను మిక్కిలి ఆకర్షించి భక్తిని రేకెత్తింపగల గంగలకుర్రు-గంగలకుర్రు అగ్రహారం గ్రామాల నుండి వచ్చు ప్రభలు ప్రశంశార్హములు. ఈ రెండు గ్రామాలనుండి ప్రభలు బయలుదేరి తీర్థప్రదేశమునకు ప్రక్కనగల కౌశికా ప్రవాహమును దాటునపుడు, ఆ ప్రభను మోయువారు ఆ నీటిలో బురదలో నడచుటకు అత్యంత శ్రమ కోర్చవలెను. ఈ రెండు ప్రభలు కౌశికను దాటించునప్పటి దృశ్యమును, తీర్థమునకు వచ్చిన జనులు

తండోపతండములుగా కౌశికకు ఇరుతటముల మీదనుండి, అత్యంత కౌతూహలముతో తిలకింతురు. వివిధ గ్రామాల నుంచి వచ్చిన ప్రభలను తీర్థప్రదేశమున (జగ్గన్నతోట) సాయంకాలము సూర్యాస్తమయ పర్యంతము అచ్చట నుంచుదురు. అనూచానముగా ఏ ప్రదేశమందు ఈ తీర్థములో, ప్రతి సంవత్సరం ఏ గ్రామ ప్రభ ఉంచబడునో ఆ ప్రదేశమందే నుంచబడును గాని మార్పు ఏ మాత్రం ఉండదు. ఇది ఇచ్చటి విశిష్టతలలో నొకటి.

పూర్వకాలంలో గ్రామస్థులు ఒక గ్రామంతో ఇంకొకరు పోటీపడి 20 నుండి 22 అడుగుల ఎత్తువరకు ప్రభను కట్టి తీర్థం తీసుకొని వెళ్ళేవారు. కాని ప్రస్తుతంలో కోనసీమకు ఎలక్ట్రిసిటి వచ్చిన కారణంగా వాటి తీగలు అడ్డుతగులుచున్న కారణంగా ఆ సైజు తగ్గించవలసి వచ్చింది.

కోనసీమ నలుమూలలనుంచి ప్రతి సంవత్సరం ఈ తీర్థానికి చిన్న, పెద్ద, ఆడ, మగ, క్రొత్తళ్ళుళ్ళు కూతుళ్ళతో సహా, నవనాగరికులు కూడ హెచ్చుమంది రెండెడ్ల బళ్ళమీద విలాసముగా వచ్చి బంధు మిత్రులను కలుసుకొని ఒకరి నొకరు అభినందించుకొంటారు. కొంతమంది సైకిళ్ళమీద, మరికొంత మంది కాలి నడకను ఇతరవాహనములమీద తీర్థం చేరుతారు. ఈ సంతోష సమయమున వివాహసంబంధ విషయక ప్రస్తావనలు కూడ జరుగును. అంతటితో ఆగక పెండ్లికూతురు చూపులు కూడ అచ్చట జరుగుట కలదు. ఇట్టి తీర్థములో ఆరంభింపబడిన సంబంధములు జరుగక పోవుట చాల అరుదు. అది పరమేశ్వర సన్నిధానమందలి శక్తియేమో తెలియదు. తీర్థమునకు వచ్చిన ప్రజలెల్లరు అచ్చట అన్ని ప్రభల రుద్రులకు అరటిపళ్ళు, కొబ్బరి కాయలు, నారింజలు, బత్తాయిలు మొదలగు ఫలముల నర్పించి కొలుతురు. ఈ తీర్థానికి పిల్లలను ఆకర్షించు వివిధ ఆటవస్తువుల దుకాణములు, రంగులరాట్నములు, మిఠాయి దుకాణములు, ఇత్తడి సీమవెండి, ప్లాస్టిక్, ఫ్యాన్సీ దుకాణములు, కాఫీ హోటల్సు కర్ర యంత్రంతో చెరుకురసం తీసే దుకాణములు మొదలగునవి ఎన్నో వచ్చును. సాయంసంధ్య వరకు తీర్థము సాగును. పిమ్మట ప్రభలను ఆ యా గ్రామములకు గొంపోవుదురు. కోటప్పకొండ తీర్థంవలె ఇచ్చట ప్రభలను బళ్ళమీద తీసుకొనిపోరు. ఆ యా గ్రామవాసులు తమ భుజాలమీద నుంచుకొని తీసుకొని వెళ్ళుట ఈ తీర్థం యొక్క మరి యొక ప్రత్యేకత. ఈ ప్రభల తీర్థములు కోనసీమలో ఇంకను వివిధ ప్రాంతములలో (ముక్తేశ్వరం, అమలాపురం, ఇందుపల్లి, బండార్లంక, వానపల్లి గ్రామములో) కూడ జరుగును. పరికింపగా జగ్గన్నతోట ప్రభల తీర్థమే వీటి కన్నింటికి మార్గదర్శకమై వెలయుచున్నట్లు తెలియుచున్నది.



పదిరి దాటిస్తున్న ప్రభను ఉత్సాహంగా తిలకిస్తోన్న ప్రజలు

# జల్లి సమిష్టి క్షేత్రము

## హరిజనుల సమిష్టి కృషి

బి. సుదర్శనం

అనాది నుండి షెడ్యూల్డు కులాల వారు నిమ్నజాతుల వారు సాంఘికంగా అట్టడుగునఉండి ఆర్థికంగా వెనుకబడి, సాంస్కృతికంగా అంధకారములో వున్నారు. రాజకీయ స్వాతంత్ర్య సాధనముతో వారి సాంఘిక పరిస్థితి మెరుగుబడుట కవకాశం కలిగింది. రాజ్యాంగ నిర్మాణ నిపుణులు సాంఘికంగా వెనుకబడిన బలహీన వర్గాలకు ప్రత్యేకఅవకాశాలను కల్పించడానికి రాజ్యాంగంలో (275). అర్టికల్‌ను రూపొందించారు తదనుగుణముగా నిమ్నజాతులకు (హరిజనులకు) స్త్రీలకు మరియు ఆటవిక జాతుల వారి సంక్షేమార్థమై. 1%, 5%, 3%. వరుసగా నిర్ణీత కేటాయింపులను దేశ ఆర్థిక వసరులలో కల్పించారు.

స్వాతంత్ర్యము లభించినదాదిగా హరిజనులకెన్నో వసరులు కల్పించారు. దుస్తులు పంచిపెట్టారు. పరిశ్రమలు నెలకొల్పారు. బంజరు భూములను పంచిపెట్టారు, గృహములు. విద్యావసరులు కల్పించారు.

ఇటీవల వరంగల్ జిల్లాలో, అత్యున్నత భావాలతో క్రియాత్మక దృక్పథం కలిగిన భూమిలేని నిరాధారులైన పేదహరిజనుల కుటుంబాలకు చెందిన 165 మంది సభ్యులు, 'జల్లి' సమిష్టి సహకార వ్యవసాయ క్షేత్రాన్ని స్థాపించారు. 1971 మార్చి 25వ తేదీన 'జల్లి' గ్రామంలో యీక్షేత్రం ప్రారంభించబడింది. దాదాపు రూ. 3 లక్షల వ్యయంతో జిల్లాలోని హరిజనులకు జిల్లాపరిషత్ 15% నిల్వల నుండి గృహనిర్మాణం చేయటానికి సంకల్పించబడింది. అవి ఇప్పటికే పూర్తిఅయ్యాయి. హరిజన కుటుంబాలకు పంచి యివ్వడం కూడా పూర్తిఅయింది. నర్సంపేట, ములుగు, జనగామాలలో. అటులనే సమితుల నిల్వలనుగూడా హరిజనోద్ధరణ కార్యకలాపాలకు వాడగలరని ఆశాభావం వెల్లడించబడింది.

'జల్లి' సమిష్టి సహకార సంఘ కార్యకలాపాలు జిల్లా కలెక్టరు గారి పర్యవేక్షణలో సత్వరమే చేపట్టబడ్డాయి. దాదాపు 1766 ఎకరాల మైసూరాను జల్లీ, ఎల్లాయిగూడా తిమ్మరాయన్ పాడు గ్రామాల మధ్య భూమిని, రేయనక పగలనక, సర్వే చేయడం, వ్యనసాయయోగ్యంకాని భూమిని విడగొట్టడం జరిగింది, రాళ్ళు. గుట్టలు, బర్రెలు పోగా దాదాపు (1,000) ఎకరాల సేద్యయోగ్య భూమి లభించింది. అందు దాదాపు 40. యకరాలు హరిజన సభ్యులకు పునరావాసం కల్పించుటకు కేటాయించబడినది. మొత్తము క్షేత్రయోగ్య భూమిని రెండు విభాగములు గావించారు. జల్లీ బ్లాకు 1, జల్లి బ్లాకు 2. మొదటిది నర్సంపేట, నెక్కొండ పి. డబ్ల్యుడి. రోడ్డుపై తిమ్మరాయన్ పాడు బస్‌స్టాప్ వద్ద స్థాపించబడింది. (ఖాదర్ పేట సివారులో) రెండవదానిని జల్లి యెల్లాయగూడాకు మధ్య నెలకొల్పారు.

ఈ సమిష్టి క్షేత్రాన్ని స్థాపించి కేవలం నాలుగు మాసాలే ఐనప్పటికి ట్రాక్టర్లు తెప్పించి దాదాపు 300 ఎకరాలను దున్నడం జరిగింది. 182 ఎకరాలలో సంకర మొక్కజొన్న, ఎన్.పి.హెచ్ 1. ఆముదాలు పెసర్లు మొదలుగల పైర్లువేశారు. పైర్లు ఏపుగా పెరుగుతున్నది. మరోప్రక్క మిగిలిన 660 ఎకరాల భూమిని దున్నుటకు సన్నాహాలు ముమ్మరంగాజరుగుతున్నాయి. (60)జతల ఎడ్లను కూడా కొనియిచ్చారు. యీ సంఘసభ్య హరిజన రైతులకు రెండు ట్రాక్టర్లను కొనడానికి సన్నాహాలు జరుపుతున్నారు.

ఇటీవల జిల్లా కలెక్టరుగారు పై రెండు క్షేత్రాలను సందర్శించి కావలసిన సదుపాయాలను కల్పించుట కక్కడి కక్కడే నిర్ణయం తీసుకొన్నారు. బ్లాక్ రెండులో పనివారల సంక్షేమార్థమై "క్రాష్" మరియు పోషకాహార కార్యక్రమాన్ని నిర్వహించుటకు మరియు మొదటి బ్లాకు నందు ప్రాథమిక పాఠశాలలను నెలకొల్పుటకు నిశ్చయించారు. వైద్య సహాయము అంద జేయుటకు కావలసిన ఏర్పాటులు గావించారు. అచటి గ్రామ సేవకులకు ప్రథమ చికిత్స 'కిట్' లను కూడా యిచ్చుటకు నిర్ణయించారు. అదనపు పనిని కల్పించుటకు భూసారరక్షణ పథకాన్నమలుపరచి మరియు వ్యవసాయ బావులను త్రవ్వుట ద్వారా ఆ సభ్యుల వ్యవసాయ వ్యవధిని సద్వినియోగ పరచుటకు నిర్ణయించారు.

ఈ సమిష్టి వ్యవసాయ క్షేత్రమును దిగ్విజయము గావించుటకు బృహత్తర ప్రణాళికను రూ. 9.22 లక్షల మేరకు రూపొందించారు. ఇందు 5 లక్షలు 40 వ్యవసాయ బావుల త్రవ్వకానికి, 1.80 లక్షలు భూమిని వ్యవసాయ యోగ్యంగావించుటకు, 1 లక్షతో ఎడ్ల జతలను ట్రాక్టర్లను కొనుటకు కేటాయించారు. మిగిలిన మొత్తాన్ని సభ్యులకు పనిచేయు కాలానికి జీవనోపాధి సహాయానికి తదితర వ్యవసాయ ఖర్చులకు పరికరాలకు వినియోగిస్తారు. కాగా (40) వ్యవసాయ బావులను త్రవ్విన పిదప విద్యుచ్ఛక్తిలో నీరు తోడు యంత్రాలను కూడా నెలకొల్పుతారు. మంచి నీటి బావుల త్రివ్వకం మరియు తాత్కాలిక గృహాల నిర్మాణం కూడ దాదాపు ముగిసింది. (76) సంఘసభ్య కుటుంబాలు యిప్పటికే కాపురాలు క్షేత్ర శిబిరాల వద్దకు తరలించారు.

సాధారణ హరిజన కుటుంబాలకు జల్లి సమిష్ట సహకార క్షేత్రమొక విశిష్టకార్యక్రమము అనవచ్చును. ఆంధ్రప్రదేశ్‌లోనే యీ క్షేత్రము ప్రత్యేకమైనది. క్షేత్రసభ్య హరిజనులలోని సమైక్యత, అవిరళ కృషి కార్యదీక్షలతో పాటు చుట్టు ప్రక్కల గ్రామ రైతుల నైతిక సహాకారముతో జయప్రదం కాగలదని ఆశాభావం. ములుగు తాలూకాయందు రంగాపురం ప్రాజెక్టు కోయలకెంత ఆదర్శమో యీ జల్లి సమిష్టి క్షేత్రము హరిజన నిరుపేదల కంత ఆశాజనకం అనవచ్చు.

---

# నా జీవితానుభవాలు

చెప్పినది : కోలవెన్ను రామకోటేశ్వరరావు

వ్రాసినది : అక్కిరాజు రమాపతిరావు

బెంగుళూరు నుండి రెండవ సంచిక ప్రచురణ జరిగి మూడవ ప్రచురణకు ప్రయత్నిస్తూవుండగానే, నేను డిటిన్యూగా వెల్లూరు వెళ్ళడం సంభవించింది. ఇంచుమించుగా మళ్ళీ నేను విడుదలై వచ్చే వరకూ, బెంగుళూరులో, సహసంపాదకులైన శ్రీసంపద్గిరిరావు, నా పట్ల, త్రివేణి పట్ల, మిక్కుటమైన అభిమానంగల శ్రీ మాస్తి వేంకటేశం అయ్యంగారు, నిట్టూరు శ్రీనివాసరావుగారల సహాయ సహకారాలతో నిర్వహించారు. శ్రీ సంపద్గిరిరావుగారికారోజుల్లో రఘునాథస్వామి, రావుసాహెబ్ అనే మిత్రులు విశేషించి తోడ్పడ్డారు. శ్రీ సంపద్గిరిరావు బెంగుళూరులో జాతీయ కళాశాలకు 'ప్రిన్సిపాల్'గా వుండేవారు. శ్రీరఘునాథస్వామి రావు సాహెబ్ మంచి సంస్కారమూ, ఉత్సాహమూగలయువకులు శ్రీ సంపద్గిరిరావుగారికి పూర్వ శిష్యులు. చందాదారులను చేర్పించటంలోనూ, ముద్రణ, ప్రకటన మొదలైన విషయాల్లోనూ, వీరు సంపద్గిరిరావుగారి కనేక విధాల తోడ్పడుతూ వుండేవారు.

నేను ఎక్కడ ఏవిధంగా కాలంగడుపుతున్నా, త్రివేణి పట్ల మనస్సు సంలగ్నమై వుండేది త్రివేణిని ఇన్నాళ్ళు నిర్వహించడమే నా జీవిత సార్థకతగా భావించుకుంటున్నాను. భక్తి జ్ఞాన_ కర్మ మార్గాలు; యమున, సరస్వతి, గంగలవలె, సత్యం సౌజన్యం, సౌందర్యాలవలె, త్రివేణిలో సాక్షాత్కరించాలని నా పవిత్ర ఆశయం. త్రివేణి ప్రతీకగా జ్వాల, కమలం వజ్రం, ఒకదానిలో వొకటి వొదిగి సాక్షాత్కరిస్తాయి. జ్వాల సాహిత్యానికి సంకేతం. కమలం సౌందర్యానికి అవధి. వజ్రం అచంచలమైన శక్తికి సంకేతం. సత్య సౌందర్య సామర్థ్యాల సంగమం త్రివేణి

రెండో సారి జైలుకు వెళ్ళిన సందర్భంలో అరెస్టు వారంట్లూ, అపీలేకుండా డిటెయిన్ చేసి వేలూరు జెయిలుకు తీసుకొని వెళ్ళి, అక్కడ నుంచి తంజావూరుకు మార్చారు. మొత్తానికి డిటెన్షన్‌లో ఇరవై నెలలుంచారు. ఈ నిర్బంధంలో వుండగా 'త్రివేణిని' బెంగుళూరులో మిత్రులే నిర్వహించారు. జైలునుండి విడుదలై వచ్చిన తరువాత మా స్వగ్రామమైన నరసారావు పేట వచ్చి అక్కడే కొద్దికాలం గడిపాను. ఇంచుమించు మూడు సంవత్సరాలు కాంగ్రెస్ లక్ష్యాలు ప్రచారం చేశాను. స్థానిక రాజకీయాలలో నిర్మాణాత్మకమైన కృషి, ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించటం, అప్పుడు ప్రధానధ్యేయాలుగా వుండేవి. 1946 వ సంవత్సరంలో శాసన సభకు జరిగిన ఎన్నికలకు కాంగ్రెస్ సభ్యత్వాన్ని అభిలషించాను. కాంగ్రెస్ టికెట్ నాకు ఇవ్వలేదు. ఆ ఎన్నికలలో శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి మా నియోజకవర్గం నుండి శాసన సభకు ఎన్నికైనారు. ఆ రోజుల్లోనే పురాతత్వ శాఖవారు త్రవ్వకాలు సాగించి నిధి నిక్షేపాలకన్నా విలువైన చారిత్రిక ఘట్టాల నెన్నిటినో, నాగార్జున కొండప్రాంతంలో త్రవ్వితీశారు. వాటినన్నిటిని ఇతర ప్రదేశాలకు తరలించేతలంపుతో ప్రభుత్వం వుందని వార్తలొచ్చాయి. అక్కడనే పురాతత్వ వస్తు ప్రదర్శనశాల నొకదానిని స్థాపించవలెనన్న సంకల్పం కూడా కొందరు వెలిబుచ్చారు. మాచర్లలో నాగార్జున కళాపీఠం అన్న వొకానొక చిత్రలేఖనాన్ని బోధించే సంస్థనుస్థాపించి కొంత కాలం నిర్వహించాము. బందరు జాతీయ కళాశాలలో విద్య నభ్యసించిన శ్రీగుర్రం మల్లయ్య అక్కడ బోధనను నిర్వహిస్తూ వుండేవారు. దాని కొరకు స్వంతభవనాన్నొక దానిని కూడా ఏర్పాటు చేశాము. అయినా ఈ ప్రయత్నం బాగా వృద్ధిలోకి రాలేదు. చివరకీ సంస్థను గుంటూరు జిల్లా పరిషత్తు కప్పగించాము.

1941 వ సంవత్సరంలోనే మద్రాసులో కె. చంద్రశేఖరన్ గారింట్లో వాళ్ళమ్మాయి వివాహానికి వెళ్ళి అక్కడనుంచి బెంగుళూరు వెళ్ళాను. త్రివేణి అప్పుడు బెంగుళూరు నుంచే వస్తుండేది స్వాతంత్ర్యం రాబోతున్నది రాగానే పత్రికను బాగా వృద్ధిలోకి తీసుకరావలెననీ, మళ్ళీ మాస ప్రత్రికగా నడపాలనీ, ఆశిస్తూ వుండేవాళ్ళం. అనుకున్నట్లుగానే త్రివేణికొరకే బెంగుళూరుకు నా కాపురాన్ని మార్చి ఆశలతో ఆశయాలతో ఆదర్శాలతో స్వాతంత్ర్యోత్సవ సమయానికి త్రివేణిని మాసపత్రికగా ప్రచురించాను. 1948 వ సంవత్సరం చివరిదాకా బెంగుళూరులోనే వుండి త్రివేణిని నిర్వహించాను. రచనా ప్రమాణాలకు, రూపురేఖలకూ సంబంధించి నంతవరకు సంతృప్తికరంగానే నిర్వహించినా, ఆర్థికంగా నిరుత్సాహకరమైన పరిస్థితులను ఎదుర్కొనవలసివచ్చింది ఎంతగా ఉత్సాహం తెచ్చుకొని పనిచేసినా కొన్ని వొడుదుడుకులు తప్పలేదు. అందువలన చెన్నపట్నంలో సెంట్రల్ ప్రెస్ అధిపతులైన శ్రీ యస్. విశ్వనాథన్‌కు అన్ని బాధ్యతలతో త్రివేణి ప్రచురణ బాధ్యతను అప్పగించాను. సంపాదకీయాలు రాయడం, రచనలను ఎన్నిక చేయడం మొదలైన పనులు నేనే చూసుకొంటూ వుండేవాణ్ణి. అప్పుడు బెంగుళూరులోనే కాపురంవుండేవాళ్ళం, చెన్నపట్నం వచ్చిపోతూ త్రివేణికి సంబంధించిన వ్యవహారాలు చూసుకొంటూ వుండేవాణ్ణి.

1948 వ సంవత్సరంలోనే బెంగుళూరునుండి త్రివేణి పని మీద వోసారి చెన్నపట్నం వచ్చేసరికి, శ్రీ వింజమూరి గోవిందరాజాచార్యుల వారు ఆ ఉదయమే చనిపోయినట్లు తెలిసింది. వెంటనే మైలాపూర్ వెళ్ళి కడసారి వారిని దర్శించి నా భక్త్యంజలి ఘటించుకున్నాను. రుద్రభూమి వరకూ వెళ్ళి వారి యెడల నాకున్న భక్తి గౌరవాన్ని ప్రకటించుకున్నాను. ఆరోజుల్లోనే బందరు నుండి శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు నన్ను బందరు వచ్చి కృష్ణా పత్రిక సంపాదకీయ బాధ్యత వహించమని కోరారు. దానికి అంగీకరించి బందరు చేరుకొన్నాను అంతకు మూడు సంవత్సరాల పూర్వమే శ్రీ ముట్నూరు కృష్ణారావుగారు, శాశ్వతదశస్సు సముపార్జించి దివంగతులైనారు. వారి మరణం దేశాన్ని విచారసాగరంలో ముంచింది. వారి మరణంతో దేశం, ఉత్తమమైన దేశభక్తుని, గొప్ప పత్రికా రచయితను కోల్పోయిందని చెప్పాలి. అటు తరువాత వారి స్థానంలో శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు గౌరవ సంపాదకులుగా వుంటూవచ్చారు. వారు నన్ను బందరు వచ్చి సంపాదకత్వ బాధ్యతను స్వీకరించమని అభ్యర్థించి నందున 1948 వ సంవత్సరం చివరి భాగంలో వచ్చి ఒకటిన్నర సంవత్సరాలు ఆ పవిత్ర కార్యం నిర్వహించాను కృష్ణాపత్రిక సంపాదకత్వ బాధ్యతను స్వీకరించటం, దానిని నిర్వహించటం చాలా గౌరవప్రదములుగా ఎంచే వాణ్ణి. కృష్ణారావుగారు పోవడంతో కృష్ణా పత్రిక అదృష్టం కూడా తిరిగి పోయిందేమోమరి, ఆర్థికంగా వొడుదుడుకులలో పడిపోయింది. పత్రికా ప్రమాణాలు యథాతథంగానే కొనసాగినా, స్వాతంత్ర్యానంతరం దేశంలో ఇంకా ఇతరములైన అనేక పత్రికలు వెలువడుతుండటమూ కొత్తకొత్త అభిరుచులూ మొదలైన వానివల్ల, కృష్ణా పత్రికకు గల ఆదరణ కొంత తగ్గింది. స్వాతంత్ర్య పూర్వపు ఆవేశమూ, పొంగూ చల్లారినట్లుగానే ఆర్థికమైనస్థితిలో కూడా కొంతవిరాశా నిస్పృహలు చవిచూడవలసి వచ్చింది. కృష్ణారావుగారి కుటుంబానికి సహాయార్థంగా ముందు ఉద్దేశించిన కొంత మొత్తాన్ని వారి కుటుంబానికి అందజేయటం కూడా శ్రమసాధ్యమై పోయింది. కృష్ణా పత్రిక యజమానులే దానిని ఎవరికైనా అప్పగించవలెననే ఉద్దేశాన్ని కూడా వ్యక్తపరుస్తూ వచ్చారు. ఈ పరిస్థితులలో కృష్ణా పత్రికలో వుండటం కొంత సున్నితమైన విషయంగా భావించి ఆ బరువు బాధ్యతల నుండి విముక్తుణ్ణైనాను. ఆతరువాత పత్రికను కూడా వారు ఇతరుల కప్పగించారు. ఈ సమయంలోనే చెన్నపట్నంలో విశ్వనాథన్‌గారు కూడా త్రివేణిని జయప్రదంగా నిర్వహించ లేక మళ్ళీనాకే అప్పగించారు. ఈ విధంగా మళ్ళీ చాలా క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చింది, ఏమి చేయటానికీ పాలుపోని పరిస్థితులవి. అటు కృష్ణాపత్రిక, ఇటు త్రివేణి కూడా చాలాచిక్కులలో పడిపోవటం నాకు తీవ్రమైన మనస్తాపాన్నే కలుగజేశాయి.

కృష్ణా పత్రికలో పనిచేస్తున్న కాలంలో సంపాదకీయాలలో విశేష భాగం నేనే వ్రాస్తూవుండే వాడిని. అ జీవితమే నెమ్మదిగా కొనసాగగలదనీ కాటూరి వెంకటేశ్వరరావు, రాపూరిసత్యనారాయణ రావు, కపులాకర వెంకటరావుగార్లతోచక్కగా కాలం గడపగలననీ ఆశించాను. కాని ఆ ఆశలు సఫలీకృతం కాలేదు. అనేకమైన చిక్కు పరిస్థితులలో కృష్ణా పత్రికనుంచి తప్పుకోవలసి వచ్చింది. త్రివేణిని ప్రచురించటం కూడా బాగా ఆలోచన చేయవలసివచ్చింది. మళ్ళీ త్రైమాస పత్రికగా చేసి బందరునుండే వెలువరించాలని ఎట్టకేలకు సంకల్పించాను. ఈ సంకల్పం ఫలించింది. ఇందుకు శ్రీ భావరాజు నరసింహారావుగారిని అభినందించ వలసి వుంటుంది. ఆయన అంతకు మూడు నాలుగు సంవత్సరాలకు పూర్వమే బందరులో త్రివేణీప్రెస్‌ను స్థాపించారు. ఈ ముద్రాలయం ప్రారంభించే టప్పుడు ప్రారంభోత్సవసభకు నేనే అధ్యక్షత వహించాను. అయితే మొదట్లో యీ ముద్రణాలయం చిన్న స్థాయిలో పనిచేస్తూవుండేది. వీరు త్రివేణి బాధ్యతను స్వీకరించి నాకు మహోపకారం గావించారు. అప్పటికి జాతీయ కళాశాల మామూలు కళాశాలగా రూపొందటం శ్రీమొదలి శివకామయ్యగారు ఆంగ్ల భాషాధ్యాపకులుగా అక్కడ చేరటం, త్రివేణికి సహ సంపాదకులుగా వుండమని వారిని నేనర్థించగా వారంగీకరించటం జరిగాయి. వారు సౌజన్యంతోను, సుహృద్భావంతోను బాధ్యతను స్వీకరించి, బెంగుళూరులో సంపది రిరావు చూపిన కార్యోత్సాహాన్నీ ఆదరాభిమానాలనూ త్రివేణి యెడల ప్రదర్శించి, ప్రతిభావంతంగా త్రివేణిని నిర్వహించారు. నేను బందరులోనే వుండి ప్రధానంగా సంపాదకీయాలను వ్రాస్తూ వుండే వాడిని. 1950 నుండి 1953 వరకు బందరులోనే వుండి సావకాశంగా త్రివేణి పని చూసుకుంటూ వుండే వాణ్ణి. 1952 వ సంవత్సరం మద్రాసురాష్ట్రపు ఎగువ సభ (లెజిస్లేటివ్ కౌన్సిల్) సభ్యత్వంకొరకు అభిలషించాను. కాని ఆప్రయత్నం నెరవేరలేదు. ఆ ప్రాంతాలలోనే ఒరిస్సా రాష్ట్రంలో సంబల్‌పూర్‌లో కాలేజీ వారు ఆహ్వానించగా వెళ్ళి, ఆంధ్రుల చరిత్ర సంస్కృతులపై ఉపన్యాసాలు ఇచ్చాను. అక్కడ అప్పుడు మాయాధర మాన సింహ కాలేజీ ప్రిన్సిపాల్‌గా వుండేవారు. ఇదేవిధంగా 1951 వ సంవత్సరంలోనే ఒరిస్సా రాష్ట్రంలోని పూరీకి వెళ్ళి తెలుగు సంస్కృతినీ సాహిత్యాన్నీ గూర్చి ఉపన్యసించాను. 1952 వ సంవత్సరంలో ఆప్తమిత్రుడు బాపిరాజు దివికేగటంతో బాగాకుంగి పోయినాను. ఆయనమృతి అశనిపాత మయింది నాకు. బాపిరాజు నాకు కూర్చు మిత్రులు. ఆయనగారి మరణంతో జీవితంలో చాలా వెలితియేర్పడినట్లనిపించేది. బందరులోనే వుండి స్వయంగా నేను చూసుకోవలసిన కార్యభారం అంతగా లేనందున, 1953 లో మళ్ళీ స్వగ్రామం నరసారావుపేట చేరుకొని, ఇంచుమించుగా 1956 చివర వరకూ అక్కడే గడిపాను. అక్కడనుంచే త్రివేణికి సంబంధించిన పనులను నెమ్మదిగానూ సావకాశంగానూ చూసుకుంటూ వుండే వాడిని. 1954 వ సంవత్సరంలో కేంద్రీయ సాహిత్య అకాడమీ వారు తెలుగు భాషకు సంబంధించిన సలహా సంఘంలో సభ్యుణ్ణిగా చేసుకున్నారు. ఆప్రాంతాలలోనే వెనుక సాహిత్య రంగంలోనూ, పత్రికా రంగంలోనూ చేసిన కృషికి గుర్తింపుగా గౌరవభృతిగా కేంద్ర ప్రభుత్వంవారు మాసానికి వందరూపాయల చొప్పున ఇస్తూ వచ్చారు. 1953 నుంచి 1955 వ సంవత్సరం వరకూ స్థానిక కళాశాలలలోనూ, ఇతర చోట్ల జరిగిన సాంస్కృతిక ఉత్సవాలలో పాల్గొంటూ ఉండేవాణ్ణి. 1955 వ సంవత్సరంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి అభ్యుదయోత్సవాలలో పత్రికా రచనను గూర్చి ఉపన్యసించాను.

1950 ప్రాంతంలో బందరులో వున్నరోజుల్లోనే భారత రాజ్యాంగాన్ని తెలుగులోకి అనువదించే కార్యక్రమంలో పనిచేశాను. దీని కోసం మద్రాసులో కొంత కాలం గడపవలసి వచ్చింది. శ్రీ కొత్త రఘురామయ్యగారూ, నేనూ న్యాయశాస్త్ర పరిశీలకులము (జూరిష్ట్సు) గానూ, భాషావిషయంగా శ్రీభూపతి లక్ష్మీనారాయణ రావు, శ్రీ మోటూరి రామానుజరావు గారలతోనూ, యీ విభాగం పనిచేసింది. ఈ పనికిగాను కొంతదినభత్యమూ, ప్రతిఫలమూ, మా అందరికీ ముట్టింది.

నరసారావు పేటలో విశ్రాంతిగా కాలం గడుపుతూవుండగా 1954 వ సంవత్సరం నవంబరునెలలో, బెంగుళూరు మిత్రులు కడువైభవంగా త్రివేణి రజతోత్సవం జరిపారు. మద్రాసునుంచి శ్రీ బాలసుబ్రహ్మణ్య అయ్యర్, శ్రీ చంద్రశేఖరన్, సావిత్రి అమ్మాళ్ ప్రభృతులు హాజరైనారు. శ్రీ బాలసుబ్రహ్మణ్య అయ్యర్‌గారు ఉత్సవ సభలకు అధ్యక్షతవహించి, సుహృద్భావంతో త్రివేణిని ఉదారంగా కొనియాడారు. బెంగుళూరు మిత్రులతో బాటు శ్రీ చంద్రశేఖరన్, కాటూరి, శివకామయ్య, భావరాజు నరసింహారావుగారలు ఆ సభలో ఎంతో అభిమానంతో, ఆప్యాయతతో ఉపన్యసించారు. త్రివేణి రజతోత్సవ సభల మర్నాడు, కాటూరివారి కావ్యపఠనం, వారికి ప్రత్యేక సన్మానం జరిగాయి. రజతోత్సవ సభలో నాభార్య మాకు జరిగిన ఘనమైన ఆదర గౌరవ సత్కారాలకు కృతజ్ఞతలు తెల్పుతూ తెలుగులో చక్కగా ఉపన్యసించింది. ఈ రజతోత్సవం త్రివేణి చరిత్రలో మహోజ్జ్వల ఘట్టం. ఆ తరువాత ప్రత్యేకరజతోత్సవ సంచిక బందరు నుండి వెలువడింది. దానిని కీర్తిశేషులైన శ్రీ జినరాజాదాసాకు అంకితంచేశారు. బెంగుళూరు నుండి రజతోత్సవ సభల అనంతరం మేము నరసారావు పేట వచ్చాము. ఈ విధంగా 1942 లో డిటెయిన్ చేయబడ్డతదాదిగా 1944లో విడుదల పొంది, నరసారావుపేట చేరుకుని వొడుదుడుకులతోనైనా త్రివేణిని బెంగుళూరు, మద్రాసు, బందరునుండి ప్రకటిస్తూ వచ్చాను. తరువాత కొన్నాళ్ళు త్రివేణిని హైదరాబాదు నుండి కూడా వెలువరించటం జరిగింది.

త్రివేణి రజతోత్సవం జరిగిన తరువాత నరసారావు పేట వచ్చి నెమ్మదిగా విశ్రాంతిగా కాలక్షేపం చేస్తూ వున్న రోజుల్లో శ్రీ కృపానిధి చెన్నపట్నంలోని దక్షిణభాషా పుస్తక సంస్థ ప్రధాన సంపాదకుడిగా నన్నక్కడకు వచ్చి చేరమని ప్రోత్సహించారు. అందువల్ల ఆ అభ్యర్థనను స్వీకరించి 1957వ సంవత్సరమంతా చెన్నపట్నంలోనేవుండి, దక్షిణ భాషా పుస్తక సంస్థకు ప్రధాన సంపాదకుడి (chief editor) గా పనిచేశాను. ఈ సంస్థవారు ప్రకటించే గ్రంథాల ప్రమాణాలను పర్యవేక్షణ చేయడం, ఉన్నత ప్రమాణాలతో, మంచి రూపురేఖలతో వాటిని రూపొందించడం నా కర్తవ్యంగా వుండేది. ఆ తర్వాత దక్షిణ భాషాపుస్తక సంస్థను విడిచిపెట్టాను. త్రివేణి నింకా ఉత్తమ స్థితికి తీసుకొని రావలెనన్న అభిలాషతోనూ, అప్పటికే నాకు వోపిక సడలిపోయింది కనుక, నెమ్మదిగా కాలం గడపవలెనన్న ఉద్దేశంతోనూ, త్రివేణిని శ్రీబుర్రా సుబ్రహ్మణ్యంగారికి అప్పగించవలెనని అభిలషించాను. హైదరాబాదులో ఉంటున్న శ్రీ సుబ్రహ్మణ్యంగారితో సంప్రతించి త్రివేణి బాధ్యత వారికప్పగించాను. 1957 వ సంవత్సరం నుంచి 1961 వ సంవత్సరం వరకూ శ్రీ సుబ్రహ్మణ్యంగారే త్రివేణిని హైదరాబాదునుండి నిర్వహించారు. సమస్తమైన వ్యయప్రయాసలను, బరువు బాధ్యతలను వారేవహించి, నాకు కొంత ప్రతిఫలాన్ని నెల నెలకూ ముట్టజెపుతూ త్రివేణి పట్ల శ్రీ సుబ్రహ్మణ్యం గారు గాఢమైన ఆదరాభిమానాలనువ్యక్తంచేశారు. వారిసుహృద్భావం ఔదార్యం మరువలేనివి. 1957 వ సంవత్సరంలో దక్షిణ భాషా సంస్థతో సంబంధాన్ని వదులుకొని, త్రివేణిని శ్రీసుబ్రహ్మణ్యంగారికి అప్పజెప్పిన తరువాత నేను నరసారావు పేటలోనే వుంటూవచ్చాను. త్రివేణికి సంబంధించిన సంపాదకీయాలూ అవీ అప్పుడప్పుడు నేనుకూడా చూస్తూవుండే వాడిని. బహు కార్యాంతర వ్యగ్రులైన శ్రీ సుబ్రహ్మణ్యంగారు తమ కాలాన్ని త్రివేణికి వినియోగించ లేక పోయేవారు. అందువలన పత్రిక వెలువడటం, ఆలస్యమవుతూ వచ్చింది. కనుక తిరిగి 1961 వ సంవత్సరంలో త్రివేణిని ప్రచురించే బాధ్యతను బందరులో త్రివేణి పబ్లిషర్సు వారికే అప్పగించాను. వారు త్రివేణిని తిరిగి స్వీకరించటం వారి సౌజన్యానికీ ఔదార్యానికీ గొప్ప గుర్తని చెప్పవలసి వుంటుంది.

1959 వ సంవత్సరంలో మా ఒదినగారి చెల్లెలి కొమారుణ్ణి నేను దత్తత తీసుకొన్నాను. మా ఒదినగారి చెల్లెలి భర్త శ్రీ కోళ్ళపర్తి నరసింహారావుగారు. ఈ దత్తస్వీకారమహోత్సవం నరసారావుపేటలో మాఇంటనేజరిగింది. చిరంజీవి రంగనాథరావు ఇప్పుడు ఇంజినీరింగ్ చదువుతున్నాడు. కోళ్ళపర్తి నరసింహారావు బందరులో న్యాయవాదిగా వుంటూ మునిసిపల్ ఛైర్మన్ పదవిని కూడా అలంకరించాడు. రంగనాథరావు, నరసింహారావు గారి ఐదవ కొమారుడు. నాకు దత్తుడు. కవిమిత్రులు, బంధువులు చాలామంది యీ సందర్భంలో మా ఇంటికి విచ్చేశారు. 1961 వ సంవత్సరం చివరి రోజులలో బందరులో జాతీయ కళాశాల స్వర్ణోత్సవం జరిగింది. అప్పుడు భారతదేశ ఉపాధ్యక్షులుగాఉన్న శ్రీరాధాకృష్ణన్ ఆ సభలకు అధ్యక్షతవహించారు. పూర్వం జాతీయ కళాశాలకు ప్రిన్సిపాల్ పదవిని నిర్వహించిన వారుగా నాకూ, శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గారికీ ఆ సందర్భంలో సన్మానం జరిగింది. పూర్వం ఈ కళాశాల విద్యార్థులైన శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ప్రభృతులు ఉత్సవాలలో పాల్గొన్నారు.

1962వ సంవత్సరం డిసెంబరులో శ్రీ కాటూరివేంకటేశ్వరరావుగారూ, 1963 వ సంవత్సర ప్రారంభంలో శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారూ, దివంగతులవటంతో, నేను మానసికంగా చాలా క్రుంగిపోయాను. బాపిరాజు, కాటూరి మొదలైన ఆప్తమిత్రులంతా స్వర్గస్థులు కావటంతో వొంటరివాడినైపోతున్నానేమోనన్న నిరాశ, నిస్పృహలు వెన్నంటుతున్నవి. దీనికి తోడు కంటి చూపుకు అవరోధం కలగడం సంభవించింది. ఏదోవిధంగా కాలక్షేపం చేస్తూ ప్రశాంతంగా జీవితం గడుపుతూనేవున్నా. వెనుకటి ఉత్సాహమూ కార్యదీక్ష, క్రమక్రమముగా లుప్తమైపోజొచ్చాయి. ఒకసారి పాత స్నేహితులనందరినీ చూసిరావాలి అన్న కోరికతో, 1964లో బెంగుళూరు, హైదరాబాదులు దర్శించాను. మిత్రులను కలుసుకుని సంతోషంగా గడిపాను.

1965 వ సంవత్సరం సెప్టెంబరునెలలో అఖిల భారత పాత్రికేయుల సమాఖ్య (ఆలిండియా వర్కింగ్ జర్నలిస్టుల ఫెడరేషన్) వారు, వార్షికోత్సవాల సందర్భంగా నన్నాహ్వానించి, సన్మానితుణ్ణి చేసి, ప్రత్యేకించి గౌరవించారు. ఆ సభలో న్యాయమూర్తి శ్రీ శేషాచలపతి, వావిలాల గోపాల కృష్ణయ్య గారలు ప్రసంగించారు. ఈ వార్షికోత్సవాలు హైదరాబాదు నగరంలో రవీంద్రభారతి కళా నిలయంలో నిర్వహించారు. ఇందుకు నేను ఆ సమాఖ్య వారిపట్ల చాలాకృతజ్ఞుణ్ణి.

ఇటీవల కొంత కాలం క్రితం పూజ్యులైన శ్రీ శివకామయ్యగారు స్వర్గస్థులైనారు. నేను త్రివేణి పనులు స్వయంగా నిర్వహించలేని దుర్బల స్థితిలో వున్నందు వల్ల, ప్రస్తుతం శ్రీ భావరాజు నరసింహారావుగారు మిత్రుల సహాయసహకారాలతో, ఈ కార్య భారాన్ని వహించి పనులు నిర్వహిస్తున్నారు.

ఇప్పుడు నేను ఏమీ చదవలేను. ఇంట్లో తప్ప బయట తిరగలేను. ఇన్నాళ్ళూ అవిశ్రాంతమైన కార్య భారంతో, అకాల వార్ధక్యం, మానసిక దౌర్బల్యం. అప్పుడప్పుడు విసుగునూ, నైరాశ్యాన్నీ కలిగిస్తున్నాయి. ప్రశాంతతలోకూడా ఒకరకమైన మానసికమైన అసంతృప్తీ, నిరుత్సాహమూ చవిచూస్తున్నాను.

ఏది ఏమైనా, ఎటు వంటి ఒడుదుడుకులలోనైనా త్రివేణిని నాలుగు దశాబ్దాల పాటు నిర్వహించగలిగా నన్న సంతృప్తీ సంతోషమూ నాకెల్లప్పుడూ వుంటాయి. బహుశ్రమ సాధ్యమయిన ఇటు వంటి పనిని సాధించ గలిగినందుకు నేను చరితార్థుణ్ణీ కృతార్థుణ్ణి అనే అనుకొంటాను. నా జీవితం సార్థకమైనదే అని పిస్తున్నది. విశ్వవ్యాప్తమైన ఒకా నొక దివ్యజ్యోతి ఎల్లవేళలా నాకు మార్గంచూపుతూ, నా పై వెలుగు ప్రసరిస్తూ నన్ను నడిపించిందని భావిస్తూ వుంటాను.

(సమాప్తం)

---

# ఆనందనిలయం

గంధం జోయెల్

అన్నా !
గుండె గుండెకూ పచ్చని
ఆశల తోరణాలు కట్టి,
ప్రజలందర్నీ ఆహ్వానించాను

మనస్సు ప్రమిదలో
సహనం నూనె పోసి,
ప్రేమ వత్తిని వేసి,
దేశం కోసం వెలగమని,

వెలగమని చెప్పాను
అందానికి ప్రగతిని
అలంకారంగా దిద్ది,
ఆనందం జలాశయానికి

ప్రణాళికల ఆనకట్టలు కట్టి,
అరుణారుణ కిరణాలకు
జలతారుగా మెరసే
జలాన్ని పొలాలకు మళ్ళించి.

పసిడి పంటల్ని పండించాలని,
ప్రతి రైతునూ అడిగాను !
విశ్వమానవ సఖ్యతకై
ఒక ఎఱ్ఱ రోజావై బ్రతకాలని,

గాంధీజీ కన్న కలలు
నిజం కావాలని కోరాను !
చిన్నన్నా !
బ్రతుకు లోతైన బావి
ఆనందం అందని నీరు !

దాహం తీరాలనుకుంటే
అనుభవం చేంతాడు పట్టి,
ఆత్మ విశ్వాసాన్ని పెంచి,
నీరు తోడుకొని త్రాగాలి !

అందుకే, నేను ఈనాడు
అందర్నీ పిలుస్తున్నాను
రండి ! సోదరులారా !
ప్రతి వాకిట్లో ఒక

ప్రజాసేవ వృక్షం నాటండి !
ఒక్కొక్క హృదయాన్ని
ఢమరుక చేసి, ప్రజా హితాన్ని చాటండి !
చేతికందినంత సంతోషాన్ని

పిడికెడు బయటికి తీసి,
ఇతరులకు పంచండి !
మంచికీ, చెడుకూ మధ్య
వంతెన, నిర్మించండి !

తలా ఒక వెలుగు కిరీటాన్ని
తలమీద ధరించండి !
మనస్సు నాహ్లాదపరచే
మల్లె పందిరి వేయండి !

అప్పుడే మన చిరకాల
వాంఛ నిజమవుతుంది !
ఆనాడె మన దేశం
ఆనంద నిలయమవుతుంది ॥

# ఆంధ్రప్రదేశ్‌లో అనావృష్టి సహాయక చర్యలు

ఆంధ్రప్రదేశ్ అనావృష్టి పరిస్థితులను ఎదుర్కొంటున్నది. పూర్తిగా వర్షాలు లేక పోవడంతో ఏవో కొన్ని చిన్న భాగాలు మినహా రాష్ట్రంలోని 21 జిల్లాలలో కరువు పరిస్థితులు ఏర్పడినాయి. పరిస్థితి తీవ్రతను గమనించి తక్షణ సహాయక చర్యల నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం వెంటనే రు. 2 కోట్లు మంజూరు చేసింది. సహాయక చర్యల అమలులో ఉపాధికల్పనకూ నిత్యావసరవస్తువుల కొనుగోలు శక్తి పెంపుదలకూ ప్రాధ్యానం యివ్వబడింది. అందువల్ల తాత్కాలికంగా మంజూరు చేయబడిన రు. 2 కోట్లతో పరిస్థితులను నిస్సందేహంగా అదుపు చేయవచ్చు.

రాయలసీమలోని చాలా ప్రాంతాలు, తెలంగాణా ప్రాంతం తరుచుగా కరువుకు గురి అవుతుంటాయి అనావృష్టి ప్రాంతాలలో చెమ్మ నిలుపుదల శక్తిని ఎక్కువ చేయడం తక్షణావసరంగా భావించబడుతున్నది. అటువంటి ప్రాంతాలలో చెమ్మ నిలుపుదల శక్తిని అధికంచేయడానికి శాశ్వత ప్రాతిపదికపై పనులు జరగడమే గాక తద్వారా వ్యవసాయ కూలీలకు ఎక్కువ కాలం ఉపాధిలభించే విధంగానూ తరచుగా పైర్లు చెడిపోయి నిస్పృహకు లోనయ్యే రైతులలో ఉత్సాహం కల్గించి వ్యవసాయంలో నూతన సేద్యపు విధానాలు అమలు జరిపే దృక్పథం ఏర్పడే విధంగానూ దీర్ఘకాలిక చర్యలు తీసుకోబడాలి.

## గ్రామీణ పనుల కార్యక్రమము

దేశంలో తరుచుగా కరువుకు గురిఅయ్యే ప్రాంతాలలో అనావృష్టిని నివారించడానికి చేపట్టే బృహత్కార్యంలో భాగంగా దేశంలోని 54 జిల్లాల్లో రు. 100 కోట్ల ఖర్చుతో 3 సంవత్సరాల కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఈ పథకాన్ని "గ్రామీణ పనుల కార్యక్రమం"గా వ్యవహరిస్తున్నారు. తరుచుగా అనావృష్టికి గురి అయ్యే జిల్లాలలో కేంద్రప్రభుత్వం అధ్వర్యంలో రాష్ట్ర ప్రభుత్వం అమలు జరుపుతున్న తీవ్రతర ఉపాధి కల్పన- ఉత్పత్తి ప్రధానమైన గ్రామీణ పనుల కార్యక్రమంలో శాశ్వతమైన సివిల్ నిర్మాణం పనులవల్ల యీ ప్రాంతంలోని వ్యవసాయ కూలీలకు ఉపాధి లభించడమే గాక వ్యవసాయ ఉత్పత్తుల పెంపుదల కృషికి అవసరమైన పునాది సంబారాలకు ప్రాధాన్యత లభిస్తుంది.

## ఐదు జిల్లాలు :

వర్షపాతం, నీటిపారుదల సౌకర్యాలు, కరువు పరిస్థితులు, కరువు పరిమాణం మొదలైన వాటిని దృష్టిలో ఉంచుకొని వాటి ప్రాతిపదికపై గ్రామీణ పనుల కార్యక్రమాన్ని అమలు జరపడానికి వీలుగా దేశంలో 13 రాష్ట్రాలలో 54 జిల్లాలను ఎంపిక చేశారు. వాటిలో ఆంధ్రప్రదేశ్‌లోని మహబూబునగర్, కర్నూలు అనంతపురం, కడప, చిత్తూరు_ఐదు జిల్లాలు ఉన్నాయి. ఈ కార్యక్రమం అమలు నిమిత్తం నల్లగొండ, ప్రకాశం జిల్లాలను కూడా చేర్చుకోవాలని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రాన్ని కోరింది. ఈ విషయం ఇంకా కేంద్ర ప్రభుత్వ పరిశీలనలో ఉంది.

## బృహత్ప్రణాళిక

ఎంపిక చేసిన జిల్లాల అవసరాలు, అక్కడ లభించే వనరులు అవకాశాలు ప్రాతిపదికగానూ, పథకం లక్ష్యాల సాధన ప్రాతిపదికగానూ గల పథకాలతో సహా మొదట బృహత్ప్రణాళికను తయారు చేయడానికి వీలుగా అవసరమైన మార్గదర్శక సూత్రాలను కేంద్ర ప్రభుత్వం జారీచేసింది. అనావృష్టి ప్రాంతాల సమస్యలను శక్తి సామర్థ్యాలను, దృష్టిలోపెట్టుకొని దీర్ఘకాలిక ప్రాతిపదికగా, గ్రామీణ పనుల కార్యక్రమం అమలు పర్చడానికి వీలుగా యీ బృహత్తర ప్రణాళిక రూపొందించ బడినది. ఏయేరంగాలలో అభివృద్ధి జరగవలసింది, ఎటువంటి కార్యక్రమాలకు ప్రోత్సాహము యివ్వవలసింది, లక్ష్యసాధనకు ఏ విధమైన సాధన కల్పించవలసింది, అభివృద్ధి పనులకు ఏ ప్రకారంగా ఖర్చు పెట్టవలసిందీ, ఈ బృహత్తర ప్రణాళికలో నిరుష్టంగా పేర్కొన బడినాయి. ప్రణాళిక పథకములు, ప్రణాళికేతర పథకములు కాక అదనంగా యీ బృహత్తర ప్రణాళిక క్రింద క్రొత్తగా పన్నులు చేపట్టడం జరుగుతుంది. మామూలుగా అభివృద్ధి కార్యక్రమాలను సమన్వయించి యీ పథకాలను అమలు పరచడం జరుగుతుంది. తదనుగుణంగా ఆంధ్రప్రదేశ్‌లో ఐదు జిల్లాల విషయమై జిల్లా వారీగా బృహత్తర ప్రణాళికలు సిద్ధం చేయబడినవి. వీటిని రూపొందించటంలో చిన్నతరహా నీటిపారుదల, భూసార పరిరక్షణ, రాకపోకల సౌకర్యాలకు ప్రాధాన్యత యివ్వబడింది. గ్రామీణ ప్రాంతాలలో ఉద్యోగ సౌకర్యములు కల్పించడమేగాకుండా, ఆ ప్రాంతాలకు శాశ్వతమైన లాభాలు చేకూర్చడానికి యీ పథకాలు ఉపకరిస్తాయి. ప్రాంతాల అభివృద్ధి విషయంలో ప్రధానవిషయాలను, అభివృద్ధికిగల అవకాశాలను, పరిమితంగాఉన్న ఆర్థికవనరులను దృష్టిలో పెట్టుకొని 1971_74 కాలానికి కేటాయింపులు చేయబడినాయి. కర్నూలు, చిత్తూరు జిల్లాల్లో చిన్నతరహా నీటిపారుదల పనులకు, మంచి అవకాశాలు

ఉన్న ప్రాంతాలలో యీ పథకాన్ని అమలు పర్చడానికి ప్రాధాన్యత యివ్వబడింది. అనంతపురం జిల్లాలో భూసార పరిరక్షణ, కడపజిల్లాలో కమ్యూనికేషన్ల అభివృద్ధికి ప్రాధాన్యత యివ్వబడింది. స్థానిక అవసరాలను, శక్తిసామర్థ్యాలను దృష్టిలో పెట్టుకొని, అవసరమైన మార్పులు చేయడానికి బృహత్ ప్రణాళికలో అవకాశాలు కల్పించబడినాయి. ఈ కార్యక్రమాన్ని అమలు పరచడానికి ప్రతి జిల్లాకు రూ. 2 కోట్లు కేటాయించబడింది.

## అభివృద్ధి పనుల సమీక్ష

గ్రామీణ పనుల కార్యక్రమం గత సంవత్సరం ఐదు జిల్లాలలో అమలు పర్చబడింది. భారత ప్రభుత్వం రూ.187.23 లక్షల నిధులను కేటాయించగా అభివృద్ధి పనులకు మొదటి సంవత్సరంలో రూ. 187.90 లక్షలు ఖర్చు పెట్టడం జరిగింది. కమ్యూనికేషన్ల కొరకు రూ. 64 లక్షలు, చిన్న తరహా నీటి పారుదల పనులకు రూ. 84.63 లక్షలు, భూసార రక్షణకు రూ. 47.18 లక్షలు. అడవుల పెంపకం పథకాల క్రింద రూ. 16.5 లక్షలు ఖర్చు పెట్టబడినాయి. ఈ కార్యక్రమంలో ముఖ్యవిశేషం ఏమిటంటే కర్నూలు జిల్లాలో మాత్రమే గ్రామీణ నీటిసరఫరా కార్యక్రమం క్రింద రూ. 14.52 లక్షలు ఖర్చు పెట్టబడింది. వివిధ రాష్ట్రాలలో గ్రామీణ పనుల కార్యక్రమం క్రింద జరిగిన ప్రగతిని 1971 ఏప్రిల్ నెలలో జరిగిన ప్రధాన కార్యదర్శుల సమావేశంలో సమీక్షచేయబడింది. వివిధ రాష్ట్రాలు అందచేసిన బోగట్టాను పరిశీలించినట్లైతే 1971–72 లో ఆంధ్రప్రదేశ్ చేసిన కృషి ప్రశంసనీయంగా ఉంది. 1971–72 లో వివిధ కార్యక్రమాలకు రూ. 4.40 కోట్లు ఖర్చు పెట్టడానికి సంకల్పించ బడింది.

గ్రామీణాభివృద్ధి వైపు మొగ్గుచూపుతున్న యీ పథకాలు గ్రామీణ నిరుద్యోగ నిర్మూలనకు, అనావృష్టికి గురి అవుతున్న ప్రాంతాల రూపు రేఖలను మార్చడానికి దోహదం కలిగిస్తాయి.

---

## ఈ సంచికలో రచయితలు

- శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావు, బెంగుళూరు విశ్వ విద్యాలయము, బెంగుళూరు.
- శ్రీ గునుపాటి భోగీశ్వరం, కోట, నెల్లూరు జిల్లా
- శ్రీ కనకారావు సలాది, మ్యూజియం రోడ్, విజయవాడ.
- శ్రీ జి. వెంకట రామారావు, ఇబ్రహీంపట్నం, హైదరాబాదు జిల్లా.
- శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి, హైదరాబాదు.
- శ్రీ ఎ. పండరినాథ్, ఇబ్రహీం పట్నం, హైదరాబాదు జిల్లా.
- శ్రీ రావిపాటి మహానంద ఎం. ఎల్ ఎ. దరిశి.
- శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య ఎం. ఏల్. ఎ. సత్తెన పల్లి.
- శ్రీ కుమారి పద్మజా చౌధరి జెట్టి. భారత్ హెవీ ఎలెక్ట్రికల్స్ హైదరాబాదు.
- శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి, హైదరాబాదు.
- శ్రీ అక్కిరాజు రమాపతిరావు, తెలుగు అకాడమీ, హైదరాబాదు.
- శ్రీ ఎం. ఎస్, సిద్ధేశ్వరరావు, డి. పి. ఆర్. ఒ. కడప
- శ్రీ ఎన్. కామరాజు పంతులు, రీజినల్ కాలేజి ఆఫ్ ఎడ్యుకేషన్, భోపాల్.
- శ్రీ పి. రాజారావు,డి. ఆర్. గోయెంకా ప్రభుత్వ కళాశాల, తాడేపల్లి గూడెం.
- శ్రీ గుంటి పుండరీ కాక్షయ్య, శ్రీకాకుళం.
- శ్రీ పంద్రంగి రాజేశ్వరరావు, జర్నలిస్టు. ఏలూరు
- శ్రీ బండ్లమూడి సత్యనారాయణ, తెలుగు లెక్చెరర్, సి. ఆర్. రెడ్డి కళాశాల. ఏలూరు.
- శ్రీ గొర్తి సూర్య నారాయణ జర్నలిస్టు. అమలాపురం. "రాజా". హైదరాబాదు
- శ్రీ అయినాల కనకరత్నాచారి. కొరిశెపాడు. ప్రకాశంజిల్లా.
- శ్రీ ఆర్. అనంత పద్మనాభరావు, ప్రభుత్వ కళాశాల, కందుకూరు.
- శ్రీ గంధం జోయెల్. హైదరాబాదు.
- శ్రీ బి. సుదర్శనం. బి. ఎ. పి. ఆర్. ఒ. నరసంపేట,
- శ్రీ టి. ఎ. పద్మనాభరావు. నెల్లూరు.

# సర్వాయి పాపడు కథ

**తంగిరాల వెంకటసుబ్బారావు**

తెలుగు వీరగాథా సాహిత్యములో బందిపోట్లకు సంబంధించిన వీరగాథ లేవియని ప్రశ్నించినచో, వెనువెంటనే సర్వాయి పాపడు కథను, చిన్నపరెడ్డి కథను చెప్పుట పరిపాటి యైనది. ఇది సరికాదు ఈ వీరగాథల రచనా విధానమును పరిశీలించినప్పుడు వీరు బందిపోట్ల వలె కాన్పించినను, చారిత్రిక విషయములను కూలంకషముగా మథించి చూచినప్పుడు ఈ నిర్ణయము అసంగత మని ధ్రువపడగలదు.

సర్వాయి పాపడు, చిన్నపరెడ్డి– వీరిరువురును సాహసికులే కాని బందిపోట్లు కారు. వీరు స్వాతంత్ర్యమునకై తమ కాలములోని దుష్టశక్తులపై పోరు సల్పిన మహావీరులు. సర్వాయి పాపడు తన శౌర్యముతో మహమ్మదీయుల దౌష్ట్యము నెదుర్కొని గోల్కొండ కోట నాక్రమింపదలంచెను. చిన్నపరెడ్డి ఆంగ్లేయుల క్రౌర్యము నెదిరించిన వందేమాతరం ఉద్యమ జాతీయ నాయకుడు.

మహమ్మదీయ చరిత్రకారులు సర్వాయిపాపని, ఆంగ్ల చరిత్రకారులు చిన్నపరెడ్డిని బందిపోట్లుగా చిత్రించిరి. ఇది వారి పాక్షిక దృష్టికి ప్రబల నిదర్శనము. సర్వాయి పాపడు మహావీరుడే కాని బందిపోటు కాడనియు, ముస్లిములను ముప్పుతిప్పలు పెట్టిన గొప్ప సాహసికుడనియు, మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతలు బూటకములనియు డాక్టరు బి రామరాజుగారు సప్రమాణముగా నిరూపించి యున్నారు (చూ. వారి 'తెలుగు జానపదగేయ సాహిత్యము', పుటలు ౨౨౪-౨౨౮).

ఔరంగజేబు కొడుకు కాలములో తెలంగాణమున విజృంభించిన సాహసికుడు పాపడు. ఇతని తల్లిపేరు 'సర్వమ్మ' యగుటచే నితనికి 'సర్వాయి పాపడు' అని పేరు వచ్చినది. ఉపలబ్ధ వీరగాథనుబట్టి పాపడు పుట్టినది 'పులగాము', పెరిగినది 'తాటికొండ', కులమందు 'గవండ్లవాడు'. ఇతని యింటిపేరు 'నాసనోళ్లు'. 'అసేన్, పుసేన్, తుర్కాహిమాన్, దూదేకులపీరు, ముక్కులు కోసే నక్కల పెరుమాళ్లు, నెల్లూరి హనుమంతు, చాకలి సర్వన్న, మంగలి మాసన్న, కుమ్మరి గోవిందు' మున్నగు వారు పాపని అనుచరులు. ఈ అనుచరులతో నితడు కడప, కర్నూలు, నెల్లూరు మండలములలోను, మైసూరు మండలములోను అనేక పట్టణములను దోచెను. చెన్నపట్టణము, గోల్కొండ బస్తీలు, ఢిల్లీ దర్బారులు, పాపని పేరు చెప్పినచో గడగడ వణికి పోవునట...

"పాపని యొక్క పేరు చెప్పితే
ఊర పిచ్చుక ఊరు చేరదు
పొట్టి పిచ్చుక పొలము చేరదు
కౌజులూ కారాడు తుండు
నక్కలూ నాట్యాలు తొక్కూ
పంది కొక్కూ దోలు కొడతాదో – వాడేటంటే
దొంతి కుండలు గంతులేస్తాయి ,,
పసిబిడ్డలు పాలు తాగరూ ,,
గుఱ్ఱాలు గుగ్గిళ్లు తినవూ ,,
ఏనుగులు మేత అందావూ – వాడిపేరంటే"

ఇంత భయంకరుడైన పాపడు, పల్లెలను పట్టణములను దోచుటతో తృప్తి పడలేదు. అతడు చిన్నతనములో పశువులను గాయుచు నిద్రపోగా, పన్నెండు సిరస్సుల నాగుపాము వానికి ఎండ పొడ తగులకుండ పడగెత్తి గొడుగు పట్టినదట. రామేశ్వరము పోవు బ్రాహ్మణులు అతనికి ఏడు ఘడియలు గోలుకొండ సింహాసనమేలు పంతమున్నదని చెప్పిరట. ఆ మాటలు నమ్మిన పాపడు, తల్లిని బెదరించి ధనమును గుంజి ఆ ధనముతో సైన్యములను కూర్చుకొని, గోల్కొండపై దండెత్తెను. ఆతని జాతకి ప్రభావమును గుర్తించి, ఏడు గడియలు నవాబు మిన్నకుండెను. పాపడు ఆ యేడు ఘడియలలోను గోల్కొండ కోటను వశపఱుచుకొనెను. ఏడవ ఘడియ దాటగనే నవాబు వానినెదిరించెను. పాపని సైన్యమంతయు నష్టము కాగా అతడు కడకు ఆత్మహత్య చేసికొనెను. ఇది యీ వీరగాథలోని యితి వృత్తము.

ఈ కథకు గుజిలీ ప్రతులు కొన్ని లభించుచున్నవి. వీని కన్న మౌఖిక ప్రచారమున తెలంగాణము రాయలసీమలలో వ్యాపించియున్న యీ కథను సేకరించుట ఉత్తమము. అట్టి దానిని నేను రాయలసీమలో సంపాదించితిని. గుజిలీ ప్రతులలోకన్న నిందు కథ మఱింత విపులముగ నుండుటయేకాక, అనేక క్రొత్త విషయములున్నవి.

సర్వాయి పాపడి కథను మొట్టమొదట సేకరించినది జె. ఎ. బోయెల్ దొరగారు. వీరు క్రీ. శ 1874 లో దీనిని కడప మండలమున నొక బోయవానికడ సంపాదించిరి. సి. పి. బ్రౌనుదొరగారు సేకరించిన బొబ్బిలికథ, కామమ్మకథ, కుమార

రాముని కథలను తప్పించినచో, తెలుగులో అతి ప్రాచీనకాలమున సేకరింపబడిన వీరగాథ సర్వాయిపాపడు కథ అనవచ్చును బోయల్ దొరగారు సంపాదించిన కథకును, నేడు లభించుచున్న గుజిలీ ప్రతికిని కూడ పెక్కు భేదములున్నవి. దొరగారు సేకరించిన కథలోని యీ క్రింది పంక్తులు గుజిలీలో ప్రతిలో లేవు :

"పాపడు తాగేటి కల్లు
ఏ తాటి తాటి కల్లు
వేలుపెట్టితే వేలు తెగును
దివిటి పెట్టితే భగ్గున మండును
తాగేటప్పుడు తియ్యగ వుండును
తాగిన వాణ్ణి లేవనివ్వదు
లేచిన వాణ్ణి పోనివ్వదు."

నేను రాయలసీమలో సంపాదించిన పాటలోగూడ కల్లు వర్ణనమున్నది. పాపడు గుబ్బము కొండలో కల్లు త్రాగెనట. ఆ కల్లు ఎట్టిదనగా—

"కల్లుముందా బొరుగు తీసీ
పచ్చగడ్డీ పైన యేస్తే
అగ్గి లేకా భగ్గున మండూర — ఆ కల్లుబొరుగు!"

నేను సంపాదించిన సర్వాయి పాపడు కథ యీ క్రింది విధముగా ప్రారంభమగును :—

"రాయుణ్ణా సర్వాయి పాపాడా ! మొగలాయి పాపా !
ఈడిగోళ్ళ చిన్నవాడేరా — సర్వాయి పాప
ఈదులుగీసే ఈడిగోడమ్మ — సర్వాయి పాప
ఈడిగోళ్లా చిన్నవాడు — ఇప్పాపువ్వంటివాడు
మల్లెలా మొగ్గంటివాడు — మొగలీ రేకంటివాడేరా
సర్వాయిపాపా !"

నాకు ఈ వీరగాథను పాడి వినిపించిన పూసర బలిజవాడు, పాపడు అనంతపురం జిల్లా కదిరి తాలుకాలోని ఓరుగల్లులో పుట్టెనని చెప్పెను. పాపడు పులగాములోపుట్టి తాటికొండలో పెరిగెనని గుజిలీ ప్రతిలో గలదు. 'బెల్గాము' నే 'పులగాము' అనినాడేమో కవి ! తాటికొండ అనంతపుర మండలమున గలదు.

గుజిలీ ప్రతిలో పాపని తల్లి సర్వమ్మ మాత్రమే పేర్కొనబడినది. నేను సేకరించిన రాయలసీమ పాటలో నితని తండ్రి వెంకటన్న అనియు, తల్లి సారమ్మ అనియు, నితడు ఓరుగంటి ఎల్లమ్మ వరపుత్రుడనియు, గలదు.

గుజిలీ ప్రతిలో పాపడు గోల్కొండపై యుద్ధమునకు పోవుచు, కల్లు త్రాగినది 'మొగల్ గుంట' లో ననియు, నంతకు ముందు త్రాగినది 'రేణికుంట' లో ననియు గలదు. నేను సేకరించిన కథలో పాపడు 'గుబ్బము కొండ' లో కల్లు నమ్మెనని కలదు. ఈ గుబ్బముకొండ చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలుకాలో నున్నది. ఇక్కడ 'వేలు పెడితే వేలు తెగేటి' కల్లు నేటికిని లభించుచున్నదట !

నాకు లభించిన వీరగాథనుబట్టి సర్వాయి పాపడు రాయలసీమ వాడుగా తోచుచున్నాడు. బోయల్ దొరగారుకూడ బళ్లారి జిల్లాకు చెందిన గాథా కారునినుండి కథను సేకరించి, పాపడు రాయలసీమ వాడని తీర్మానించిరి కాని డాక్టరు బి. రామరాజుగారు మాత్రము సర్వాయి పాపడు తెలంగాణపు వాడని నిర్ణయించిరి. వారు పాపని గూర్చిన చరిత్రాంశములను పూర్తిగా బయట పెట్టిరి పాపడు తెలంగాణములోని ఓరుగల్లునుండి గోల్కొండవఱకును అనేక దుర్గములనాక్రమించుకొని, మహమ్మదీయ పాలకులను గడగడ లాడించిన మహావీరుడు. ఈతడు బందిపోటు కాడు. ముస్లిము చరిత్రకారులీతనిగూర్చి చాల హీనముగా పక్షపాత దృష్టితో వ్రాసినారు. వారి వ్రాతలు నమ్మదగినవి కావు. 'సర్వాయి' పేరనియు, 'పాపడు' పేరనియు కొందరు వ్రాసిరి. కథనుబట్టి, యితని తల్లి సర్వమ్మయగుటచేతనే యితనికి 'సర్వాయి పాపడు' అని పేరువచ్చినట్లు తెలియుచున్నది.

క్రీ. శ. 1708 లో సర్వాయి పాపడు ఓరుగల్లు కోటను ముట్టడించినట్లు చరిత్రలో గలదు. కావున పాపని విజృంభణము పదునెనమిదవ శతాబ్ది ప్రారంభమున జరిగి యుండును. ఇతడు ఔరంగజేబు కుమారుడగు 'కాంబక్షు' కాలమువాడు. నాకు జూడ, దేశింగురాజు కథయు, సర్వాయి పాపని కథయు నొకే కాలము నాటివిగా కన్పట్టుచున్నవి. ఢిల్లీ సుల్తాను పంపిన యూసఫ్ఖాన్ పాపని చంపినట్లుగా చరిత్రలో కలదు. ఈ కథను గూర్చిన చారిత్రిక విషయములు మల్లంపల్లి సోమశేఖర శర్మగారి 'అమరావతీ స్తూపము' లోను, 'ఖాఫీఖాన్ చరిత్రము — రెండవ భాగము' అను పారశీక గ్రంథములోను, T. W. HAIG రచించిన "Historic land marks of Deccan" అను గ్రంథములోను గలవు.

డాక్టరు బి. రామరాజుగారు చెప్పినట్లు 'నీచకులమున జన్మించి, కల్లుగీత వృత్తిగా, పశువుల మేపుట వృత్తిగా, మొదట బ్రతికిన పాపడు తెలుగు దేశమును గడగడలాడించుటయేకాక ఢిల్లీ చక్రవర్తికి సైతము తీరని సమస్యగా పరిణమించినాడన్న ఆతని ధైర్య సాహసములు వీర విక్రమములు కొనియాడదగినవి.' (తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట-౨౨౫) నేను సంపాదించిన మౌఖికగాథలో పాపని శౌర్యమిట్లు ప్రశంసింపబడినది.

"అదిగోవచ్చే పావడంటేనూ — భూలోకమంతా
నక్కలే నట్టావు దొక్కేది — పాపన్న దెబ్బ
నక్కలే నట్టావు దొక్కు — జింకలే జిడుగుడుకూసు
కొంగలే కోలాటమేసు — పాములే పల్లాయి దొక్కా
వురేళ్లే పూడిపోవు — లావకలే లేసిపొయ్యేది — పాపన్న దెబ్బ"

నాకు లభించిన పాటలో పాపని బల్లెమును గూర్చిన వర్ణన యున్నది. ఇది గుజిలీ ప్రతులలో కానరాదు.

"వాడు పట్టే బల్లెమున్నది — పాపిష్టి బల్లెం
అక్కడిక్కడ ఎండి కట్టూ
నడుమనా బంగారి కట్టూ

మంచపేలా మల్లకచ్చూ
మొంచు ఏలా సుట్టకొస్తుందీ – ఆ బల్లెము''

గుజిలీ ప్రతిలోగూడ కొన్ని రసవత్తర ఘట్టములు లేక పోలేదు పాపని తల్లి సర్వమ్మ 'ఇల విద్యలు ఎన్ని అయినా కుల విద్యకు సాటిరావు' అని కుమారునితోజెప్పి, తమ యింటి ఆవులను మేపుచు ఈతచెట్లను గీయమని కోరును. ఆపాదమస్తకము శౌర్య రక్తము ప్రవహించు వీరశిఖామణియగు పాపడు తల్లికిట్లు జవాబు చెప్పును :

"ఈదులు గీస్తే ఈండ్రవాడు-కల్లు గట్టితే గవండ్లవాడు
కత్తిపట్టితే మేదరవాడు – కుండబట్టితే కుమ్మరవాడు
మొనగాడీ చట్టమొచ్చునా ? – సర్వమ్మ తల్లి ! ''

పాశెగాడీ చట్టమొచ్చునా ? – సర్వమ్మ తల్లి
పూరుకొడితే ఏమి ఫలము ? – పల్లె కొడితే ఏమి ఫలము ?
కొడితే గోల్కొండ కొట్టాలే సర్వమ్మ తల్లీ ! ''

– అని తన నిశ్చయమును ప్రకటించును. గోల్కొండపై దండెత్తుటకుముందు, సర్వాయిపాపడు తన నేస్తగాండ్రతో 'మొగల్ గుంట' కల్లు త్రాగుటకు పోవును. అతడు పూర్వము రేణిగుంట కల్లుత్రాగినాడట.

ఆ కల్లు కేవలము కన్నులెఱ్ఱజేసి పోయెనేకాని లాహిరి యెక్కింప లేదట. అందుచే మొగలుకుంట గ్రామమునకు రాగా అక్కడ—

"మాట్లాడే కల్లువుంది – మైకమెత్తే కల్లువుంది
నిద్రబొయ్యే కల్లువుంది – జూదమాడే కల్లువుంది
దోవనడిచే కల్లువుంది – జగడమాడే కల్లువుంది
ఏలుపెడ్తే ఏలుమండు – కాలుపెడ్తే కాలుమండు
కత్తిపెడ్తే కత్తిరించాలె – ఆ కల్లూ''

ఇన్ని రకముల కల్లులో పాపనికి ఏకల్లును నచ్చలేదు. అతనికి 'నఱుకులాడే కల్లు' కావలయునట ! తాటిచెట్టుకూడ ఆతనికి భయపడి వంగి కల్లు పోసినదట ! ఆ నరుకులాడు కల్లు త్రాగి పాపడు నేలపల్లటీలు కొట్టినాడట ! ఆంతర పల్లటీలు వేసెనట !

పాపడు గోల్కొండదగ్గర చేసిన యుద్ధము బొబ్బిలికథ వరుసలో చక్కగా వర్ణింపబడినది. పండ్రెండు వేల దండు రాణులను వెంటబెట్టుకొని, గోల్కొండపైబడి, రెండుచేతులతోనూ కత్తులు పట్టి పాపడు యుద్ధము చేయుచుండగా శత్రుసైన్య మెట్లు చివికి పోయినదో చూడుడు.

"కొట్టేసనుగా పడివున్నావి క్రొవ్వి దబ్బాలు
నరికితేసు మరి పడివున్నావి నాలికె పేగూలు
శేరు శేరు బంగీ ఆకుముద్దలే భూమిన పడుతావి
అప్పుదు తిన్నా పప్పు అన్నమే తెప్పలు బడుతుంది

యెగిరే వొక్కొ శిరస్సులాకూ ఎడా సందులేదు
వాలేటి వోశిరస్సులాకూ ఎడా సందులేదు''

బొబ్బిలి కథవలెనే దీనికినీ ఉత్తమ వీరగాథా లక్షణము లున్నవి. దీనినడక వీరగాథ లన్నిటిలోను ప్రత్యేకమైనది దీనికిదియేసాటి. తెలుగు వీరగాథలలో 'ముగ్గురు మరాటీల కథ, సర్వాయి పాపడు కథ'—ఈ రెండును వీరరసము పరవళ్ళు త్రొక్కెడి వరుసలలో నున్నవి. ఇంతటి ఉత్తమగతిలో సాగెడి వీరగాథలు తెలుగులో మఱిలేవు. ఆధునికులగు బుఱ్ఱకథా రచయితలు కూడ ఈ వీరగాథనడకను ఎక్కువగ అనుకరించు చున్నారు.

సర్వాయి పాపడు కథ తెలుగు జానపద గేయములలోని ఏ పాటల నడకలో నున్నది. ఇది కొంతవరకును హరిణగతి రగడను పోలునని చెప్పవచ్చును. 7 + 7 = 14 మాత్ర లొక పాదముగా సాగును. ఇది ఒక్కరాత్రికథ జంగములు దీనిని పాడుచున్నారు. చిత్తూరు జిల్లాలో పూసల బలిజవారు దీనిని పాడు చున్నారు. మిక్కిలి ప్రసిద్ధమైన తెలుగు వీరగాథలలో సర్వాయి పాపడు కథ ఒకటి.

లభ్యములగు గుజిలీ ప్రతులనుబట్టి నిడిగంటి వీరయ్య, కడూరి చెంగెల్వరాజు అను ఇరువురు కవులు కలిసి యీ సర్వాయి పాపడు కథను రచించినట్లు తెలియుచున్నది. క్రీ.శ. 1909 లో వ. యతిరాజులు నాయుడుగారు (చెన్నపట్టణము) ప్రకటించిన 'సర్వాయి పాపడు కథ'లో ఈ క్రింది విధముగా నున్నది.

"సర్వాయి పాపడు అను ఈ శూరుని చరిత్రము సకల జన మనోల్లాసంబుగ నుండునటుల నెల్లూరు జిల్లాలో చేరిన వడ్లపూడి గ్రామములో నివసించియుండు నిడిగంటి వీరయ్యగారి చేతను కడూరి చెంగల్వరాజుగారి చేతను వ్రాయబడి..."

కాని యీ కర్తృత్వ విషయము విశ్వసింప దగినది కాదు. ఈ కథ 1909 వ సంవత్సరమునకు ముప్పయేండ్లు ముందుగనే మిక్కిలి ప్రచారమున నున్నది. క్రీ. శ. 1874 లో జె.ఎ. బోయల్ దొరగారు దీనిని రాయలసీమలో సేకరించియున్నారు పైన తెలుపబడిన నిడిగంటి వీరయ్య ఒక జంగము చెంగల్వరాజు ప్రకటనకర్త, ఇరువురును కలిసి తమ నామములను కవులుగా ముద్రించుకొనిరి. ఈ నిడిగంటి వీరయ్య అను జంగముచే ప్రసిద్ధ కథలను పాడించి, మద్రాసులో ప్రకటన కర్తలు ప్రకటించి యుందురు. దేసింగు రాజు కథ లక్ష్మమ్మ కథ, చిన్నమ్మకథ మున్నగు గుజిలీ ప్రతులలో గూడ నిడిగంటి వీరయ్యపేరు కవిగా నున్నది. ఇదికూడ పైరీతిగా ప్రవేశించినదే కాని యితడు రచయిత కాడు.

తరువాతి కాలమున మద్రాసునుండి 'వెస్టువార్డు అండ్ కంపెనీ' వారు, రాజమహేంద్రవరము నుండి కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్ వారు, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ వారు ఈ సర్వాయి పాపడు కథను ప్రచురించుచు వచ్చిరి. *

# ఆంధ్రప్రదేశ్‌లో లఘుపరిశ్రమల అభివృద్ధి

యన్. కామరాజు పంతులు

పారిశ్రామికాభివృద్ధికి ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో ఉన్న అవకాశాలు అనంతం అపరిమితం. ఆంధ్రప్రదేశ్‌లో అపారమైన ప్రకృతి సంపద ఉన్నది. 30 లక్షల కిలోవాట్ల జలవిద్యుత్ ఉత్పత్తి చేసే సాధన సంపత్తి ఉన్నది. ఆంధ్రప్రదేశ్‌లోని బొగ్గు నిక్షేపములు నాలుగు వేల మిలియన్ల టన్నులు ఉంటుందని అంచనా. భారత దేశములోని మాంగనీసు ఉత్పత్తి మొత్తంలో 11.5 శాతము ఆంధ్రప్రదేశ్ నుంచే లభ్యమవుతున్నది. రత్నాలు, ఇనుము, మాంగనీసు, రాగి, బంగారము, గ్రాఫైటు, క్యానైటు, స్టీటైటు, ఇలిమినైటు, జిప్సము, ఓకెరు, ఫైరుక్లే, క్వార్ట్జు, ఆస్బెస్టసు, ఫెల్సుఫరు, క్రోమైటు, అభ్రకము, యురేనియము, మొదలగు అనేకరకాల ఖనిజములకు ఆంధ్రప్రదేశ్ ఆలవాలము భారతదేశపు బారైటు ఉత్పత్తి మొత్తంలో 90 శాతము ఆంధ్రప్రదేశ్ నుంచే లభ్యమవుతున్నది బీహారు తరువాత, అభ్రకం ఉత్పత్తిలో ఆంధ్రప్రదేశ్ అగ్రస్థానము వహిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లోని పశు, మత్స్య సంపద చెప్పనే అవసరము లేదు. నీటివనరులను గురించి చెప్పే పనేలేదు ఈ అపారమైన ప్రకృతి సంపదనంతటిని సరియైన విధానములో త్వరితగతిని వినియోగించుకొంటే, ఆంధ్ర ప్రదేశ్‌లో పరిశ్రమలు ఎంతైనా అభివృద్ధిచేయవచ్చు. భారత దేశము మొత్తం మీద ఆంధ్రప్రదేశ్ వ్యవసాయరంగంలో ముందడుగు వేస్తుంది యావత్ భారతావనిలో ఆంధ్రప్రదేశ్‌లోని వ్యవసాయదారులు, ఉత్తమ శ్రేణికి చెందిన వారుగా పరిగణింపబడుతారు. ఆంధ్రప్రదేశ్‌లో ఉత్పత్తి అయ్యే అనేకరకములయిన ముడి పదార్థములు, పారిశ్రామికాభివృద్ధికి మరింతగా తోడ్పడుతాయి ఇదికాక నైసర్గిక, భౌగోళిక పరిసితులు గూడా ఆంధ్ర ప్రదేశ్‌లో ఎనలేని పారిశ్రామికాభివృద్ధికి దోహదము చేస్తాయి. పారిశ్రామికంగా ఆంధ్రప్రదేశ్ మిగతా రాష్ట్రములకన్నా ప్రస్తుతము వెనుకబడియున్నా, ఇప్పుడిప్పుడే మిగతా రాష్ట్రములు ప్రాంతములతో సమానస్థాయిలో పోటీపడుతున్నది కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలతో అవిరళ కృషితో వివిధ రీతులలో, మార్గములలో సహాయము చేస్తున్నాయి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఇటీవల ఒసంగుచున్న దోహదమువలన తరతరాలుగా వంశపారంపర్యంగా కేవలము వ్యవసాయ రంగంలోనే కాలక్షేపం చేస్తున్న అనేక ధనిక [illegible] కుటుంబాల దృష్టి పరిశ్రమలు స్థాపించటము అభివృద్ధిచేయటముపై మరలుతున్నది. ఆంధ్ర ప్రదేశ్‌లోని పల్లెతావులలో వివిధ వర్గములకు చెందిన ప్రజానీకము నూతనోత్తేజము, ఉత్సాహము జనింపచేస్తున్నది. అనేక మంది ఇంతకాలంగా వ్యవసాయవృత్తిలోనే మునిగి పోయినవారు గూడా పారిశ్రామిక రంగంవైపు దృష్టి సారిస్తున్నారు. అనేక ప్రాంతములలో కొత్తకొత్త పరిశ్రమలు నెలకొల్పబడ్డాయి. కర్మాగారములు, పరిశ్రమల మొహమే ఎరుగని అనేక ప్రదేశములలోని ప్రజలు, పారిశ్రామిక రంగములోనికి ఎనలేని ఉత్సాహము, ఉత్తేజముతో దూసుకువస్తున్నారు. వాడవాడలలోను కర్మాగారములు నెలకొంటున్నాయి. ముఖ్యంగా లఘు పరిశ్రమల అభివృద్ధి విషయములో ఆంధ్రప్రదేశ్ ఎంతో శీఘ్రగతిని ముందుకు పోతున్నది.

ఆంధ్రప్రదేశ్‌లోని 185 భారీ పరిశ్రమలలోను అత్యధిక భాగము హైదరాబాదు నగర పరిసరములలోను, కొంతవరకు విశాఖపట్నం సమీపములోను కేంద్రీకృతమయి వున్నాయి. స్వాభావికముగా భారీ పరిశ్రమలు పరిమితమైన ప్రదేశములలోనే నెలకొల్పటానికి అవకాశములున్నాయి. భారీ పరిశ్రమల అభివృద్ధి వలన ఏవో కొద్ది ప్రాంతములు, ప్రదేశములు లేక స్థానములలో మాత్రమే పారిశ్రామికాభివృద్ధి సాధించ వీలవుతుంది. కానీ లఘు పరిశ్రమలు, అభివృద్ధి చేసినయెడల, ఏవో కొద్దిప్రాంతములలోగాక యావత్తు ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక రంగములో ముందంజ వేయటానికి ఎంతయినా అవకాశములున్నాయి. బీహారు, పంజాబు రాష్ట్రములలో లఘు పరిశ్రమల అభివృద్ధి మంచి ఉదాహరణము. పారిశ్రామిక వికేంద్రీకరణ పారిశ్రామికాభివృద్ధికి ఎంతయో అవసరమని ప్రణాళికా సంఘ సభ్యులు గూడా అభిప్రాయము వెలిబుచ్చారు. స్థలనిర్ణయము పైగూడా పారిశ్రామిక ప్రగతి ఎంతయో ఆధారపడి యుంటుంది. గ్రామీణ ప్రాంతములలో అత్యధిక సంఖ్యలో కార్మికుల ఉపాధి, వేతనము కలిగించే సాంకేతిక విధానాలు అవలంబించటము, ప్రస్తుత పరిస్థితులలో ఎంతయినా ముఖ్యమని ప్రణాళికా సంఘ సభ్యులు గూడా తెలియపర్చారు. స్థానికంగా లభ్యమయ్యే ముడి పదార్థములు కార్మిక వస్తుసాధన, సంపత్తులను ఉపయోగించుకుంటేగాని ప్రస్తుతము పరిశ్రమలు ఎదుర్కొంటున్న అనేక జటిలసమస్యల పరిష్కారము సాధ్యముగాదు. పారిశ్రామికాభివృద్ధికి వస్తుతహా లేక సహజముగా. సాధన సంపత్తులు, అవకాశములు గలకొన్ని పరిమితమైన గ్రామీణ ప్రాంతములను, చిన్నచిన్న పట్టణ ప్రాంతములను ఎన్నుకోవాలి. పారిశ్రామిక వికేంద్రీకరణ ప్రణాళికలు అమలుపరచటానికి, కేంద్రప్రభుత్వము వారు కొన్ని ప్రదేశములలో వారి సర్వశక్తులు వినియోగించి, భారీ పరిశ్రమలు నెలకొల్పుటకుఅంతకు ముందే నెలకొని యున్న పరిశ్రమలను మరింత త్వరితగతిని అభివృద్ధిచేయుటకు వివిధప్రయత్నములు చేస్తున్నారు. మరొకవంక రాష్ట్రప్రభుత్వము ఆంధ్రప్రదేశ్‌లో నలు మూలల లఘుపరిశ్రమల స్థాపనకు కృషిచేస్తున్నది. అత్యధిక సంఖ్యలో ఉద్యోగావకాశములు కలిగించుటయేగాక, రాష్ట్రవ్యాప్తముగా పారిశ్రామికాభివృద్ధిని విస్తృత పరచుటలో ఎంతగానో, తోడ్పడే లఘు పరిశ్రమల అభివృద్ధికి రాష్ట్రప్రభుత్వము ఎంతో కృషిచేస్తున్నది.

లఘుపరిశ్రమల అభివృద్ధికి రాష్ట్రప్రభుత్వము ఎంతో ప్రాధాన్యము ఇస్తున్నది. రాష్ట్రంలోని ఆర్థికవ్యవస్థ బహుముఖముగా విస్తృత మొనర్చుటకు ఇదొక్కటే మార్గము.

లఘు పరిశ్రమల అభివృద్ధి వలన స్థానిక ప్రజల సాంకేతిక పరిజ్ఞానము, సాధన, సంపత్తులను పెంపొందింపచేసి వాటిని మరింత ప్రయోజన కారిగా మార్చు కొనవచ్చును. అంతగా అభివృద్ధి చెందని చిన్నతరహా బస్తీలు, పట్నములలో పారిశ్రామిక వాడలు నెలకొల్పుట వలన, ఆయాప్రాంతముల ఆర్థిక వ్యవస్థ మెరుగు పడుటయేగాక, తత్పరిసరములలో నున్న గ్రామీణ ప్రాంతముల ఆర్థిక పరిస్థితులు ఎంతో మెరుగుపడటము, పల్లెలు, పట్నముల ఆర్థిక వ్యవస్థ మరింత సన్నిహితమవటము కొన్ని ముఖ్యప్రయోజనములు.

ప్రణాళికా బద్ధమైన పారిశ్రామిక ప్రగతి సాధించటములో కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల కృషి ఎంతయినా ప్రశంసనీయము. ఆంధ్రప్రదేశ్‌లో అనేక ప్రత్యేక సంస్థలునెలకొల్ప బడ్డాయి. లఘు పరిశ్రమల అభివృద్ధి సాధించుట కొరకు, ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంటు కార్పొరేషను, ఆంధ్రప్రదేశ్ స్టేటు ఫైనాన్షియలు కార్పొరేషను, ఆంధ్రప్రదేశ్ స్మాలు స్కేలు ఇండస్ట్రియల్ డెవలప్‌మెంటు కార్పొరేషను, ఆంధ్రప్రదేశ్ మైనింగు కార్పొరేషను, ఆంధ్రప్రదేశ్ స్టేటు ఎగ్రో ఇండస్ట్రీసు కార్పొరేషను—వీటిలోచాలా ముఖ్యమయినవి. ఇవికాక కేంద్రప్రభుత్వముచే స్థాపింపబడిన నేషనల్ స్మాల్ ఇండస్ట్రీసు కార్పొరేషను గూడా ఆంధ్రప్రదేశ్‌లోని లఘుపరిశ్రమల అభివృద్ధికి ఎంతోకృషి చేస్తున్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము లఘుపరిశ్రమల అభివృద్ధికి ఎన్నో విధములుగా సహాయము చేస్తున్నది. లఘు పరిశ్రమలు ఇండస్ట్రియల్ లైసెన్సు సంపాదించు కొనటములోను, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన ప్రాంతములలో పరిశ్రమ స్థాపించుటకు కావలసిన స్థలము సంపాదించుటము లోను, తక్కువ రేట్లకు నీటిసరఫరా చేయడములోను, పరిశ్రమలు నడుపుటకు కావలసిన విద్యుత్సరఫరా తక్కువ రేట్లకు లభింపచేయటములోను ఆక్ట్రాయి పన్నునుంచి మినహాయింపు చేయటములోను, ఆర్థిక సహాయము కావలసినంతగా చేయటంలోను, ప్రభుత్వము ప్రయివేటు యజమానులు కలిసి ఉమ్మడి యాజమాన్యము క్రింద పరిశ్రమలు స్థాపించటములోను, రాష్ట్రప్రభుత్వ శాఖల కొనుగోలు కార్యక్రమములలో లఘుపరిశ్రమల సంస్థలలో ఉత్పత్తియైన వస్తువులకు ప్రాధాన్యమిచ్చుటలోను, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము అనేక రకములుగా సహాయము చేస్తున్నది. ఇవికాక, రాష్ట్రప్రభుత్వము లఘుపరిశ్రమలకు, అమ్మకంపన్ను నుంచి మినహాయింపు సౌకర్యము నొసంగుచున్నది. కొన్ని కొన్ని ప్రత్యేక ప్రాంతములలో లఘుపరిశ్రమల స్థాపనకొరకు అనేక రకములయిన ఆకర్షణీయమైన సౌకర్యములు కలుగచేస్తున్నది. పారిశ్రామిక వాడలలో లఘుపరిశ్రమలకు, ఫ్యాక్టరీస్థలములు, షెడ్డులు తక్కువ అద్దెకు లభింపచేస్తున్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ ముఖ్య కార్యదర్శి, అధ్యక్షుడుగాను, పరిశ్రమలశాఖ డైరక్టరు మెంబరు సెక్రెటరీగాను, ఒక ఉన్నతాధికార సంఘము నియమించబడినది. లఘుపరిశ్రమల స్థాపన విషయములోను, అభివృద్ధి విషయములోను, ఎదురయ్యే సమస్యలను సత్వరము, జాప్యము లేకుండా పరిష్కారము నొసర్చుటకు. ఇవికాక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఫైనాన్షియలు కార్పొరేషను. లఘుపరిశ్రమల స్థాపన కొరకు అవసరమయ్యే ఆర్థికసంపత్తిలో నూటికి 80 వంతులు, అప్పులు రూపంగా సహాయముచేస్తున్నది. వెనుక బడిన ప్రాంతములలో ఈ ద్రవ్య సహాయము నూటికి 85 వంతుల వరకు గూడా ఉంది. ప్రగతి కొంత వరకు సాధించిన ప్రాంతములలో నూటికి 7 1/2 శాతము వడ్డీపై అప్పులు ఇస్తుంటే వెనుకబడిన ప్రాంతములలో నూటికి 6 శాతము చొప్పున మాత్రమే వడ్డీ వసూలు చేస్తున్నది కార్పొరేషను. మొదటి నాలుగు సంవత్సరముల చివర వరకు, అప్పులో నూటికి 30 వంతుల సొమ్ము, అసలు వాయిదాలు, వడ్డీ వసూలు చేయకుండా మినహాయింపులు ఇస్తున్నది. లఘుపరిశ్రమల స్థాపనలో అవసరమయిన యంత్రములు, పరికరములు, పనిముట్లు కొనటములో సప్లయిర్లకు, గ్యారంటీ సౌకర్యములు గూడా ఇస్తున్నది. ఒక్క ఆంధ్రప్రదేశ్ స్టేటు ఫైనాన్షియలు కార్పొరేషన్ ఇంతవరకు 637 లఘుపరిశ్రమలకు 19,86,68,42,000 రూపాయిల ద్రవ్య సహాయముచేసినట్లు తెలుస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వము కృషి చాలా వరకు సఫలీకృత మవుతున్నట్లే కనపడుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లోని ఎక్కడో మారు మూలల ప్రాంతములలోగూడా లఘు పరిశ్రమల అభివృద్ధి తత్ప్రాంతములోని ప్రజలలో నవచైతన్యము, నూతనోత్సాహము, కలిగిస్తున్నదనుటలో అతిశయోక్తి లేదేమో? 1961లో ఆంధ్రప్రదేశ్‌లోని లఘు పరిశ్రమల మొత్తం సంఖ్య 2214 మాత్రమే. 1966 కల్లా ఆంధ్రప్రదేశమంతటా 4800 లఘు పరిశ్రమలు నెలకొన్నాయి. 1970 సంవత్సరానికల్లా 19000 లఘు పరిశ్రమలు నెలకొల్పబడ్డాయి. ఇంతకన్నా తార్కాణములు ఏమికావాలి—చెప్పండి. ఆంధ్రప్రదేశ్‌లోని లఘు పరిశ్రమల ప్రగతికి, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల అవిరళ కృషికి, సాధనకు దోహదమునకు నిదర్శనలు. 1970 మార్చి నెలాఖరునకు రాష్ట్రప్రభుత్వము పరిశ్రమల సహాయక శాసనము క్రింద 1.33 కోట్ల రూపాయల ఆర్థిక సహాయము లఘుపరిశ్రమలకు అందజేసినది. స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, దాని ఉపసంస్థ స్టేటు బ్యాంకు ఆఫ్ హైదరాబాదు వారు 6518 లఘుపరిశ్రమలకు 32.17 కోట్ల రూపాయిల ద్రవ్య సహాయము చేశారు. ఇది కాక మిగతా కమర్షియలు బ్యాంకులు గూడా ఎంతో ఆర్థిక సహాయము చేసాయి. ఆంధ్రప్రదేశ్‌లోని లఘు పరిశ్రమల అభివృద్ధికి నేషనల్ స్మాల్ ఇండస్ట్రీసు కార్పొరేషను వారు గూడా 159.0 లక్షల రూపాయిల విలువగల యంత్ర పరికరములు అందచేసారు. 1969 మార్చి నెలాఖరు వరకు లఘు పరిశ్రమల యజమానులకు ఆంధ్రప్రదేశ్‌లోని లఘు పరిశ్రమల అభివృద్ధికి అందజేస్తున్న సహాయానికి పై నుదహరించిన సంఖ్యలు గొప్ప తార్కాణములు.

185 భారీ పరిశ్రమల సంస్థలలో ఇప్పటివరకు 292 కోట్ల రూపాయల మూలధనము వెచ్చింప బడియున్నది. ఈ సంస్థలు 84,373 మందికి జీవనోపాధికల్పిస్తున్నాయి. 1969 జూను నెలాఖరు వరకు లఘు పరిశ్రమల జాబితాలో నమోదు అయిన సంస్థలు

మొత్తం 41.25 కోట్ల రూపాయిల మూలధనము కలిగి యున్నాయి. 1.42 లక్షల కార్మికులకు జీవనోపాధి కలిగిస్తున్నాయి. కొద్ది మూల ధనముతో అత్యధిక సంఖ్యలో కార్మికులకు జీవనోపాధి కలిగించుటలో లఘు పరిశ్రమలు వాటికి అవే సాటి. భారీ పరిశ్రమలలో భారీ ఎత్తున మూలధనము వెచ్చించటము చివరకి అవి బహు స్వల్ప సంఖ్యలో కార్మికుల జీవనోపాధి కల్పిస్తాయని పాఠకులందరికి సువిదితమే. అందుకనే లఘు పరిశ్రమల అభివృద్ధి ఎంతయినా అవసరము. మూలధనము, జీవనోపాధి కల్పిస్తున్న కార్మికుల సంఖ్య నిష్పత్తి భారీ పరిశ్రమలు, లఘు పరిశ్రమల్లో ఒక్కసారి పరీక్షించి చూస్తే లఘుపరిశ్రమల అభివృద్ధికి మనం ఎందుకు ప్రాధాన్యము ఇవ్వాలో తేటతెల్లముగా తెలుస్తుంది.

ఆంధ్రప్రదేశ్‌లోని లఘు పరిశ్రమల సంస్థలలో ఉత్పత్తి అవుతున్న పరికరములు, వస్తువులు, ఎన్నిరకములో చెప్పలేము. బైసికిలు, స్పేరుపార్టులు, కుట్టు యంత్రములు, వాటి స్పేరు పార్టులు, స్టీలు ఫర్నీచరు, సర్వ్రాయింగు పని ముట్లు, రోలింగ్ షట్టర్లు వాటరు మీటర్లు, వ్యవసాయ పనిముట్లు, డస్టర్లు, స్ప్రేయర్లు, అల్యూమినియము పని ముట్లు, వస్తువులు, ఇంకా ఎన్నో సాధారణ, మరియు ప్రత్యేక తరహాలకి చెందిన వస్తువులు ఉత్పత్తి అవుతున్నాయి.

విద్యుత్పరికరములు, పరిశ్రమలు చూపుతున్న అభివృద్ధి ఎంతో మెచ్చుకోతగ్గది. వెల్డింగు ట్రాన్స్ఫర్మర్లు, ఫానులు, మోటారు ట్యూబులైటు ఫిట్టింగులు, అత్యవసర విద్యుత్ప్రేరకపు పరికరములు, సాధన సంపత్తి: స్విచ్చులు A.C.C. మరియు A.C.S.R. కండక్టర్లు, రెసిస్టర్లు, పరికరములు, రోటోమీటర్లు మొదలగు అనేక రకములయిన వస్తు సామగ్రిని ఉత్పత్తి చేస్తున్నాయి. ఆటోమోబైలు పరిశ్రమకు చెందిన లీఫుస్ప్రింగులు, ప్యూయలు, ఆయిలు, ఫిల్టర్లు, విండుస్క్రీనులు, వైపరు రేడియేటర్లు హబ్బు డ్రమ్ములు, కింగుపిన్నులు, ఘటగ్రీజునిపుల్సు మొదలగు అనేక చిన్న చిన్న వస్తువులు గూడా ఆంధ్రప్రదేశ్‌లోని లఘుపరిశ్రమల సంస్థలలో ఉత్పత్తి అవుతున్నాయి. అనేక రసాయినిక వస్తువులు గూడా యీ లఘు పరిశ్రమలలో ఉత్పత్తి కావింపబడుచున్నాయి.

పెయింట్లు, వార్నిషులు, ఆహారాపదార్థాలు, క్రిమిసంహారక పదార్థములు, మూల రసాయనములు, కార్కులు, బిరడాలు, సర్జికలు, కాటను బాండేజి క్లాత్, వైద్య అవసరములకుపయోగించే గుడ్డ, పాలిథిన్ ఫిల్ములు, కారుగేటెడు బోర్డు, ఇత్యాది ప్యాకింగు పదార్థములు: పెట్టెలు, వాటర్ ప్రూఫు కాగితములు, అట్టలు మొదలగు అనేక వస్తువులు గూడా ఆంధ్రప్రదేశ్‌లోని లఘు పరిశ్రమల సంస్థలలో ఉత్పత్తి అవుతున్నాయి.

ఉత్తమ శ్రేణికి చెందిన రసాయన పదార్థములు, మందులు ఔషధములు, రంగులు, రంగుల తయారీలో ఉపయోగపడే ధాతువులు, రబ్బరుతో తయారు చేసే వస్తువుల, పరిశ్రమలు, కూడా ఎంతో ప్రగతిని సాధించాయి. ప్లాస్టిక్ ఫోములు, U ఫోములు, పాలిసన్ ఫోము, మొదలయిన అనేక విలాస వస్తువులు గూడా తయారీ అవుతువ్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని లఘు పరిశ్రమలలో.

ఇవి కాక హిందుస్థాన్ ఏరోనాటిక్సు, ఆల్విన్ మెటలు వర్క్సు, చార్మినారు సిగరెట్టు ఫ్యాక్టరీ, జే ఇంజనీరింగు కంపెని మొదలగు అనేక భారీ పరిశ్రమలలో ఉపయోగించే చిన్న చిన్నపని ముట్లు, వస్తువులు గూడా తయారవుతున్నాయి ఆంధ్రప్రదేశ్‌లోని లఘు పరిశ్రమలలో.

హైద్రాబాదులో నెలకొని యున్న లఘుపరిశ్రమల సర్వీసు ఇన్‌స్టిట్యూట్ వారుకూడ లఘు పరిశ్రమల అభివృద్ధికి ఎంతగానో సహాయం చేస్తున్నారు. P.V.C రిజిడు పైపులు, షేపులు, ఓవెను సాక్సు మొదలగు అనేక వస్తువుల ఉత్పత్తిలో స్మాల్ ఇండస్ట్రీస్ సర్వీసు ఇన్‌స్టిట్యూటు వారు చేస్తున్న దోహదము ఆంధ్రప్రదేశ్ లోని ఆర్థిక వ్యవస్థను మరింత విస్తృత పరుస్తుందనుటలో అతిశయుక్తి లేదనుకుంటాము. కొద్ది సంవత్సరములక్రితము వరకు యీ పైనుదహరించిన వస్తువులలో ఏ ఒక్కటి గూడా ఆంధ్రప్రదేశ్‌లో ఉత్పత్తి గావింప బడలేదని తెలుసు కోవడములో ఆశ్చర్యము లేదు.

ఆంధ్రప్రదేశ్ లోని లఘు పరిశ్రమల అభివృద్ధికి అనేక ప్రణాళికలు సిద్ధంగా ఉన్నాయి. పలు ప్రాంతములలో ఇప్పటికి వివిధ తరహాలకి చెందిన వస్తువుల ఉత్పత్తికి బహుముఖ కృషి జరుగుచున్నా, ఇప్పటివరకు పారిశ్రామిక వాడల స్థాపనలో గాని, ఉత్పత్తి చేసే వస్తువులను ఎన్నుకోవటం గాని, పారిశ్రామిక ఉత్పత్తి స్థానముల లోగాని ఏ మాత్రము విచక్షణలేనట్లుగానే కన బడుచున్నది. ఇది కొంతవరకు మంచిదే అనుకోండి. ఎందుకంటే రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ బహుముఖంగా విస్తృత మవుతుంది. ప్రాంతీయ విభేదాలు, వైషమ్యాలు తలెత్త నీయవు. మొదటి దశలో ఇది చాలా అవసరము. కానీ పారిశ్రామిక ప్రగతి ముందంజ వేస్తున్న కొద్ది ప్రథమ దశదాటి మరో దశలో ప్రవేశిస్తున్నపుడు కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు గూడా యీ పారిశ్రామికాభివృద్ధిని విచక్షణా రహితముగా ఒక క్రమ బద్ధమైన మార్గములో ప్రణాళికా బద్ధమైన రీతులలో అంటే స్థలము, వస్తువుల ఉత్పత్తి విషయములు రెండింటిలో రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ మరింత సుసంపన్నము చేయుటలో, ఏ ప్రదేశము, ఏవస్తువుల ఉత్పత్తి మరింత దోహదము చేస్తాయి అనిఆలోచించి ఆయా ప్రదేశములలో ఆయా వస్తువుల ఉత్పత్తి అధికతరము చేయుటకు ప్రయత్నము చేయుట ఎంతయినా అవసరము. కొన్ని కొన్ని సమయములలో విచక్షణ చేయకతప్పదు. దీనినిగురించి ఎట్టిదురపోహాలకు తావుఇవ్వగూడదు.

గ్రామీణ ప్రాంతములలో లఘు పరిశ్రమలు విరివిగాస్థాపించి ననేగాని, ఆర్థిక, పారిశ్రామిక వికేంద్రీకరణ సాధ్యముకాదు. చిన్న పట్టణములలోను, పల్లెలలోను లఘుపరిశ్రమలు అధికసంఖ్యలో స్థాపించాలి, వ్యవసాయ పరిశ్రమల అభివృద్ధికి ఇది ఎంతోసహాయకారిగా ఉంటుంది. గ్రామీణ ప్రాంతముల ఆర్థిక వ్యవస్థ విస్తృత పరచటములో లఘు పరిశ్రమలుచేసేసేవ ఎంతో ప్రశంసనీయము. సోషలిస్టు సమాజ స్థాపనలోను సమాజములోని, వర్గ తారతమ్యముల నిర్మూలనలోనూ, ఆర్థిక వ్యత్యాసాల నంత మొందించటము లోను, నిరుద్యోగ సమస్య పరిష్కారములోను గ్రామీణ ప్రాంతములలోని వ్యవసాయ, కార్మిక, కర్షక జనసందోహాల ఆర్థికాభ్యున్నతికి లఘుపరిశ్రమల అభివృద్ధి ఎంతయినా అవసరము. ★

# ఆర్థిక వ్యత్యాసములు

పి. రాజారావు

వ్యక్తుల ఆదాయములలోని అసమానత్వము హిందూదేశము నందేగాక అమెరికా వంటి అభివృద్ధి నొందిన దేశములలో కూడ కానవచ్చుచున్నది. బీదతనమనునది ఒక్క ఆర్థిక సమస్యయే కాదు. జటిలములైన అనేక సాంఘిక సమస్యలు దానిలో చిక్కుకొన్నవి. అనారోగ్యము, నిరక్షరాస్యత, వయః పరిపాకము వలన కల్గిన అశక్తత మొదలగునవి అట్టి సమస్యలకు కొన్ని ఉదాహరణములు. బీదతనమును పూర్తిగ నిర్మూలించిన దేశము నందైనను ధనవంతులలో ఎక్కువ తక్కువలు కొనసాగుచునే యుండును. అట్టి ఆర్థికాసమానత్వము నిర్మూలన మెంతవరకు లాభదాయకమో ఈ వ్యాసమున చర్చింపబడినది.

ఆర్థికా సమానత్వము సంఘములోని ప్రతి వానిని అధిక కృషి చేసి ధనార్జన చేయుటకు ధన సంపత్తిలో పైతరగతిని చేరుటకు ఉత్సాహ పరచును. ఎక్కువ లాభములను పొందిన ధన సంపత్తి వలన కలుగు అధికార గౌరవములను పొందవలెనను కోరికయే నాగరికతాభివృద్ధికి మూలకారణము ఆర్థికాసమానత్వము న్యాయ సమ్మతము, ప్రకృతి సిద్ధమైనదనియు వాదించు వారీ కాలమందును గలరు. ప్రకృతిలో మానవులందరు దేహబలము, బుద్ధి బలము మున్నగు పెక్కు విషయములలో సమానముగ సృష్టించబడ లేదు. ఈ అసమానత్వము ప్రకృతి సిద్ధము. అందువలన ధనసంపత్తిలో కూడా అసమానత్వము ప్రకృతిసిద్ధము సహజము అని వీరి వాదము. కాని ప్రకృతిని ప్రగతి పథములో తగినట్లు మార్చుటయేకదా మానవాభ్యుదయమునకు ఆధారము. సంఘములోని ప్రతి మానవుడు తన పరిసరముల వలన ప్రభావితుడగును. జీవిత యుద్ధములో విజయము సాధించినను పరాజయ మొందినను సంఘ ప్రభావము దాని యందు మిక్కుటముగ ఉండుననుట నిస్సంశయము. సంఘము వలన ఏర్పడిన ఆర్థికాసమానత్వమును నిర్మూలించుట సంఘములోని ప్రతివానికి విధియై యున్నది. అదియునుకాక అట్టి అసమానత్వము అనేకానర్థములకు దారి తీయును. ధనవంతులు సంఘప్రయోజనకరములైన వస్తువులను తయారుచేయుటకు ఏమియు సహాయము చేయక విలాస జీవితములో కాలమునంతయు వ్యర్థము చేయుదురు. తిండి, గుడ్డ లేక బీద ప్రజలు సంఘ ప్రయోజనకరములైన వస్తువులను తయారు చేయు శక్తి గల్గి యుండరు. ఆర్థికాసమానత్వము సాంఘిక అసంతృప్తికి దారి తీయును. దీనివలన సాంఘిక ఘర్షణ విప్లవము రాజకీయ అనిశ్చలత అనివార్యములగును. ఆర్థిక సమానత్వమును సాధించిన దేశములలో వస్తూత్పత్తి అధికమగును. ప్రజలు తృప్తులగుదురు. అట్టి దేశము అభ్యుదయమును గాంచుననుటలో సందేహము లేదు.

తప్పుదారులలో ధనార్జనము చేసి సంఘములో గొప్పవారుగా చలామణి అగుట న్యాయసమ్మతము కాదు. మరియు క్రమ క్షీణోపాంత ప్రయోజన సిద్ధాంతము Law of Diminishing Marginal utility ప్రకారము రూ. 100 ఆదాయముగల వ్యక్తి రూ 10,00_ ఆదాయముగల వ్యక్తికన్న పదిరెట్లు తృప్తిని పొందడు. అందువలన దేశాదాయమును సమ పద్ధతిలో ప్రజలందరికి పంచిన మొత్తము దేశప్రజల సుఖసంతోషము అధికమగుననుటలో సందేహము లేదు. ప్రపంచ ప్రఖ్యాతి నందిన ఆర్థిక శాస్త్రవేత్త కీ॥ శే॥ కేన్సు సిద్ధాంతము ప్రకారము నిరుద్యోగ సమస్యకు మూల కారణము ఆర్థికాసమానత్వమే. ధనవంతులు తమ అధిక ధనమును నిల్వచేయుదురు. బీదవారికి కోరికలున్నను ధనాభావముచే వస్తువులను కొనుటకు శక్తి చాలకయుందురు. వస్తువులకు గిరాకి తక్కువ ఉండుటచే తయారు తక్కువగును. దానివలన నిరుద్యోగ సమస్య ఉత్పన్నమగును.

అట్లని పూర్తి సమానత్వము కూడ దేశమునకు మంచిది కాదు. కమూనిస్టులు సహితము ప్రజల అవసరముల కనుగుణముగ దేశాదాయమును పంచవలెనని సిద్ధాంతీకరించిరే కాని పూర్తి సమానత్వమును సమర్ధింపలేదు. వివిధ వ్యక్తుల వ్యక్తిత్వములు పూర్తిగ వికసించుటకు వివిధములైన అవసరములుండును. క్రీడాకారుని అవసరములు వేరు. చిత్రకారుని అవసరములు వేరు; ఫ్యాక్టరీ కార్మికుని అవసరములు వేరు. ఈ అవసరముల ప్రకారము దేశాదాయమును పంచవలసిన అవసరమును మేధావులు కమూనిస్టు దేశములలో కూడ గుర్తించిరి. ప్రతి వ్యక్తి దేశసంపత్తి నభివృద్ధి పరచుటకు ఎంత కృషిచేయునో ఆ కృషుల నిష్పత్తిలోనే దేశాదాయమును ప్రజలకు అందునట్లు చేయవలెను. ధనార్జనమునకు వ్యక్తి స్వేచ్ఛ అవసరము. కాని ధనవంతులు ఇతరులను తమ అధీనములో ఉంచుకొని వారి స్వేచ్ఛకు భంగము కలిగింతురు. అట్టి అధికారము ఎవ్వరికిలభింప కుండునట్లు దేశాదాయపు పంపకము జరుగవలయును.

పైని పేర్కొన్న భిన్నాభిప్రాయములకు పొందిక ఏర్పరచుటకై ఈ క్రింది నాలుగు సూత్రముల ప్రకారము దేశసంపత్తిని ప్రజలలో పంపకము చేయవలెనని ఆర్థిక శాస్త్రవేత్తల అభిప్రాయము.

మొదటిది : దేశములోని ప్రతి మానవునికి లభించు ఆదాయమునకు కనిష్ట పరిమితిని నిర్ణయించి ఏ ఒక్కని ఆదాయమును ఆ పరిమితికి తగ్గకుండునట్లు చూడవలెను. అట్లని సోమరులను

ప్రభుత్వము పోషింపరాదు. శారీరకములైన కారణముచే గాని, సాంఘికములైన కారణములచే గాని పనిచేసి ధనార్జనము చేయుటకు వీలులేనివారిని ప్రభుత్వము కనీస పరిమితికి తీసికొనిరావలెను.

రెండవది : దేశసంపద అభివృద్ధి కొరకు ప్రతి మానవుడు ఎంతపాటుపడునో ఆ కృషికి తగినట్లు వారికి ఆదాయము లభించునట్లు ప్రభుత్వము చూడవలెను. తక్కువ కృషిచేసి ఎక్కువ ధనార్జనముచేయు అవకాశములను తీసివేయవలెను. స్వప్రయోజనమే కాని సాంఘిక ప్రయోజనము లేని కృషికి ధనము లభింపనీయరాదు. మరియు సాంఘిక ప్రయోజనమునకు మించిన ఆదాయము ఎవ్వరికి లభింపకుండ చూడవలెను. ఎక్కువ వడ్డీలు పుచ్చుకొనుట, వ్యాపారములో అధిక లాభములు పొందుట, వృత్తిలో ఎక్కువ జీతములను తీసికొనుట మొదలైన పద్ధతులను ప్రభుత్వము నిర్మూలింపవలెను. లేదా తగినంత అదుపులో ఉంచవలెను.

మూడవది : ప్రతి మనుజునిలోను నిగూఢమైన శక్తులకు తగిన ప్రోద్బలమునిచ్చి ఆ మానవుడు పూర్తి అభ్యుదయమును సాధించునట్లు దేశాదాయము పంపకము జరుగవలెను. ధనాభావము వలన శక్తిమంతుడెవడును మఱుగున పడరాదు. ఈ సూత్రము ప్రకారము ప్రతివాని యొక్క ప్రకృతి సిద్ధమైన శక్తులను ప్రభుత్వము గ్రహించు యంత్రాంగము నేర్పరచి ఆ శక్తుల అభివృద్ధికొరకై ఉచిత విద్య నందించవలెను.

నాల్గవది : మన దేశమువంటి దేశముల ఆదాయము పై సూత్రముల ప్రకారము పంచుటకే సరిపోదు. కాని అభివృద్ధి పొందిన అమెరికావంటి దేశములలో ఆ ప్రయోజనములు నిర్వర్తింపబడిన తరువాత కూడా ఆదాయము మిగులును. అట్టి ఆదాయముకూడ ఏ ఒక్కరి ప్రయోజనము కొరకు కాక సంఘ ప్రయోజనమునకై ఉపయోగపడునట్లు ప్రభుత్వము చూడవలెను. ★

# స్పందన

—గుంటి పుండరీకాక్షయ్య

జీవితం అందాల రస రాజ్య మని
ఆనందం – ఆహ్లాదం – అనుభూతులు
కలగా పులగం చేసి
విధాత సృజించాడని
ఊహల చాంపేయ మాల లల్లాను
రమ్య హర్మ్యాలు వినిర్మించాను

ప్రతి అక్షరం రమణీయంగా పేర్చి కూర్చి
నా ఊహా ద్వారానికి
రమ్య భావాల తోరణాలు కట్టి
కావ్యాలు కూర్చాను – గేయాలు రాశాను
కథలు చెప్పాను.

పేర్చుకున్న ఆశల బందిఖానాలో
అవాస్తవిక ఊహలు వెంగిలి విస్తర్లని
తెలుసుకోలేకపోయాను !
నిన్నటి జీవితం నా కనులముందు
నిలిచి వెక్కిరిస్తుంది హేళనగా !

కలతపడిన మనసుల ప్రమోతలు
రక్తంలా చిమ్ముతున్న స్వాతంత్ర్యం
పేదవాని కూలుతున్న కలల మేడ
చితి మంటలా కాలుతున్న భాగ్యనగరి
సమస్యల బ్రహ్మ జెముడు డొంకలు
కలలోని అస్థి పంజరంలా
భయపెడుతుంది ఈ జీవితం
చైతన్య స్ఫూర్తి లేని జడపదార్థంలా

ఒదిగి ఒదిగి వుండలేను
గతానికి దాసోహమనలేను
ఈ చీకటి నిశిలో ప్రమగ్గలేను
ఆశయాల ప్రేయసిని ఆరాధిస్తాను

నిజం ఇంటో వసిస్తాను
మానవత నా ఊపిరి
అనాథుడు నా దేవుడు
నా గుండెలో జరుగుతోంది స్పందన !

సామాన్యుడి గుండె గుడిలో
ఆరిపోయిన జీవకాంతుల్ని
వెలిగిస్తుంది నా కలం

మానవాళి నిండు గుండెలలో
సమత, మమత, సుహృద్భావం నింపుతా !
సామ్యవాద సమాజం నెలకొల్పుతా !
విశ్వమానవ హృదయ విపంచి మీటి
మధుర తంత్రీ నాదాలు పలికిస్తా

ప్రతి యింట ఆనంద తోరణాలు వెలయిస్తా
అందుకే నా కలం
నింపుకున్నది మషీ పంకిలం కాదు
నిరుపేదల నిండు గుండెల నెత్తురు !

# ఆంధ్ర ప్రదేశ్‌లోని వినోదయాత్రా కేంద్రాలు

కనకారావు సలాది

ఈనాడు ప్రపంచమందంతటా విజ్ఞాన వినోద యాత్రలు అభివృద్ధి చెందాయి అంతేకాకుండా పాశ్చాత్యదేశాలలో కొన్ని యీనాడు తమకుగల అత్యంత ఆకర్షణీయమైన వస్తు, శిల్ప, ప్రదేశ ప్రదర్శన ద్వారా కోట్లాది విదేశ మారక ద్రవ్యం సంపాదిస్తూ వున్నాయి. మరో ముఖ్య విషయం, యీనాడు నాగరికత, అత్యంత ఆధునికంగా, ముందంజవేసిన దేశాలు, తమ యాత్రా కేంద్రాలను అభివృద్ధి చేసుకొంటున్నాయి. తద్వారా సొమ్ము సంపాదించుకుంటూ, తమ దేశాలను భాగ్యవంతం చేసుకొంటున్నాయి. సాధారణంగా యాత్రికులు, విదేశాలవారుగాని స్వదేశీవారుగాని, ఆకర్షించబడాలంటే, ఒక ప్రదేశంలో ఆకర్షణీయమైన వస్తు శిల్పాలుగాని, ప్రకృతి సుందరతగాని, ప్రసిద్ధిచెందిన పురాతన శిల్పాలు, ప్రదేశాలుగాని, జలపాతాలుగాని, చిత్రవిచిత్ర భంగిమలు గల కట్టడాలు దేవాలయాలుగాని, వింతలు, విశేషాలు పుష్కలంగా ఉండాలి. ఇవి ఆడ, మగ, అందరినీ ఆకర్షించాలి, అప్పుడే వినోద యాత్రలు విజయవంతం అవుతాయి. యాత్రికులకు వినోద విజ్ఞానాన్ని, ప్రజలకు ప్రభుత్వానికి ఆర్థిక సమృద్ధిని కలిగిస్తాయి: యితర దేశాలవలె యీనాడు, మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, వినోద యాత్రా కేంద్రాలు ఎంతో అభివృద్ధి చేస్తున్నాయి. అంతకంటె ముఖ్యమైన విషయం, యాత్రికులకు సౌకర్యార్థం, వీలైనన్ని కేంద్రాలలో టూరిస్టు హోటళ్ళు, బస్‌లు, గైడ్లు, రవాణా సదుపాయాలు ఎక్కువగా, ఏర్పాటు చేస్తూ ఆదాయాన్ని అభివృద్ధి చేసుకుంటున్నాయి. మన దేశంలోకూడా భూలోక స్వర్గంగా వినుతికెక్కిన "కాశ్మీర్" వినోద యాత్రా కేంద్రంగా ఎంతో విదేశ మారక ద్రవ్యాన్ని మన ప్రభుత్వానికి సంపాదించి పెడుతూ ఉంది. కన్యాకుమారినుండి కాశ్మీర్ వరకు వేలాది వినోద యాత్రా కేంద్రాలున్నాయి. ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు అత్యంత త్వరితగతిని యీ కేంద్రాలను అభివృద్ధి చేస్తూ ఉన్నాయి. అన్ని విషయాలలోను, అతి శీఘ్రగతిని అభివృద్ధిని సాధిస్తూ, అన్ని రాష్ట్రాలకు మార్గదర్శకంగా మనగలుగుతూ ఉన్న మన రాష్ట్రంకూడా వినోద యాత్రల విషయంలో, విశేషమైన అభివృద్ధిని సాధించింది. యాత్రా కేంద్రాల సంఖ్యలో మన రాష్ట్రం ఏ రాష్ట్రానికి తీసిపోదు.

"వినోదయాత్రా" రంగంలోకూడ మన రాష్ట్రం, ముందంజ వేయగలదు. అటు శ్రీకాకుళం జిల్లానుండి యిటు రాయలసీమలోని జిల్లాలు, అన్నికూడా కొన్ని ఉత్తమ తరగతి, మధ్య తరగతి, యాత్రా కేంద్రాలు కలిగి ఉన్నాయి. ముఖ్యంగా యీ నాటి నవ సమాజ దేవాలయాలుగా గుర్తించబడిన నాగార్జునసాగర్ ప్రాజెక్టు, శ్రీశైలం ప్రాజెక్టు, ప్రకాశం బారేజీ, ఒట్టిగడ్డ ప్రాజెక్టు, వరాహ రిజర్వాయరు, తాండవ రిజర్వాయరు, స్వర్ణ ప్రాజెక్టు, బాహుదా రిజర్వాయరు, గాజులదిన్నె ప్రాజెక్టు, గండిపాలెం ప్రాజెక్టు, సీలేరు ప్రాజెక్టు, మొదలైనవి, అమరావతి, ధరణి కోట, శ్రీ కాకుళం, ఘంటసాల, కొండపల్లి ఖిల్లా, గోల్కొండ కోట, హంపి, విజయనగరం, బొబ్బిలి మున్నగు చారిత్రిక కేంద్రాలు నాగావళి, గోదావరి క్రిష్ణా, పెన్నా నదులు వాటిపైగల ప్రసిద్ధ నగరాలు పవిత్ర క్షేత్రాలు, ఆంధ్రప్రదేశ్‌లోని తూర్పున సముద్ర తీర ప్రాంతం, ఆ ప్రాంతంలోని రేవు పట్టణాలు, పురాతన దేవాలయాలు వందలాదిగా ఉన్నాయి. పౌరాణికంగా ప్రసిద్ధిచెందిన ప్రదేశాలు, చారిత్రికంగాను భారత స్వాతంత్ర్య సముపార్జనలో ప్రాముఖ్యత వహించిన పట్టణాలు అనేకం ఉన్నాయి. మన రాష్ట్ర ప్రభుత్వంకూడ నడుంకట్టి, వినోద యాత్రా కేంద్రాలలో ఎక్కువ భాగానికి అవసరమైన ధనాన్ని వెచ్చిస్తూ ఆయా ప్రదేశాలను యాత్రికుల రాకపోకలకు అనుగుణంగా తయారుచేస్తూ ఉంది. ఐతే మన రాష్ట్రానికి మన కేంద్ర ప్రభుత్వానికి ఆదాయం అభివృద్ధి చెందాలంటే, విశాఖపట్టణంలోని బీచ్ ప్రాంతాన్ని, విజయవాడలోని గాంధీ పర్వతాన్ని, కాకినాడ, మచిలీపట్టణం, మొదలైన రేవు పట్టణాలను, భీముని పట్టణం తీరప్రాంతం, కొండపల్లి, భద్రాచలం అమరావతి, ధరణికోట, మంగళగిరి మున్నగు ప్రాంతాలను, త్వరితంగా అభివృద్ధిచేయడం అత్యంత సముచితం. ఆయా కేంద్రాలకు కావలసిన రవాణా సదుపాయాలు, టూరిస్టు హోటళ్లు, గైడ్లు, ప్రచార కేంద్రాలు, విస్తృతంగా ఏర్పాటుచేసి, విద్యార్థులకు, విదేశ యాత్రికులకు, ఆకర్షణీయంగా ఉన్ననాడు, ఆ కేంద్రాలు మన ప్రభుత్వానికి, ఆదాయాన్ని అభివృద్ధి పరుస్తాయనడంలో అతిశయోక్తి అణుమాత్రం లేదు.

# నిరుద్యోగులకు ఉపాధి సంపాదన: కొత్త అవకాశాలు

— రాజా

హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాల్లో నిరుద్యోగాన్ని నిర్మూలించేందుకై 1969లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 10 లక్షల రూపాయల్ని కేటాయించింది. శాఖాపరంగా ఒక సంఘాన్ని కూడా ఏర్పాటు చేసింది. నిరుద్యోగ నిర్మూలన సహాయక పథకాలక్రింద ప్రస్తుతం వున్న లఘుపరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు, ప్రయివేటు సంస్థలకు, వ్యక్తులకు ఋణాలు, గ్రాంటుల రూపంలో ఆర్థిక సహాయం కూడా కల్పించబడుతున్నది, ఈ పథకం 1964 జూలై వరకు అమలుపరచబడింది. ఆకాలంలో ఋణాల రూపంలో రు. 9,92,500లు, గ్రాంట్ల రూపంలో రు. 6,49,720లు పంపిణీ చేయబడ్డాయి. 1964లో యీ పథకం ఫలితాలను పరిశీలించినప్పుడు అంత సంతృప్తికరంగా కనిపించలేదు అందువల్ల దీనిని పునర్వ్యవస్థీకరించి ఉపాధి కల్పనా పథకాలకు సంబంధించి ఒక కేంద్రీయ పరిశీలక సంఘాన్ని ప్రభుత్వం పథకాలను రూపొందించడం జరిగింది పరిశ్రమల మంత్రి అధ్యక్ష ఏర్పాటు చేసింది. దానితర్వాత, ఈ పథకాలను నేరుగా రూపొందించి, అమలు పరచేందుకై యీ సంఘం కార్యనిర్వాహకవర్గాన్ని కూడా ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఉపాధికల్పనా పథకాల క్రింద ప్రతి ఒక్కొక్క పథకానికి 2 లక్షల రూపాయల మేరకు ఆర్థిక సహాయాన్ని పొందేందుకు యీ కార్యనిర్వాహక వర్గానికి ప్రభుత్వం అధికారాలు యిచ్చింది. తదనుగుణంగా యీ కార్యనిర్వాహక వర్గం జంట నగరాల్లో 35 కేంద్రాలను నెలకొల్పి ఉత్పత్తి–శిక్షణ పథకాలను కొన్నిటిని చేపట్టింది. ఇందువల్ల 1200 మంది కార్మికులకు 160 మంది వ్యక్తులకు ఉపాధిసౌకర్యం, 600 మందికి శిక్షణ సౌకర్యం లభించింది

## ఉత్పత్తి పథకాలు :

ఈ కేంద్రాలలో (1) కవర్లు, కాగితం సంచులు (2) ఫైలు పాడ్‌లు, ఎక్సర్‌సైజు నోటు పుస్తకాలు (3) కరొగేటెడ్ అట్ట పెట్టెలు (4) ఫైలుటాగ్‌లు (5) సుద్దకణికెలు (6) మేజోళ్ళు (7) అగరువత్తులకుపయోగించే వెదురు ఈనెలు (8) బాండేజి, గాజుగుడ్డలు (9) డాంగ్రికుట్టు (10) అగరువత్తులు–వీటిని తయారు చేయడానికి సంబంధించిన పథకాలు చేపట్టబడుతున్నాయి.

### పేపర్లు, కాగితం సంచుల తయారీ పథకం:

పోస్టు మాస్టర్ జనరల్, దక్షిణమధ్యరైల్వే పంచాయతీ రాజ్, స్టేషనరీ మొదలైన శాఖలకు కావలసిన కవర్లు ఈ పథకం క్రింద తయారు చేయబడుతున్నాయి. 450 మంది పనిచేస్తున్నారు. రోజుకు 4 లక్షల కవర్లు తయారు చేస్తున్నారు. మామూలు సైజు కవర్లు వెయ్యింటిని తయారు చేసినందుకు రుపాయిన్నర చొప్పున పనివారికి యిస్తున్నారు.

### ఫైలుపాడ్‌లు, ఎక్సర్‌సైజు నోటు పుస్తకాల తయారీ పథకం:

ఈ పథకం క్రింద, స్టేషనరీ శాఖకు, పోస్టు మాస్టర్ జనరల్ ఆఫీసు, పురపాలక సంఘం, రాష్ట్రరోడ్డు రవాణా సంస్థ మొదలైన వాటికి కావలసిన పాడ్‌లు యిక్కడ తయారు చేయబడుతున్నాయి. దీనిలో 120 మంది పనిచేస్తున్నారు.

### కరొగేటెడ్ కార్డు బోర్డు పెట్టెల తయారీ పథకం:

ఇండియన్ డెటొనేటర్స్, బోంబేహాల్వా, యుటిలిటీ వెదర్ గూడ్స్. మందుల తయారీ కంపెనీలు ప్రివెంటివ్ మెడిసిన్ డైరెక్టరేట్ మొదలైన వారికి కావలసిన వివిధ రకాల పెట్టెలను యిక్కడ తయారు చేస్తున్నారు. ఈపథకంక్రింద 80 మంది పనిచేస్తున్నారు.

### ఫైల్ టాగ్‌ల తయారీ పథకం:

దక్షిణ మధ్య రైల్వే. స్టేషనరీ శాఖలకు కావలసిన ఫైల్ టాగ్‌లు తయారు చేస్తున్నారు దీని క్రింద 45 మంది పనిచేస్తున్నారు. వెయ్యి టాగ్‌లకు రూ 1–40 ల చొప్పున పనివారికి చెల్లింపబడుతున్నది.

### సుద్ద కణికెల తయారీ పథకం:

వివిధ పాఠశాలలకు కావలసిన సుద్దకణికెలు యిక్కడ తయారుచేయబడుతున్నాయి. 40 మంది దీనిలో పనిచేస్తున్నారు. 9 గ్రోసుల కణికెలకు రూ. 1–25 చొప్పున చెల్లిస్తున్నారు.

### సాక్స్, హోస్టాప్‌ల తయారీ పథకం:

పోలీసు, పౌరరక్షణ, ఫైర్ సర్వీసు శాఖలకు కావలసిన సాక్స్ తయారు చేస్తున్నారు. దీని క్రింద 75 మంది పనిచేస్తున్నారు. ఒక జత సాక్స్‌కు 25 పైసలు చొప్పున చెల్లిస్తున్నారు.

### వెదురు ఈనెల తయారీ పథకం:

అగరుబత్తులు తయారు చేసేవారికి కావలసిన వెదురు ఈనెల్ని వీరు సరఫరాచేస్తారు. 35 మంది దీని క్రింద పనిచేస్తున్నారు.

### బాండేజి, గాజు గుడ్డ తయారీ పథకం:

ప్రభుత్వ ఆసుపత్రులకు కావలసిన బాండేజి గుడ్డ గాజు గుడ్డ యిక్కడ తయారు చేస్తున్నారు. వందమంది పనిచేస్తున్నారు, మరి కొంతమంది శిక్షణ పొందుతున్నారు.

(తరువాయి 53వ పేజీలో)



1. ట్యాగ్ క్లిప్ ఫిక్సింగ్ యూనిట్‌లో పనివారు (పాతనగరంలో)
2. జిగ్ జాగ్ స్టిచింగ్ శిక్షణ కేంద్రం (మలక్‌పేటలో) శిక్షణ పొందుతున్న కార్మికుడు
3. పేపరు కవర్ల ఉత్పత్తి కేంద్రం (ఎ. సి. గార్డ్స్)
4. క్రేయాన్ ఉత్పత్తి కేంద్రంలో పనివారు (పాతనగరంలో)
5. ప్రింటింగ్ టెక్నాలజీ శిక్షణ కేంద్రంలో శిక్షణ పొందుతున్నవారు (ఐ. జి. పి. ఆఫీసు ఆవరణలో)
6. ఫైలు ప్యాడ్ల ఉత్పత్తి కేంద్రం (గుల్‌బాగ్)



జంట న

నిరుదో







# మహాభారతము

తెన్నుగంటుల లక్ష్మణశాస్త్రి

## 49

"అప్పుడు నివాతకవచులు ఆకాశమునందే మాయాచ్ఛాదితులై యుండి నాపై పాషాణవర్షము గురిపించుచుండిరి. కొందరు నేలలో దూరియుండి నా రథాశ్వముల కాళ్ళను, రథ చక్రములను కదలకుండ బిగబట్టుకొని నన్ను రాళ్ళతో కొట్టుచుండిరి. ఇట్లు పైన క్రింద నన్ను రాక్షసులు పీడించుచుండగా ఎటుగూడ పోవజాలక నేను ఒక గుహలో చిక్కుకొనిపోయినట్లుంటిని. ఇట్లు నేను బాధపడుచుండుటనుచూచి మాతలి 'అర్జునా! భయపడకుము, ఇప్పుడు వజ్రాస్త్రమును ప్రయోగించుము' అని చెప్పెను. అప్పుడు నేను ఇంద్రునకు ప్రియమైన భయంకర వజ్రాస్త్రమును ప్రయోగించి, వజ్రాయుధ సమానములైన బాణములను గూడ విడిచిన వెంటనే రాక్షసుల మాయలు మాయమై, ఆ రాక్షసులు భూమిపైన బడిరి. నా హయములకుగాని సారథికిగాని కించిత్తుగూడ బాధ కలుగలేదు. రాక్షసులందరు చచ్చిరి.

"భార్యలు విధవలై శరత్కాలమునందు సారస పక్షులవలె దిక్కులేక ఆక్రందనము చేసిరి. అప్పుడు నేను ఆ నగరములో ప్రవేశించితిని. నా రథమును, దానికి గట్టబడిన పదివేల అశ్వములను జూచి రాక్షసస్త్రీలు బెదరి గుంపులు గుంపులుగా పరుగెత్తిపోయిరి. ఆ నగరము దేవనగరముకంటె శ్రేష్ఠముగానుండుటను జూచి నేను మాతలిని "దేవతలిట్టి యుత్తమనగరమునేల నిర్మించుకొనజాలకపోయిరి?" అని యడిగితిని. దానికి మాతలి యిట్లనెను:—

"అర్జునా! పూర్వము ఈ పట్టణములోనే దేవతలుండిరి. నివాతకవచాదులు దేవతలను, ఇంద్రుని ఇచటి నుండి పారదోలి దీనిని ఆక్రమించుకొనిరి. పిదప రాక్షసులు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి తమకీ నగరమే నివాస యోగ్యముగా చేయుమనియు దేవతలెవరుగూడ తమను నిర్జించజాలకుండునట్లు చేయుమనియు వరము కోరిరి. అప్పుడింద్రుడు బ్రహ్మను 'భగవన్, మా హితము కొరకు నీవే యీ దానవులను హతమార్చుము' అని వేడుకొనెను. అప్పుడు బ్రహ్మదేవుడు 'ఇంద్రా! నీవే వేరురూపముతో వీరిని చంపవలెనని దైవనిర్ణయము' అని చెప్పెను. అందుచేత 'అర్జునా! ఇంద్రుడు తన అస్త్రములను నీకు ఈ దానవులను చంపుటకుగాను ఇచ్చెను. దేవతలు వీరిని చంపజాలరు. కాలపరిణామవశాత్తు నీవిపుడు వీరిని నశింపజేయగలిగితివి. ఈ దానవుల వినాశము కొరకే యింద్రుడు నీకు దివ్యాస్త్రములను ప్రసాదించెను' అని చెప్పెను. "ఆ మాటలు విని నేను మాతలితో తిరిగి దేవలోకమునకు పోయితిని"

"మార్గమధ్యమునందు ఒక అద్భుతమైన పట్టణమును చూచితిని. అది మనోహర వస్తుజాలముతో కూడినదై యుండెను. ఆ నగరమునుగూర్చి నేను మాతలినడిగితిని. మాతలి యిట్లు చెప్పెను:— ''రాక్షస కన్యకలగు 'పులోమ—కాలక'యను నిరువురు ఒక వేయి దివ్యవర్షములు గొప్ప తపస్సు చేసిరి. తపస్సుయొక్క అంతమునందు బ్రహ్మదేవుడు ప్రత్యక్షముకాగా నాయిరువురు తమ పుత్రుల దుఃఖము దూరమగునట్లును, వారికి ఏ జంతువుచేత కూడ అవధ్యత్వము కలుగునట్లును, అత్యంత రమణీయమగు పట్టణము వారికి ఉండునట్లును కోరిరి. అది ఆకాశమునందే విమానమువలె సంచరించునదిగా ఉండవలెననియు, మూడులోకములలో నెవరుగూడ ఆ నగరము వశపరచుకొనజాలకూడదనియు, అందలి ప్రజల కోర్కెలన్నియు నెరవేరుచు వారు శోక రోగరహితులై యుండవలెననియు వరములను కోరిరి. బ్రహ్మదేవుడు వారికి అట్టి వరములనిచ్చెను. ఈ పురము ఆకాశమునందు సంచరించుచుండును. దీనికి 'హిరణ్యపురము' అని పేరు. దీనిని కాలకేయులు—పౌలోములు రక్షించుచుందురు. వీరికి మనుష్యులచేత మరణము కలుగునట్లు బ్రహ్మదేవుడు నిర్ణయించెను. కనుక అర్జునా! నీవు ఈ రాక్షసులను గూడ వజ్రాస్త్రములతో సంహరించుము' అని చెప్పెను.

"మాతలి మాటలు నేను అంగీకరించిన వెంటనే యతడు రథమును ఆ పురములోనికి తోలుకొని పోయెను. అందలి రాక్షసులు నన్నుచూచి వివిధాయుధధారులై నాపైబడిరి. వారితో ఘోరముగ పోరాడుచు నేను వారి యాయుధముల నన్నింటిని ఖండించితిని. అంతట వారు తమ నగరముతోపాటు ఆకాశమున కెగిరి నాపై బాణములు ప్రయోగించిరి. వారి ఆకాశమార్గమును నేను బాణపంక్తితో అరికట్టితిని. కామగమనముగల ఆ పట్టణము ఒక

సారి భూమిలోపలికి దూరును. మరియొకసారి పైకి ఎగురును. వేరొకసారి అడ్డముగా పోవును. ఒకప్పుడు నీటిలో మునుగును. నేను దానిని అనేక బాణములచేత అన్నిచోట్లలోను నిరోధించితిని. దివ్యాస్త్రములచేత ఆ నగరమును, రాక్షసులను నాశమొనరింప జొచ్చితిని. చివరకు అది నేలగూలెను.

## దివ్యపురుషుడు

"అప్పుడా రాక్షసులందరు అనేకాస్త్రములతో నన్ను చుట్టుముట్టిరి. నేను వారి యాయుధములన్నింటిని చూర్ణముచేయుచున్నప్పటికిని వారు లొంగక తీవ్రముగా నాపైబడుచుండిరి. అదిచూచి నేను 'వీరు మనుష్య యుద్ధమునకు లొంగరు' అనుకొని దివ్యములైన అస్త్రములను వారిపై ప్రయోగించితిని. కాని వారు వాటిని గూడ తమ ఆయుధములతో తిరుగగొట్టుచుండిరి. వారి రథములు విచిత్రగమనములతో తిరుగుచు వారు చిత్ర విచిత్రముగా యుద్ధము చేయుచు నన్ను వివిధములుగ పీడించుచుండిరి. నేను వారిని ఏమియు చేయజాలకుంటిని. వారి ధాటికి మిక్కిలి భయపడితిని. అప్పుడు నేను పరమేశ్వరునకు భక్తితో ప్రణమిల్లి ఆ దేవుడు నాకు అనుగ్రహించిన పాశుపతాస్త్రమును ఆ రాక్షసులపై ప్రయోగించితిని. వెంటనే నాకొక దివ్యపురుషుడు కనపడెను. ఆయనకు మూడు శిరస్సులు, మూడు ముఖములు, తొమ్మిది కన్నులు, ఆరు భుజములు ఉండెను.

"ఆయన తల వెంట్రుకలు సూర్యునివలె ప్రకాశించుచుండెను. పొడవైన సర్పములు ఆ దివ్య పురుషునకు వస్త్రములుగా చుట్టుకొని యుండెను. అతని యజ్ఞోపవీతముగూడ సర్పమే. ఆ మహాదేవుని దర్శనము అయినతోడనే నా భయము సన్నగిల్లుచు వచ్చెను. అప్పుడు నేను అతి భయంకరమైన పాశుపతాస్త్రమును గాండీవమునందు సంధించి మహాదేవునకు నమస్కరించి ఆ రాక్షసులపై ప్రయోగించితిని. వెంటనే ఆ యస్త్రమునుండి సహస్రాధిక రూపములు ప్రకటములయ్యెను. వివిధ మృగ పక్షి పశుసంతతులు, దేవ-ఋషిగణములు అనేకములు ఆ యస్త్రము నుండి బయలు వెడలెను. ఎందరో త్రినేత్రులు పుట్టిరి. అందరు రాక్షసులను చుట్టుముట్టిరి. నేను అప్పుడు ధైర్యముతో ననేక బాణములను ప్రయోగించితిని. దానితో రాక్షసులు చచ్చుచు వచ్చిరి. అప్పుడు నేను పరమేశ్వరునకు భక్తితో ప్రణమిల్లితిని. రాక్షసనాశమును జూచి మాతలి సంతోషాశ్చర్యముగలవాడై దేవతలకు గూడ అసాధ్యమైన యుద్ధమును చేసిన నన్ను మిక్కిలి స్తుతించెను. "అర్జునా నీ యుద్ధము దేవదానవులకు కూడ అసాధ్యము. వారెవ్వరు జయించని ఖగము అను ఈ పట్టణము నీవు నీబల సంపదతో మథించితివి అని చెప్పెను."

"ఆ పట్టణము ధ్వంసమై దానవులు హతులైన పిదప వారి భార్యలు ఏడ్చుచు ఆనగరమునుండి వెడలిపోయిరి. వారు వెంట్రుకలు విరియబోసికొని పక్షులవలె నేడ్చుచు తమ కొడుకులు సోదరులు, తండ్రులు, పతులు చనిపోవుటను జూచి దుఃఖముతో నేలపై పడిపోయిరి. అతి శోభాయమానముగా నుండిన ఆ పట్టణము కాంతి దరిగి నిర్జీవముగా సర్పములు చచ్చిన కొలనువలెను, ఎండిన వృక్షములుగల అడవివలెను దర్శనీయముగాక యుండెను. కాని నా మనస్సులో అనన్య సాధ్యమైన కార్యమును సాధించినందుకు మిక్కిలి యుత్సాహము కలిగెను అచటి కార్యము పూర్తియగుట చేత మాతలి నన్ను ఇంద్రభవనమునకు తోడుకొని పోయెను. అట్లు నేను నివాతకవచాది రాక్షసులను చంపి హిరణ్యపురమును విడిచి ఇంద్రుని కడకు వచ్చిన తోడనే నేను చేసిన గొప్ప శూరకృత్యమును మాతలి ఇంద్రునకు విస్తరించి చెప్పెను. అది విని ఇంద్రుడు నా యెడల మిక్కిలి ప్రీతి గలవాడై నన్ను సాధువాదములతో పొగడియాదరించెను. "అర్జునా నీ వెల్లప్పటికి ఈలాగే యుద్ధమున స్థిరముగానుండి నీకు నేను ఇచ్చిన మహాస్త్రముల శక్తిని ప్రయోగించుచు బాహుబలముచేత శత్రువులను సంహరించుచుండుము ఇట్లు నీవు గెలువబోవు భూమిని ధర్మాత్ముడైన యుధిష్ఠిరుడు పరిపాలించగలడు" అని ఇంద్రుడు చెప్పెను.

అర్జునుడు తర్వాతి వృత్తాంతమును ఇట్లు చెప్పదొడగెను...

"యుధిష్ఠిర మహారాజా! ఇంద్రునకు నేను అత్యంతవిశ్వాసపాత్రుడను అయితిని. నాశరీరము గాయపడియుండెను. అట్టి నా చేయి పట్టికొని యింద్రుడు 'అర్జునా! నీకు ఇప్పుడు సమస్త దివ్యాస్త్రములు సంపన్నములై యున్నవి. భూలోకములో, మనుష్యుడెవ్వడు గూడ నిన్ను ఓడించ జాలడు. నీవు యుద్ధరంగమునందు నిలిచి యుండగా భీష్మ ద్రోణాదులైన మహారథికులు నీ శక్తిలో పదియారవ అంశమును గూడ పొందజాలరు.' అనిచెప్పి ఇప్పుడునేను తొడిగిన కవచమును నాశరీర రక్షణార్థమై అతడు నాకుప్రసాదించి ఈసువర్ణమయమైన మాలికను గూడ నాకంఠమునందలంకరించెను. దేవతలునాకు లోగడఇచ్చిన దేవదత్తశంఖమును తిరిగి అతడు స్వయముగా నాకుఇచ్చి ఈ దివ్యమైన కిరీటము స్వయముగా తాను నాతలపై నుంచెను.

"ఇట్లు ఇంద్రునిచే పూజితుడనై గంధర్వులతో హాయిగా అక్కడ నివసించియుంటిని. అప్పుడు ఇంద్రుడు నాతో "అర్జునా! ఇప్పుడు నీవు నీసోదరులకడకు పోవలసినసమయము ఆసన్నమైనది. వారు నీకై ఎదురుచూచుచున్నారు" అనిచెప్పి నాకుసెలవిచ్చెను

"ఇట్లు నేను ఇంద్రభవనమునందు అయిదు సంవత్సరములు, జూదము వలన ఏర్పడిన మనకలహమును స్మరించుకొనుచు. నివసించితిని. ఇప్పుడు సోదరులతో గంధమాదన పర్వత శిఖరమునందు నివసించుచున్న నిన్నుచూచు భాగ్యము నాకుగలిగెను" అని అర్జునుడు తనదేవలోకయాత్రా వృత్తాంతము నంతయు విస్తరించి సోదరులకు చెప్పెను. అదివిని సంతోషించి యుధిష్ఠిరుడు ఇట్లనెను.

"అర్జునా! భాగ్యవశము చేత నీవు దివ్యాస్త్రములను సంపాదించితివి. దేవరాజు నారాధించితివి. సాక్షాత్ పార్వతీ పరమేశ్వరులను దర్శింపగలిగితివి. పరమేశ్వరునితో యుద్ధముచేసి అతనిని సంతోషపరచగల్గితివి. దిక్పాలకులతో కలిసి ఉండు సదవకాశము నీకు ఏర్పడెను. ఇప్పుడు నీవు మా భాగ్యవశమున తిరిగివచ్చి, మాకు కన్నుల పండువు జేసితివి. ఇప్పుడు గిరి నగర శోభితమైన సమస్త భూమండలమును జయించినవానినిగాను, దుర్యోధనాదులను లోబరచుకొన్నవానివి

గాను నన్ను తలంచుకొనుచున్నాను. నీవు సంపాదించిన దివ్యాస్త్రములను చూచుటకు కుతూహలపడుచున్నాను" ఆ మాటకు అర్జునుడు "నివాతకవచాది దుష్టదానవులను సంహరించిన ఆ దివ్యాస్త్రములను రేపు ఉదయము మీకు చూపించెదను" అని చెప్పి సోదరులతో ఆ రాత్రి సుఖముగా గడపెను.

## దివ్యాస్త్ర ప్రదర్శనము

మరునాడు ఉదయము కాలకృత్యములను దీర్చుకొని ధర్మరాజు "దివ్యాస్త్రములను చూపుము" అని అర్జునుని ఆదేశించెను. అర్జునుడు సన్నద్ధుడై గాండీవముద్వారా తన అస్త్రములను వరుసగా చూపించుటకు ప్రారంభించెను. అప్పుడు పృథివియే అతనికి రథముగా నుండెను. అతని పాదముల యొత్తిడిచేత భూమి కంపించెను. నదులు సముద్రములు క్షోభిల్లెను. పర్వతములు భగ్నములయ్యెను. వాయువు వీచకుండెను. సూర్యుడు ప్రకాశించ లేదు. అగ్ని జ్వలించలేదు. బ్రాహ్మణులు వేదములను మరచిరి. ఆ యస్త్రములచేత దహింపబడుచున్న ప్రాణులన్నియు అర్జునుని వేడికొనుచు నతనిని ఆశ్రయించెను మునులు, దేవతలు, యక్షరాక్షసగంధర్వులు, అతనికడకువచ్చి ఆశ్రయించినిల్చిరి. అక్కడికే బ్రహ్మదేవుడు, దిక్పాలకులు, భగవంతుడైన శంకరుడును తన గణములతో వచ్చి నిల్చిరి. దివ్య సుగంధ మాల్యములచేత వాయు దేవుడు వచ్చి నిల్చెను. గంధర్వులు అర్జునుని యశస్సును గానము చేసిరి. అప్సరసలు నాట్యము చేసిరి. అట్టి సమయమందు దేవతలందరు ప్రార్థింపగా నారదుడచ్చటకువచ్చి అర్జునునితో "అర్జునా! ఈ దివ్యాస్త్రములను, లక్ష్యభూతమైన వస్తువు లేకుండ ప్రయోగించరాదు. కనుక నీవు వీటిని స్వయముగా సంకటములో పడినప్పుడే ప్రయోగించవలెను. అనుచితముగా వీటిని ప్రయోగించుటవలన మహా దోషము సంప్రాప్తించును. శాస్త్రములో చెప్పబడినట్లుగా ఈ అస్త్రములను సురక్షితముగానుంచినప్పుడే ఇవి శక్తివంతములుగానుండి సుఖమును కల్గించును. పాండునందనా! వీటికి సముచితమైన రక్షణము చేయనిచో ఇవి మూడులోకములను నశింప జేయునవి ఆగును. కనుక ఎప్పుడు గూడ నీవు వీటిని ప్రదర్శించుటకు పూనుకొనవద్దు'' అని అర్జునుని నివారించి నారదుడు, దేవతలు వెడలిపోయిరి.

"జనమేజయా! ఈ విధముగా దివ్యాస్త్ర ప్రదర్శనము నుండి అర్జునుని దేవతలు నివారించి వెడలిపోయినతరువాత పాండవులు ద్రౌపదీ సహితులై సంతోషపూర్వకముగా ఆ వనము నందే నివసించుచుండిరి." అని వైశంపాయన మహాముని జనమేజయునకు చెప్పెను.

జనమేజయుడు తిరిగి యిట్లు ప్రశ్నించెను: "మహాత్మా! అర్జునుడు ఇంద్రలోకమునుండి వచ్చిన తరువాత పాండవులేమి చేసిరి?" దానికి వైశంపాయన మహాముని యిట్లు చెప్పదొడగెను: "పాండవులు కుబేరుని నివాసమునందలి వనమునందే కొంతకాలము నివసించిరి. అక్కడి విచిత్ర సన్నివేశములను తిలకించుచు నర్జునుడు దివ్యాస్త్రముల యభ్యాసము చేయుచుండెను. అక్కడ ననుభవించునానందముచేత వారు భూలోకానందములను విస్మరించి యుండిరి. ఇట్లు నాలుగేండ్లు ఆనందముతో నొకరాత్రి గడపినట్లు గడపిరి. పూర్వము వారు అనుభవించిన ఆరేండ్లు ఈ నాలుగేండ్లు కలసి పది యేండ్ల వనవాసమును వారప్పటికి ముగించిరి.

"ఒకనాడు నలుగురు తమ్ములు ధర్మరాజును పరివేష్టించి యుండగా భీముడిట్లనెను: "రాజా! నీ ప్రతిజ్ఞను పూర్తి చేయుటకును, నీకు ప్రియము చేకూర్చుటకును మేము ఈ వనవాసమును అనుభవించుచు దుర్యోధనాదులను వధించుటకు పోవకున్నాము. ఇప్పుడు మన వనవాసములో పదకొండవ సంవత్సరము గడుచుచున్నది. మనము సుఖానుభవమునకు అర్హులమైయుంటిమి. కాని మన సుఖమును దుర్యోధనుడు లాగికొనినాడు. ఆ దుష్టుని మోసగించి మనము పదమూడవయేడు అజ్ఞాతవాసమునుగూడ సుఖముగా గడపగలము. ఆ తరువాత శత్రువులను సులభముగా నిర్జించగలము. సమస్త భూమండలమును నీవు ఏలగలవు. కనుక మనమిప్పుడు ఈ కుబేర లోకమునుండి భూలోకమునకు పోయి తరువాతి కార్యక్రమమును యోచించవలెను. ఇక్కడ సర్వదా ఉండినచో శాశ్వతానంద సుఖములు కలుగునుగాని రాజా! చరాచర జగత్తులో వ్యాపించిన నీ పవిత్ర కీర్తి నశించిపోవును కనుక మన పూర్వుల రాజ్యమును తిరిగి మనము సంపాదించుకొని, తరువాతనే యితర సత్కర్మలు చేయుటకు అర్హులమగుదుము రాజా! నీకు ఇప్పుడు కుబేరుడుచేయు సత్కారములను ఎల్లప్పటికిని, ఎక్కడనున్నను నీవు పొందగలవు. కాని యిప్పుడు నీ కర్తవ్యము శత్రువులను దండించి నశింపజేయుటయే. నీవు తలచినచో నీకు శత్రు సంహారము అసాధ్యము కాదు. కృష్ణ సాత్యకులు, మేము నలుగురము నీకు దాసటగా నుండినచో నీవు త్రిలోకములను జయించగలవు. మేమందరము సర్వదా నీ మేలునే కోరుచుందుము." అని చెప్పెను.

భీమసేనుని యభిప్రాయములో నితరసోదరులు గూడ నేకీభవించిరి.

అప్పుడు ధర్మరాజు వారి యభిప్రాయము ప్రకారమే చేయ దలచి కుబేరుని గంధమాదన పర్వతమునకు ప్రదక్షిణము చేసెను. అక్కడి వారి నుండి అనుజ్ఞ తీసికొనెను. "పర్వతరాజా! నా ప్రజ్ఞ నెరవేర్చుకొని శత్రు సంహారముచేసి తిరిగి నీ దర్శనము చేసెదను" అని గంధమాదనము నుండి పోవుటకు బయలు దేరెను. ఆ మార్గము చాల దుర్గమముగా నుండుట బట్టి మరల ఘటోత్కచుడు వచ్చి వారందరను ఆ మార్గమును సులభముగా దాటించెను. పాండవుల యెడల ప్రీతిగల వాడైనలోమశ మహాముని వారిని ఆశీర్వదించి వీడ్కొని తిరిగి స్వర్గమునకు పోయెను. ఆలాగే ఆర్ష్టిషేణుడు గూడ వారికి సదుపదేశములు చేసి ఆశీర్వాద పూర్వకముగా వారిని వీడ్కొనెను. పిదప పాండవులు అనేక పవిత్ర నదనదీ తీర్థములను, వనములను దర్శించుచు ముందుకు నడచుచుండిరి. దారిలో కైలాసమును దర్శించి యానందించిరి. ఆ తరువాత వృషపర్వ మహారాజును చూచి యతనికడ నొక రాత్రి నివసించి గంధమాదన పర్వత విశేషములన్ని యతనికి తెలిపిరి. అచట కుబేరుని పుష్కరిణిని చూచి యానందించిరి. అచటి నుండి బదరికాశ్రమము పోయి యచట నొక మాసముండిరి. తరువాత హిమవత్ప్రదేశమును దాటి కిరాత రాజైన సుబాహు దేశమునకు

పోయిరి. అచట ఆ రాజుచే నాదరింపబడి ఒక నాడు నివసించి ఘటోత్కచుని పంపించిరి. అచటి నుండి యమునోత్రి గిరిని (యమున పుట్టిన పర్వతము) చేరి యచట సంవత్సరం కాలము నివసించి మృగయా సక్తులై యుండిరి. అచట నొక పర్వత గుహ నుండి పెద్ద అజగము (కొండ చిలువ) వెడలి వచ్చి మృత్యువు వలె భీమసేనుని శరీరమంతయు చుట్టుకొనెను. అప్పుడు ధర్మరాజు దాని నుండి భీముని విడిపించెను. అచటి నుండి ద్వైతవనమునకు పోయిరి. అప్పటికి వారి వనవాసములో పన్నెండవ సంవత్సరము గడచుచుండెను. ద్వైతవనము నందలి సరస్వతీ నదీ తీరమున వారు నివాసమేర్పరచుకొనిరి" అని వైశంపాయన ముని చెప్పిన వృత్తాంతమును విని జనమేజయు డిట్లు ప్రశ్నించెను.

'మహాత్మా! పదివేల యేనుగుల బలము గల భీమసేనుని అజగర మెట్లు చుట్టుకొనెను? దానివలన అతడేల భయము చెందెను? ఆ విషయము వినుటకు నాకు కౌతూహలము కలదు" ఆ మాటకు వైశంపాయను డిట్లు చెప్పెను.

"రాజా! ద్వైతవనము నందలి వృషపర్వ మహారాజు యొక్క ఆశ్రమము నందు పాండవులు నివసించుచుండిరి. అచటి రమ్యమైన వనమునందు భీమసేను డొకనాడు ధనుష్పాణియై వేటకు వెడలెను. అనేక మృగములను వేటాడుచు వన్య పశువులను భయపరచుచు పోయెను. ఒకచో పెద్ద శరీరము గల ఒక అజగరమును చూచెను. అచటి గుహను తన శరీరముచేత కప్పి గిరి దుర్గమునందు అది శయనించియుండెను. భీముని చూచి అది హఠాత్తుగా వచ్చి యతని భుజములను చుట్టి బంధించెను. దానికిగల వరప్రభావము చేత అది తాకగానే భీముడు స్మృతి దప్పి పోయెను. అంతటితో నతడు కదలుటకు చేతకాని వాడయ్యెను. అతని బలము తగ్గుచు పోయెను. దానినుండి విడిపించుకొనుటకు పలు విధముల ప్రయత్నించియు విఫలుడయ్యెను. అప్పుడు భీమసేనుడు అజగరముతో నిట్లనెను :—

"సర్ప రాజా! నీవెవడవు. ఇంతగొప్ప బలముగల నన్ను బంధించ గల సామర్థ్యము నీకెట్లు వచ్చెను. ప్రపంచము నందలి సర్వ ప్రాణులు నా బలమునకు లొంగి పోయినవి. పదివేల యేనుగుల బలము గల వాడను నేను. అట్టినన్ను బంధింప గల శక్తి నీకు ఏ వరప్రభావము చేత గలిగెను? లేక నీవు అజగరరూపములో నున్న దేవతవా? తెలుపు మనెను. "అజగర మిట్లనెను.

## అజగర వృత్తాంతము

"మహా బలశాలీ! నేడు దైవము నిన్ను నాకు ఆహారముగా పంపెను. నాకు ఈ సర్పరూపము వచ్చుటకు కారణము వినుము. నీవు 'నహుషుడు' అను రాజర్షి పేరు వినియుందువు. నేను ఆ నహుషుడను. నేను నీవంశములో ప్రాచీనుడైన 'ఆయువు' అను రాజు పుత్రుడను. నేను బ్రాహ్మణులను అనాదరము చేసి అగస్త్య మహాముని శాపము చేత ఈ యవస్థను పొందితిని. నీవు నా వంశము నందు పుట్టిన వాడైనను నిన్ను విడువను. ప్రతి దినము ఒక మహా సత్వము నాకు ఆహారముగా లభించును. ఈ నాగు నీవు దొరికితివి. నా కథ వినుము. అగస్త్యముని నాకు శాపమిచ్చి క్రిందికి త్రోసెను. అప్పుడు శాపాంతమును వేడితిని "భూలోకమునందు నీవడుగు ప్రశ్నల కన్నింటికి సమాధానము చెప్పిన వానినుండి నీ శాప విముక్తి కలుగును' అని ఆ ముని నాకు చెప్పెను. ఈ రూపములో ఎన్నినాళ్ళుగా ఉన్నప్పటికిని నాకు పూర్వ స్మృతి బాగుగా నున్నది. ఎంతటి బలశాలియైనను నేను పట్టుకొనగనే అని బలమంతయు క్షీణించునని కూడ ఆ మహాముని నాకు చెప్పియుండెను. గనుక నీ బల మెంత మాత్రము నా యెదట పనికిరాదు. నా దుష్కృత్యము వలన ఇట్టి పాపయోనియందు పడి నికృష్టుడనుగా నున్నాను." అది విని భీము డిట్లనెను :—

"సర్పరాజా! నేను నిన్ను కోపించుట లేదు. నన్ను నేను గర్హించుకొనెను. ఎందుకనగా, మనుష్యుడు సుఖమును దుఃఖమును అవి ప్రాప్తించినప్పుడు అనుభవించవలెయును. వానిని కోపించుటకు గాని నివారించుటకు గాని అతడు అసమర్థుడగును. అందుచే ఎట్టి దశలో గూడ మానవుడు మనస్సులో గ్లాని చెందరాదు. పురుష ప్రయత్నము చేత దైవగతిని అతిక్రమించువాడు ఎవడును లేడు. దైవమే పైచేయి యగును. పురుషార్థము నిరర్థకమగును. చూడుము. దైవోపహతుడనై నిష్కారణముగా నేను నేడు ఈ యవస్థ నందితిని. నా బాహు బలము నెడల నాకు పూర్తి విశ్వాసముండెను. అది యిప్పుడు పోయెను. నా ప్రాణాపాయమును గూర్చి నేనిపుడు శోకించుట లేదు కాని, రాజ్య భ్రష్టులై అడవులలో నిడుములు బడుచున్న నా సోదరుల దురవస్థను చూచి శోకించుచున్నాను. నేను వారికి సంరక్షకుడను. నా మృత్యువు వార్త విన్న తరువాత వారు రాజ్య కాంక్ష వీడి అడవిలోనే బాధ పడుచుండెదరు. మహా బలపరాక్రమ సంపన్నుడగు అర్జునుడు కూడ విషాదము చెందును. అప్పుడు వారి గతి చాల చెడిపోవును. మా ప్రతిజ్ఞ తీరుట యెట్లు? దుర్యోధనాదుల గర్వమును అణచు వారెవరు? మా తల్లి శోకమెట్లు శాంతించును." ఈ విధముగా భీమసేనుడు మిక్కిలి దుఃఖించెను.

అప్పుడు యుధిష్ఠిరునకు అనేక దుర్నిమిత్తములు కలిగెను. మనస్సు ఆందోళనపడెను. దక్షిణ దిక్కున నక్కలు కూసెను. సుడిగాలి ప్రచండముగా వీచెను. పాషాణ వర్షము కురిసెను. మృగ పక్షులన్నియు నపసవ్యముగా ధ్వనించుచుండెను. వెనికి భాగమునందు కాకులు కూయుచుండెను. కుడిభుజమదరుచుండెను. హృదయము ఎడమ పాదము తపించుచుండెను. ఎడమ కంటిలో వికారము కలుగుచుండెను. ఈ అనిమిత్తములన్నియు చూచి ధర్మరాజు ద్రౌపదితో 'భీమసేనుడెక్కడ?' అని యడిగెను. 'ఆయన పోయి చాలసేపైనది' అనియామె బదులు చెప్పెను. అప్పుడు ధర్మజుడు ధౌమ్యుని వెంటబెట్టుకొని భీముని వెదకుటకు పోవుచు 'ద్రౌపదిని రక్షించుచుండు'మని అర్జునునకు చెప్పి, బ్రాహ్మణ రక్షణార్థమై నకుల సహదేవులను ఆదేశించి, బయలుదేరెను. తూర్పు దిక్కుగా పోవుచు నేలపై భీముని అడుగు గురుతులు చూచెను. ఆ మార్గము గుండా పోయిపోయి ఒక గుహాద్వారము ముందర అజగరముతో చుట్టబడి పడియున్న తమ్మునిచూచెను.

## యుధిష్ఠిరాజగర సంవాదము

అట్టి దురవస్థలో చిక్కుకొనియున్న భీమసేనుని ధర్మరాజు 'నీ కిట్టిగతి యెట్లు ప్రాప్తించెను? పర్వతమువలె నున్న యీ సర్పరాజు ఎవరు? అని ప్రశ్నించెను దానికి భీముడు జరిగిన వృత్తాంతమంతయు అన్నకు తెలిపెను. అప్పుడు ధర్మరాజునకు సర్పమునకు ఇట్లు సంవాదము జరిగెను :—

ధర్మ :— సర్పరాజా! ఈ నా తమ్ముని విడువుము. నీకు మరియొక యాహారము తెచ్చి యిచ్చెదము.

సర్ప :— ఈ రాజపుత్రుడు నాకు నేడు ఆహారమయ్యెను. నీవు వెడలి పొమ్ము. రేపు నీవు గూడ నాకు ఆహారముగా వచ్చెదవు. నా ప్రదేశములోనికి వచ్చినవాడెవడైనను నాకు ఆహారముకాక తప్పదు. ఇది నా వ్రతము. నీవు గూడ నా ప్రదేశములోనికి వచ్చితివి గనుక రేపు నిన్ను తినెదను. చాల కాలమునకు ఈ నీ తమ్ముడు నాకు ఆహారముగా వచ్చెను. ఇతనిని విడువను, అన్యమును కోరను.

ధర్మ :— నీవు దేవతలో నొకడవా? సర్పములలోని వాడవే యగుదువా? సత్యము చెప్పుము. ఇతని నేల పట్టితివి? నీకు ఏమికావలయును? తెచ్చియిచ్చెదను. లేదా నీ వేమైన తెలిసికొన గోరినచో చెప్పుము నీకు బదులు చెప్పెదను. ఇతనిని విడుచుటకు ఏదైన ఉపాయ మున్నచో చెప్పుము. దాని నంతయు చేసెదను.

సర్ప :— రాజా! నేను 'నహుష'డను రాజును. నీ వంశములో పూర్వజుడను. చంద్రుని నుండి ఐదవ రాజైన 'ఆయు' మహారాజు పుత్రుడను. యజ్ఞములు, తపస్సు, వేదాధ్యయనము, ఇంద్రియ నిగ్రహము, పరాక్రమము ఈ మొదలైన వాటి బలముచేత నేను సమగ్రమైన త్రైలోక్యరాజ్యైశ్వర్యమును పొందియుంటిని. దానిచేత నాకు గర్వము కలిగెను. వేయిమంది బ్రాహ్మణులచేత నా పల్లకీని మోయించితిని. వారిని అవమానపరిచి చివరకు అగస్త్యమహాముని శాపముచేత ఈ దురవస్థకు లోనైతిని. ఆ మహాముని అనుగ్రహముచేతనే నాకు పూర్వస్మృతి తప్పలేదు. దినముయొక్క ఆరవ భాగమందు ఆ మహర్షి యాజ్ఞమేరకు నాకు లభించిన ఆహారమును తినుచుందును. నేడు నీ తమ్ముడు లభించెను. ఇతనిని విడువను. అన్యమును కాంక్షించను. కాని, నా ప్రశ్నముల కన్నటికి సరియైన ఉత్తరము నీవు చెప్పగలిగినచో నీ తమ్ముని విడిచెదను.

ధర్మ :— సర్పరాజా! ప్రశ్నముల నడుగుము. బదులు చెప్ప గలిగితినేని నీకు గూడ ప్రీతి కలిగించెదను. 'ఈ జీవితమునందు బ్రాహ్మణుడు తెలిసికొన దగిన తత్త్వము నీకు తెలియునా లేదా' అను విషయమును తెలిసికొని నేను నీకు ఉత్తరము లిచ్చెదను.

సర్ప :— రాజా! బ్రాహ్మణుడనగా నెట్టివాడు? అతడు తెలిసి కొన దగిన తత్త్వమేమి? నీ మాటలను విని 'నీవు అతి బుద్ధిశాలివి అని నాకు తోచుచున్నది.

ధర్మ :— సర్పరాజా! ఎవనియందు "సత్యము, దానము, ఓర్పు, మంచి స్వభావము, క్రూరత్వము లేకుండుట, తపస్సు, దయ" ఈ గుణములు ఉండునో అతడే 'బ్రాహ్మణు' డని చెప్పబడెను.

మరి తెలిసికొన దగిన వస్తువు ఏదనగా, 'సుఖదుఃఖ రహితమై' ఆశ్రయించిన వారి శోకములను పోగొట్టు పరబ్రహ్మమే ఈ విషయములో నీ యభిప్రాయ మేమి? తెలుపుము.

సర్ప :— నీవు చెప్పిన ఈ గుణములన్నియు శూద్రునియందుగూడ నుండును గదా! సుఖదుఃఖ రహితమైన వస్తువు పర బ్రహ్మముకన్న వేరులేదని నీవు చెప్పినమాట వాస్తవము.

ధర్మ :— సర్పరాజా! పైన నేను చెప్పిన సత్యము మొదలగు గుణములు శూద్రుని యందు ఉన్నచో నతడు బ్రాహ్మణుడే యనబడును. ఆ గుణములు లేని బ్రాహ్మణుడు శూద్రుడన బడును సుఖదుఃఖ రహిత వస్తువు పరబ్రహ్మమే యగును. దానినే తెలిసికొన వలెను. మంచులో ఉష్ణత్వము—అగ్నిలో శీతత్వము లేనట్లే ఆ పరబ్రహ్మమునందు గూడ సుఖదుఃఖములు లేవు

సర్ప :— సద్గుణ సంపత్తి చేతనే బ్రాహ్మణత్వము నిర్ణయించ వలసినప్పుడు జాతి వ్యర్థమేయగును. కర్మానుసరణము లేని జాతి నిరుపయుక్తమేకదా!

ధర్మ :— సర్పరాజా! మనుష్యులలో జాతిని నిర్ణయించుట చాల కష్టము. ఎందుకనగా, ఇప్పుడు సమస్త వర్ణములకు సాంకర్యము కలుగుచున్నది. అని నా యభిప్రాయము. మానవులందరు సర్వదా స్త్రీలందరియందు సంతానోత్పత్తిని చేయుచున్నారు. 'వాక్కు (మాటలాడుట) మైథునము, జననము, మరణము' ఇవి మానవులందరికి సమానములుగానే యున్నవి.

ఈ విషయములో వేద ప్రమాణము గూడ నున్నది. 'యే యజామహే' అను వేద వాక్యము కలదు 'ఎవరము యజ్ఞము చేయుచున్నామో' అని దాని అర్థము. అనగా, ఒక వ్యక్తినిగాని, ఒక జాతినిగాని యా గార్హులనుగా నిర్ణయించక, యజ్ఞము చేయుటకు తగిన గుణములుగల వ్యక్తు లందరు యజ్ఞము చేయవచ్చునను భావమును వేదము స్పష్టముగా చెప్పినది. కనుక తత్త్వజ్ఞులందరు 'సద్గుణవంతులైనవారే ఉత్తము'లని భావించిరి. బాలకుడు పుట్టగనే అతని బొడ్డును కోయకముందు 'జాతకర్మ' అను సంస్కారము అతనికి చేయబడును. అప్పుడు అతనితల్లి సావిత్రి—అనగా గాయత్రియనియు, తండ్రి ఆచార్యుడు—అనగా గురువు అనియు చెప్ప

బడెను. కనుక బాలకునకు జాతకర్మాది సంస్కారములుచేసి వేదాధ్యయనము చేయుదాక అతడు శూద్ర సమానుడేయగును. జాతి విషయమై సందేహము వచ్చినపుడు 'స్వాయంభువ'మనువు ఈ నిర్ణయమును చేసెను. నాగరాజా! "జాతకర్మాది వైదిక సంస్కారములు జరిగి వేదాధ్యయనము చేసిన తరువాతగూడ బ్రాహ్మణునకు ఉండవలసిన శీలము, ప్రవర్తన అతనియందు లేకున్నచో అతడు సంకరుడని చెప్పవలసి వచ్చును." కనుక సర్పరాజా! జాతకర్మాది వైదిక సంస్కారములను పొంది వాటితోపాటు సత్ప్రవర్తన గూడ కలవాడే బ్రాహ్మణుడగును. ఈ విషయము నీకు మొదటనే చెప్పితిని గదా!

సర్ప : యుధిష్ఠిర మహారాజా! తెలియవలసిన విషయములన్నియు నీకు తెలియును. నీ మాటలు బాగుగా విని గ్రహించితిని. సంతోషమైనది. ఇప్పుడు నేను నీతమ్ముని నెట్లు భక్షించ గలను?

ధర్మ : నీవు వేదశాస్త్రములు సమగ్రముగా తెలిసినవాడవు. ఎట్టి కర్మలను ఆచరించుటవలన సర్వోత్తమమైనగతి లభించును? చెప్పుము.

సర్ప : రాజా! 'యోగ్యునకు దానముచేయుట, సత్యము-ప్రియము నగు మాటను మాట్లాడుట, అహింసయందు ఆసక్తి గలిగి యుండుట' ఈగుణములు గలవాడు స్వర్గము (ఉత్తమగతి) పొందగలడు.

ధర్మ : నాగరాజా! 'దానము-సత్యము' ఈ రెండింటిలో నేదిగొప్పది? అహింస ప్రియభాషణము' ఈ రెండింటిలోను నేదిగొప్పది? చెప్పుము.

సర్ప : ధర్మరాజా! దాన-సత్య-అహింసా-ప్రియవాదిత్వముల యొక్క తారతమ్యము కార్యగౌరవము ననుసరించి యుండును. ఒకప్పుడు దానముకన్న సత్యము, మరొకప్పుడు సత్యముకన్నదానము-ఒకప్పుడు అహింసకన్న ప్రియవాదిత్వము, మరియొకప్పుడు ప్రియవాదిత్వముకన్న నహింస గొప్పదగును. కనుక రాజా! వీటియొక్క గౌరవలాఘవములు వాటికి సంబంధించిన కార్య గౌరవ లాఘవముల ననుసరించి యుండును. ఇంకను ఏదైన ప్రశ్నము చేయదలచితివేని చేయుము నాకు సాధ్యమయినంత వరకు ఉత్తరము చెప్పెదను.

ధర్మ : సర్పరాజా! శరీరాభిమానములేని మనుష్యునకు కర్మల వలన నిశ్చయముగా గలుగుఫలము స్వర్గప్రాప్తి ఎట్లుసిదించును? అట్టివానిగమనమెట్లుండును?

సర్ప : ధర్మరాజా! స్వస్వకర్మానుసారముగా మానవునకు మూడు గతులుండును. ఒకటి, స్వర్గప్రాప్తి, రెండు మానవ యోనిలో పుట్టుట, మూడు పశు పక్ష్యాది తిర్యగ్యోనులలో పుట్టుట (దీనిలో నరకము గూడ చేరియుండును) ఈమూడుగతులకే, "ఊర్ధ్వగతి మధ్యగతి, అధోగతి"అని పేర్లు. ఈ మూడింటిలో ఏ జీవుడు మనుష్యయోనిలో పుట్టికూడ పొరపాట్లు, సోమరితనము విడిచి, అహింసా వ్రతమును పాలించుచు దానము మొదలగు శుభ కర్మల నాచరించునో అట్టివానికి ఆ పుణ్యకర్మలు కారణముగా స్వర్గలోకప్రాప్తి కలుగును. పై కర్మలకు వ్యతిరేకముగా కర్మాచరణ చేసినవానికి ఆయాకర్మానుసారముగా మనుష్యయోనిలోను, పశుపక్ష్యాదులయోనులలోను జన్మము కలుగును. నాయనా! తిర్యగ్యోనులలో జన్మించుటకు గూడ కారణములుగలవు. అవియేననగా ఎవడు, కామ క్రోధ-లోభ-హింసలయందు ఆసక్తుడై యుండునో వాడు మానవత్వమునుండి భ్రష్టుడై తాను తిరిగి మానవుడుగా పుట్టుయోగ్యత గూడ పోగొట్టుకొనును. అట్టివాడే పశు పక్ష్యాదులయోనులలో జన్మించును. తిరిగి ఆ జన్మలనుండి మనుష్యత్వమునకు అతడు ఉద్ధరింపబడవలసి యుండును. ఒకప్పుడు గోవులు-అశ్వములు గూడ దేవత్వమును పొందు నవకాశము గలవియై ఉండును. నాయనా! ప్రయోజనమును బట్టి జీవుడు ఈ దేవ-మనుష్య-తిర్యగ్యోనులయందే త్రోవదప్పుచు తిరుగుచుండును. కర్మఫలమును గోరు దేహాభిమానియగు జీవుడు కర్మ వశత చేత మాటిమాటికి జన్మల నెత్తుచు నా యా యోనులకు సంబంధించిన సుఖ దుఃఖములను క్రమముగా ననుభవించుచుండును. కాని నాయనా! ఎవడైతే కర్మ ఫలమునందు ఆసక్తుడు కాక, ప్రజా సేవా-ప్రజాపాలనముల యందు భావన కలవాడై యుండునో అట్టి ద్విజుడు తన ఆత్మను శాశ్వతము-మహత్తునైన పరబ్రహ్మమునందు స్థిరముగా నిలిపి కొనును.

(సశేషము)

## పురుషోత్తముడు : గాంధీజీ

యుగపురుషుండవంచు పురుషోత్తమ మూర్తి వటంచు మూర్తిమ
జ్జగదనురాగ శాంతిమయ సాత్త్విక శక్తి వటంచు వేనవేల్
మొగముల ప్రస్తుతించెను ప్రమోదముతో జగమెల్ల నిన్ను ఏ
మగుదురు నీకు తొల్లిటి మహమ్మదు, క్రీస్తును బుద్ధదేవుడున్?

-కరుణశ్రీ

## ఆంధ్రకేసరి ప్రకాశం

(7వ పేజీనుండి)

పూరు న్యాయవాదుల ప్రతిభావిశేషాలను చెప్పి జాగ్రత్తగా వ్యవహరించవలసిందిగా హెచ్చరించాడు. ఆరోజుల్లో జడ్జి భాష్యం అయ్యంగార్ అన్నా, న్యాయవాదులు కృష్ణస్వామి అయ్యర్, సుబ్రహ్మణ్య అయ్యర్ గార్లు అన్నా ప్రజలు గొప్పగా చెప్పుకునేవారు. నార్టన్, గ్రాంట్ అనే ఇంగ్లీషు బారిస్టర్లకు కూడా పేరువుండేది. ఆ నాటికి ఆంధ్ర న్యాయవాదులు జిల్లా కోర్టుల్లోనే వుండేవారు. మద్రాసులో స్థిరపడిన ఆంధ్ర న్యాయవాదులైనా పేరుపొందిన న్యాయవాదుల దగ్గర పనిచేస్తూ వారికి సహాయ పడుతూవుండేవారేగాని నేరుగా కేసులు తీసుకుని వాదించే వారుకాదు. ఈ సాంప్రదాయాన్ని ఛేదించాలంటే ఏమంత తేలిక అయిన పనికాదు మరి.

### మద్రాసులో ప్రాక్టీసు

ప్రకాశంగారు మద్రాసులో ప్రాక్టీసు ప్రారంభించారు. లండన్‌లో చదువుకు, మద్రాసులో ప్రాక్టీసు పెట్టడానికి కావలసిన లైబ్రరీని సమకూర్చుకోడానికి మొత్తం ఇరవైవేల రూపాయలు అప్పు అయ్యింది. ఆ ఇరవై వేల రూపాయల అప్పుతోనూ న్యాయవాద వృత్తిలో ప్రవేశించారు. త్వరలోనే ఆంధ్ర ప్రాంతం నుంచి వచ్చే కేసుల్లో నాలుగింట మూడొంతులు ప్రకాశంగారూ, కాకినాడ నించి వచ్చిన పేరి నారాయణమూర్తి అనే మరో న్యాయవాదీ యీ యిద్దరికే లభించేవి. బారిస్టరుగా ఆయనకు హైకోర్టు వకీళ్ళ కన్నా హెచ్చు అధికారంవుండేది. దానిని ఆయన పూర్తిగా వినియోగించుకొన్నారు. తనశక్తిమీద ఆయనకు దృఢ విశ్వాసంవుంది. అందువల్ల జడ్జీల పాపరం సంపాదించు కోడానికి ఆయన ఎప్పుడూ ప్రయత్నించేవారుకారు. చాలా శ్రమపడే మనిషి. ఆయన ధైర్యవంతుడు కూడా. మాటకుమాట బదులు చెప్పడంలో దిట్ట. క్రిమినల్ కేసుల్లో కూడా పెద్ద పెద్ద వాటిల్లో వాదించేవారు. 'ది లా టైమ్స్' పత్రికను చాలా సమర్థవంతంగానూ, ప్రతిభావంతంగానూ నడిపారు ఆయన. దానిలో నిర్భయంగా న్యాయాధిపతుల చంచలమనస్తత్వాన్ని తరచుగా విమర్శిస్తుండేవాడాయన. ఆయనకు ఒక రోజుకు ఫీజు అయిదువందల నుంచి వెయ్యి రూపాయల వరకు వుండేది. ఉదకమండలం, మద్రాసు, ఒంగోలు, రాజమండ్రిలలో లక్షలు ఖరీదుచేసే భవనాల్నీ తోటల్నీ ఆయన సంపాదించారు. ప్రీవీ కౌన్సిలులో మాట్లాడేనిమిత్తం ఆయన రెండుసార్లు లండన్‌కు వెళ్ళారుకూడా. యుద్ధరంగంలో సీజర్‌కు ఎలా విజయం లభించిందో ప్రకాశంగారికి అలా న్యాయవాదవృత్తిలో విజయ పరంపరలు లభించాయి.

స్వతంత్రంగా గౌరవంగా బ్రతకదలచి ప్రకాశంగారు న్యాయవాద వృత్తి చేపట్టారు. 1857 నాటి సిపాయిల తిరుగుబాటు ఆయన్ను బాగా ఆకర్షించింది. 1893 లో మద్రాసులో స్వామీ వివేకానందను కలుసుకున్నప్పుడు ఎంతగానో ఆయనవల్ల ప్రభావితులయ్యారు. లోకమాన్య తిలక్‌ను చూడగానే ఆయనచేత ఆకర్షింపబడ్డారు. 1907 లో బిపిన్ చంద్రపాల్ మద్రాసు వచ్చినప్పుడు ఆయన ఉపన్యాస కార్యక్రమానికి అధ్యక్షత వహించేందుకు ప్రముఖులెవరూ ముందుకు రానప్పుడు ప్రకాశంగారు ఎలాంటి యిబ్బందులకూ వెనుకాడక ఆ భారాన్ని తాను తన భుజస్కంధాలమీద వేసుకున్నారు. సూరత్ కాంగ్రెసు సభకు హాజరయ్యారు. ఆ సభలోనే తీవ్రవాదులకు, మధ్యే మార్గీయులకు అభిప్రాయ భేదాలు వచ్చాయి. హిందూ పత్రిక వ్యవస్థాపక సంపాదకుడైన జి. సుబ్రహ్మణ్య అయ్యర్‌గారితో ఆయన అనేక విషయాల్ని చర్చిస్తుండేవారు. 19 8 లో బొంబాయిలో కాంగ్రెసు సభకు హాజరయ్యారు. అక్కడ అనేక ముఖ్యమైన అంశాలలో తిలక్‌తోనూ, సి. ఆర్. దాస్‌తోనూ చేతులు కలిపారు. అమృత్‌సర్ కాంగ్రెసు సమావేశంలో ప్రాంతీయ స్వపరిపాలనా తీర్మానాన్ని సమర్థించారు. విదేశాల్లో కాంగ్రెసు ప్రచారానికి సంబంధించిన సంఘంలో సభ్యుడయ్యారు.

### ఉగ్రవాది

1920 లో తిలక్ మరణించడంతో గాంధీజీ అహింసాయుత సహాయ నిరాకరణ ఉద్యమం ప్రారంభించి ఏకైక నాయకుడయ్యారు. ప్రకాశంగారు సత్యాగ్రహ ఉద్యమంలోకి దిగి ఎంతో మెరుగ్గావున్న తన న్యాయవాద వృత్తికి స్వస్తిచెప్పారు. ప్రభుత్వ నిషేధపుటుత్తర్వులను కూడా ఖాతరు చేయకుండా అనేక బహిరంగ సభల్లో ప్రసంగించారు. మోప్లా తిరుగుబాటు అప్పుడు మలబారును సందర్శించారు. అకాలీ సత్యాగ్రహం విషయంలోనూ, ముల్తాన్‌లో మత విషయమైన అల్లర్లప్పుడూ ఆయన పంజాబుకు వెళ్ళారు. గాంధేయవాదులు సాధారణంగా మూడు రకాలు- సనాతనవాదులు, అధికారులు, ఉగ్రవాదులు అని ప్రకాశంగారు యీ చివరికోవకు చెందినవారు. సి. ఆర్. దాసు, మోతీలాల్ నెహ్రూ, ఎస్. శ్రీనివాస అయ్యంగార్ గార్లతో ప్రకాశంగారు సన్నిహితంగా మెసిలేవారు.

ఆంధ్రప్రాంతం అంతటా ప్రకాశం గారికి మంచి పలుకుబడివుంది. నిదానంగా, మెల్లగా మాట్లాడే ఆయన మాటల వెనుక దృఢమైన ఆత్మవిశ్వాసం, స్థిరచిత్తం నిండివుండేవి. ఆయనను అభినందించే వ్యక్తులేకాక ఆయనమాటలను వేదవాక్కుగా పాటించే అనుయాయులు ఆయనకు అపారంగా ఉన్నారు. ఆయనచెప్పితే చిరునవ్వుతో కష్టాల కార్చిచ్చులోకి దూకడానికికూడా వెనుదీయరువారు. త్యాగం ఎంతటిదైనా సరే ఆయనతో ముందుకు నడవడమే ఒక గొప్ప అదృష్టంగా భావించేవారు అనేకులు. జాతీయోద్యమంలోకి ప్రకాశంగారు ఉరకేటప్పటికి ఆయన మధ్య వయస్కుడైనా యువకోత్సాహానికి, ఉద్రేకానికి మారుపేరుగా ప్రవర్తించేవారు. ఆయన నాయకత్వానికి బాహాటంగా ఎప్పుడూ ప్రత్యర్థిత్వం అనేది లేదు.

### స్వరాజ్య పత్రిక

గాంధీయుగంలో కాంగ్రెసు లక్ష్య ప్రచారానికి ఒక ఆంగ్ల దినపత్రిక లేమి గుర్తించి ప్రకాశంగారు ముందుకొచ్చి 'స్వరాజ్య'ను స్థాపించారు. రెండేళ్ళలో దీని సర్క్యులేషను పదివేలకు పెరిగింది. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చరిత్రను అభ్యసించి, అలీఘర్‌లో చరిత్ర అధ్యాపకుడయిన కె.ఎమ్. పణిక్కర్ దీనికి సంపాదకుడుగా వుండి దీని ఉన్నత ప్రమాణాలను నెలకొల్పారు. ఖాసా సుబ్బారావుగారు, కోలవెన్ను రామకోటేశ్వరరావు గారు వంటి

ప్రతిభా వంతులైన యువకులు స్వరాజ్యలో పనిచేస్తుండేవారు. జి. వి కృపానిధి, కె. రామారావు ఈశ్వరదత్తు వంటి ప్రసిద్ధ పాత్రికేయులు మొదట దీనిలో చేరారు. రాజకీయాల్లో చురుకుగా పాల్గొనడంవల్ల ప్రకాశంగారు స్వరాజ్య పత్రిక గెటప్ ఇతర విషయాల మీద అంత శ్రద్ధ చూపించలేక పోయారు. వ్యవస్థా నిర్వహణ, వ్యాపారదక్షత ఆయనకు అంతగా లేదు. పైగా దిన పత్రిక నడపడానికి తగ్గ వనరులు కూడా ఆయన వద్దలేవు. బర్మా, సింహళం, మలయా దేశాలకు వెళ్ళి నిధులను కూడా సేకరించారు. పత్రిక ఆర్థిక సంక్షోభాన్ని పరిష్కరించడానికి ఆయన చాలా శ్రమ పడ్డారు

దీనికి తోడు తాను సంపాదించిన డబ్బు కూడా దీనికే పెట్టారు. మిత్రులు, సహచరులు ఎంతగా చెప్పినా ఆయన వెనుకంజ వేయలేదు. పత్రికను నిరాటంకంగా ప్రచురించి కాంగ్రెసు పతాకాన్ని విజయ వంతంగా ఎగురవేసే కృషిలో చాలా శ్రమపడ్డారు. అయినా, డబ్బు పెట్టుబడి పెట్టి పత్రికను స్వార్థానికి ఉపయోగించుకో తలచిన వారిని దగ్గరకు చేరనివ్వలేదు. పత్రికలో పనిచేస్తున్న సిబ్బంది నిజాయితీయే ఆయనకు ఎక్కడలేని బలాన్నిచ్చింది. పత్రిక కష్టదశలో ఉన్నప్పుడు వారు చేతులు దులుపుకొని తప్పుకోలేదు తాముకూడా ప్రకాశంగారితో పాటు కష్టనష్టాలను పాలుపంచుకొని ఆయన సరసనే నిలుచున్నారు.

ప్రకాశం, స్వరాజ్య పరస్పరం విడదీయలేని ఒకే అంశం. ప్రకాశం అంటే స్వరాజ్య. స్వరాజ్య అంటే ప్రకాశం. కోరిన వెంటనే ప్రజలు నిస్సంకోచంగా డబ్బునిచ్చారు. వర్కింగ్ ఎడిటర్‌గా తాను ఏవిధమైన జీతాన్నీ, ప్రతిఫలాన్నీ పుచ్చుకోలేదు. స్వరాజ్య గురించి తన సంపదను యావత్తూ వెచ్చించారు. పత్రిక నిమిత్తం ప్రజల విరాళాలు కూడా బూడిదలో పోసిన పన్నీరైనప్పటికీ ప్రజలు అందుకేమాత్రం బాధపడలేదు జర్నలిజం ఆయనకు వృత్తి కాదు. అదొక బృహత్కార్యం. దానికొరకై దశాబ్దం పైగా ఆయన పడ్డ బాధలు, చేసిన త్యాగాలు, పడిన శ్రమ యిదంతా భారతీయ పత్రికారంగ చరిత్రలో సువర్ణాక్షరాలతో చెక్కబడింది.

## కేంద్ర శాసన సభలో

1926లో కేంద్ర అసెంబ్లీకి ప్రకాశంగారు పోటీచేసి ఎం. రామచంద్రరావుగారి వంటి ఉద్దండుడ్ని ఓడించారు. పోటీ చేయడానికి ముందు ప్రకాశంగారు, తన ప్రత్యర్థి, కాంగ్రెసు ప్రమాణం మీద సంతకంచేస్తే తాను విరమించుకుంటానని ప్రకటించారు. ఆరోజుల్లో పండిత మదన మోహన మాలవీయ, ఎస్. శ్రీనివాస అయ్యంగార్, మోతీలాల్ నెహ్రూ, ఎ. రామస్వామి అయ్యంగార్, ఎం. ఎ జిన్నా, జి.డి. బిర్లా, బి. ఎస్. మూన్‌జీ వంటి యోధాన యోధులు, రాజకీయ చతురులు కేంద్ర అసెంబ్లీలో వున్నారు. ప్రకాశం గారు కూడా వారి సరసనే సముచిత ఆసనం అధిష్టించి శాసన కార్యక్రమాల్లో ఆసక్తిగా పాల్గొనేవారు.

(సశేషం)

# ఆంధ్రకేసరి

ఉండ్లమూడి సత్యనారాయణ

రసము జిప్పించు నటనలో రాణ మెరసి
క్రిమినలు వకీలు వృత్తిలో గిటుకు తరసి
ప్రజల సేవించునెడ వెంటి బ్రిక్కదొ్రిసి
కరము కొనియాడబడితి ప్రకాశమూర్తి !

ధారవోసితి వీవు ధనము సర్వస్వంబు
        స్వాతంత్ర్య సమర యజ్ఞంబు నందు
గుండెజూపితి వీవు గుండు దెబ్బకు సంభ్ర
        మాశ్చర్యవార్ధి జనాళి మునుగు
హెచ్చరించితి వీవు హేమాద్రివలె నిల్చి
        శ్వేతజాతీయుల చెడుగు బనుల
గప్పించితివి నీవు కర్షక శ్రామికా
        హ్లాదంబు పెంపొంద నహరహంబు
ద్యాగశీలి యంచు నాంధ్రకేసరి యంచు
గుండెగాల మంచు గూర్చునేస్త
మంచు బ్రజలు పొగడ నలరారి నేతవై
రంగు మెరసినావు టంగుటూరి.

తప్పు జేసెడు వాడు విధాత యైన
గుండ బ్రద్దలుగొట్టు నుద్దండ లీల
రచ్చకీడ్పించి యాతని రవ్వచేసి
గాని నిద్రింపలేదొక క్షణము నీవు.

నిదురపోతు లోన నిటలాక్షు రౌద్రము
బారుబోతు లోన బార్థు పటిమ
పొగరుబోతు లోన బుద్ధుని తత్వము
జిలికి పెలికి లాగ జెల్లె నీకు.

నీ కార్యదీక్ష, దక్షత
నీ కరుణాదృష్టి, నీదు నేతృత్వము సు
శ్లోకములై జాతిని స
ద్రీకము గావించె నాంధ్రసింహ, మహాత్మా !

# వందేమాతరం

## ముదిగొండ వీరభద్రమూర్తి

[క్షామ ఖండమునుండి]

బెంగాల్లో రైతులు నీలి పైరు పండిస్తుండే వారు. బ్రిటిష్ దళారీలు దానిని చవుకగా కొనుక్కుని లాభాలు ఆర్జించేవారు. వారికి వీరికి తగాదా వచ్చింది. రైతులు ఆ పైరు వేయడం మానేశారు. ఆ తర్వాత కొంత కాలానికి అక్కడ కరువు వచ్చింది. రైతుల్లో జాతీయ చైతన్యం కలగడానికి ఆరోజుల్లో యీ సంఘటనలు దోహదం చేశాయి సం॥]

సంగము రెండు సంస్కృతుల జాళ్లకు సింగమువాడి క్రేళ్ళకున్
రంగము ధైర్యగుప్తికి సొరంగము సాహస భావదీప్తమౌ
వంగము కుంభినీ రమణి వక్షమునన్ విరచించె నాది నీ
లాంగుడు పత్రభంగ మొకటయ్యదె యియ్యది నా విరాజిలున్

ఆ రాష్ట్రమ్మున నీలి పైరు భువిపై నాషాఢ మేఘచ్ఛవిన్
బారాడించుచు జిట్లు చీకటుల నాపాదించి మాయాకిరా
తామూఢద్యుతి కొప్పినట్టి యుపమేయం బౌచు నేపొందె వ్యా
పారుల్ హూణవరుల్ కుబేరులయిరా పంటన్ ప్రసాదించుటన్

విత్తు లొసంగి పెట్టుబడి పెట్టి తయారొనరింప జేయు నా
మొత్తము పంటవిల్వ దమ మున్నిడినట్టిది పోగ నున్న యా
విత్తము నాంగ్ల వర్తకులు పెద్దయు గాల మొసంగు చుండిరీ
ఖత్తున నెత్తుకోదొడగె గాపులలో సిరి పెక్కు మందికిన్

కన్నుకుట్టెనేమొ కక్కుర్తిగాం డ్రైరి
సేద్యగాండ్రి యెడల శ్వేతముఖులు
వ్రాసికొన్న ధరకు గ్రయ మొల్లక, తదర్ధ
మిత్తు మనిరి జనము మొత్తుకొనిరి

సామీ! యాసాముల నీ
మై మోసము సేత పెద్ద మనుసులు దొరలున్
ధీమంతులు పేర్మ్రొగిన
శ్రీమంతుల రైన మీకిసీ! తగ దయ్యా!

మీ మాటన్ జవదాటి మే మెఱుగమే మీ రన్న మా జేజెలన్
గా మన్నించెదమే, శుకమ్ము లటు లన్మన్నట్టె యన్నారమే
మా మందిం బొయిరాజనట్టి గణనా మాత్రుల్ కలా రయ్యలా
రా! మం రూకల నిట్లు గుంజికొన దీరా! పత్రభిన్నమ్ముగా.

అన యజమానులు 'రాస్కె
ల్స'ని రిపు డింతే యొసంగ నర్హ మనిరి మా
కను భూతము నష్టం బని
రనువు కొలది మీరు మసలరా, హాతు లనిరిన్

ఆ యనుట యాయుధక్షతి
తో యమ్మన దాక బ్రజల తోయధి మొరసెన్
మాయంతట మే ముందుము
మీ యంతట మీరు మసల మే లింతటితో

ఏగము నీలితొట్లవయి పే మిక బెంచము నీలి పైరు మీ
కై గమనించి మీరు సరిగా గ్రయ రూపిక లిచ్చుదాక నే
దో గన మైన బాస బిరుదున్ దయసేసిరి మా కదేల మీ
రే గయికొండు మీ ర్తగుదు రెంతటి కైనను దేని కైననున్

న్యాయముపై ని కత్తి పడెనా! గత శారదనీలి మూల్యమున్
గోయగ హేతు వేదయిననుగా వినగోరము, లేదు సుంతయున్
మాయెడ నైన నేరము, క్రమాగత లాభమునుండి పూడ్చికొం
డీ! యెదియేని నష్టము ఘటిల్లిన నీయము నీలియచ్చులన్

అపుడె కృషికుల భాగ్యమ్ము నణచి కొట్టు
శాసనము చేయబడె నాంగ్ల శాసనంబు
బంతి యెంత క్రిందకు గొట్ట నంత పైకి
లేచు వడి నైకమత్యమ్ము మోచె జనము.

కనుపడలేదు వేపను బూత, వర్షాస
తీ వైభవమున జ్యోతిషపు వ్రాత
మొలతేర లేదు చీమల బారు ప్రావృషా
ప్రభ్వికి మూక సేవకుల తీరు
వినపడ లేదు భేకనిచయ బెకబెక
జడిరాణి నుడి పల్కు బడి తికమక

చనుదేరలేదు పింఛము విప్పి కేకి వా
సలకార్పు జవరాలి నట్టువ సకి
తొల్లి పంచాంగము బురోహితుండు గద్గ
దస్వరమ్మున జదివిన తరుణ మందె
తెలివి బాసి శూన్యమ్మున దృష్టి నిలిపి
నట్టి హాలికు లరకలు కట్టరైరి

మందలు మంద లావు లొక మబ్బును గేదెయు గాద యేవియేం
బిందువు రాల్పవుం బయసు బీడువడెన్ హృదయమ్ము భూమి యా
క్రందన మొక్కటే తఱుగు కాపుకొలమ్మున నిప్పగజ్జికా
లందియ మోగినట్లు సడి యైనది, పెద్దమ వచ్చె గొండ్లికై

తూనీగ వాన కోయిల
లేనేలకొ వలస పోయె నే నాకుపునం
దోనాక్షవిభు ధను వడగె
నే నేరెడు చూడ నాకులే యగుపడియెన్

పానీయంబే మృగ్యము
స్నానీయ జలమ్ముమాట శంకరు డెఱుగున్
గానంబడియె శివాలయ
మై నభము, విభూతి పండ్లు నై చిఱు మొగిళుల్

పిలిచినను బయి జూచుట
తలపింపద తప్పు గాగ దమకించి నభ
స్థలమున నల్లని రేకను
దిలకింపన్ గోరి ప్రజలు దృష్టి నిగుడ్పన్

నాగులు పెచ్చులున్ గలసి నాల్గవవంతును బెంప ధాన్యమున్
బోగులు పోసికొన్న, యొక రూక కణావడి వడ్డితో ఋణం
బీగి గడించికొన్న ధని బృందము క్షామమునన్ వడంకె శీ
తాగమమందు కంబెను శతాధిక మన్నము నిద్ర యల్ప మై.

కలవారిలోన బుద్ధిన్
గల వారలు కొంత యిదిరి కార్మికులకు ద
త్కాలితాప హరణమున బు
ద్ధి లేని వారడలి రున్నదెల్లయు పోవన్

పల్లెటూరి నుండి పట్నవాసమునకు
బ్రదుకు తెరువు కొఱకు బడుగు చేరె
వానికన్న మున్నె భాగ్యవంతుడు చేరె
నడిమిరకము రైతు నడువ లేడు.

దేవ మాతృక ఫలిత మందెనొకొ దాని
మూల్యమందు సగము పన్ను. పొలము విడిచి
పెట్టె నొక్కొక్కచోట నంబేద, లంక
మేత గోదావరీనది సీత గాగ.

పన్నులు కట్టలే మని విపన్నులు మిక్కిలి వేడు కొన్న నే
మున్నదిగట్ట యీక కలమున్ మసిబుడ్డిని ముంచి ముంచి యా
యున్న చరాస్తిపై గరణ ముద్ధతి వ్రాసిన జప్తు కాగితం
బున్నది ఆలిపుస్తె యొక టున్నది వేలము కాని వానిలో

అమ్మా! యాకలి యనగా
గొమ్మా! యని నోట పైటకొం గిడియెను, దా
హ మ్మన గన్నీ రొసగెను
సొమ్మసిలుచు దల్లి సంతు చూపులు గాడన్

కఱవు నందు గదన మందు గామమందు
యుక్త మిద యుక్త మిది యను యోజనలకు
దావు లేదు. బ్రతుకున కొక తావి లేదు
కసవు మొదలుగ గుడుచుట పొసగుచుండు.

కసవు లేదయ్యెను బసరమ్ము లేద యొ
క్కొట నున్న నది నరకుక్షి గలదు
పత్రమ్ములును లేవు పక్షులు లేవ వృ
క్షములందు జగతి యాకలికి రాలి
యింత చాలక ప్రజ యెంతకున్ దెగబడ
నవమతి లేదకృత్యమ్ము లేద
యంత సేసియు దిండి యల్పకాలమె వచ్చి
యెంతో జనమ్ము కన్పింపదయ్యె

కన్న భూమాతయే తన కడుపు నెఱ్ఱె
గొట్టి సృష్టిని లోగొన్న గుట్టు తెలిసి
పూర్వ భారత సంగ్రామ ఖర్వభుక్తి
త్రేన్చె నీ క్షామమున దురదృష్ట శక్తి

అన్ని క్షేత్రములు మహా శ్మశానమ్ములు
విశ్వనాథుని జూడ వెడలు నెవడు ?
కొండ యెక్కి హరిని గొల్వబోవ ప్రతిసో
పానమ్మునకు బిచ్చగాని శవము
పెద్ద బస్తీలలో బెనుత్రోవ కిరుప్రక్క
కుళ్ళిన దేహాల కుళ్ళ కంపు
పల్లెలలో నిండ్లు పాడు వడ్డవి పోయె
మట్టి పన్ను వసూలు మణియ కాదు

ఇట్టి కఱవను విషముష్టి చెట్టునందు
నేడు నొకటి కొమ్మలు గండరించి దిశల
విదిశలం బ్రాకె. దీని పండు దిననట్టి
రాష్ట్రమే లేదు భారత రాజ్యమందు

కలగుండు వడె పదేడే
డు లొకట బో మరొకటన్ గడున్ దేశ మిటుల్
తొలి డొక్కల పుఱ్ఱెల కఱ
వులు నందన కఱవు దీని బోలవు హానిన్.

# నగరంలో వార్తాచిత్రాలు



ఇరాన్ కన్సల్ జనరల్ డా. ముఖ్తదేరి ఆగస్టు 16 వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ గవర్నరుతో సంప్రదించారు.



ఆకాశవాణి వారు ఆగస్టు 15వ తేదీన బాల భవన్‌లో "వెరైటీ ప్రోగ్రాం" ఏర్పాటు చేశారు.



ఆగస్టు 16 న రిడ్జ్ హోటల్లో "సీవూ_యాత్రలు" అనే గోష్ఠిని యాత్రికశాఖ మంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీ ప్రారంభించారు.



అదే కార్యక్రమంలో మరొకదృశ్యం: నిర్వాహణ శ్రీరావూరి భరద్వాజ



భారత రాష్ట్రపతి ఆగస్టు 26 వ తేదీన నగరానికి వచ్చారు.



ఆగస్టు 15వ తేదీన ముఖ్యమంత్రి నాంపల్లి దర్గా సందర్శించారు.

# నగరంలో వార్తా చిత్రాలు



ముఖ్యమంత్రి ఆగస్టు 6వ తేదీన సాలార్‌జంగ్ మ్యూజియంలో కొత్త గ్యాలరీకి ప్రారంభోత్సవం చేశారు.



ఆగస్టు 15 వ తేదీన సికింద్రాబాదు పెరేడ్ మైదానంలో ముఖ్యమంత్రి పెరేడ్ తిలకించారు.



ఆగస్టు 15వ తేదీన నీలోఫర్ ఆస్పత్రిలో డా. హరిశ్చంద్రకు జరిగిన అభినందన సభలో ముఖ్యమంత్రి దంపతులు పాల్గొన్నారు.

# ఎక్కువ పంటలను పండించుకోండి బ్యాంక్ ఆఫ్ బరోడా వ్యవసాయ పనులకు అప్పులు యిస్తుంది

మంచి విత్తనములు, మంచి ఎరువులు, మంచి పనిముట్లు భూమిని పదును చేస్తాయి. మంచి పంటలను పండించుకొనుటలో మీకు కావలసిన వాటిని కొనుక్కొని....డబ్బు గడించుటకు బ్యాంక్ ఆఫ్ బరోడా అప్పులను యివ్వగలదు.




సిరిసంపదలకు అక్షయపాత్ర

## బ్యాంక్ ఆఫ్ బరోడా

హెడ్ ఆఫీస్: మాండ్వి, బరోడా

550 పైగా బ్రాంచీలతో భారతదేశములో దాదాపు ప్రతి స్టేటులోను సేవ చేస్తోంది. ఇంకా: యు.కె., తూర్పు ఆఫ్రికా, మారిషస్, ఫిజీ ద్వీపములు మరియు గియానాలలో బ్రాంచీలు కలవు.

Shilpi BOB 10/71 Tel




కంచి దక్షిణాదిలో ప్రసిద్ధ పుణ్యతీర్థం. కంచికామాక్షి దక్షిణ భారతీయుల కత్యంత ప్రియమయిన తల్లి. వరదరాజస్వామి, ఏకాంబరేశ్వరులు యిష్టదేవతలు.

వరదరాజస్వామి ఆలయమునకేగి కనులార వరదరాజ "స్వామిని దర్శించి వరదరాజా నిన్ను సేవింప వచ్చాను. నిన్ను ముక్కోటి దేవతలు భూసురోత్తములు యెందరో సేవిస్తున్నారు. నీ నివాసం వైకుంఠం. దేవతలు తారకలు. ఆ తారకల్లోని చంద్రుడవు నీవు. వేదరూపుడైన గరుడు నీవాహనం. నీ నిజ వాహనోత్సవం జూచి నేను ధన్యుడనైనాను"(వరదరాజ నిన్నేకోరి వచ్చితిరా—స్వరభాషిణి) యని కీర్తించాడు.

కామాక్షి దేవిని దర్శించాడు! "తల్లీ నీవు జగద్రక్షకివి. తల్లులకు తల్లివి. అనాథుల రక్షించి ముక్తిమార్గంజూపే దయామయివి. నీ తనయుడు వినాయకుని బ్రోచినట్లే నన్ను కాపాడు. నరాధము లెంతమందో నీవలన వరములు పొందియున్నారు. భూసురాదులందరకుకూడా అట్టిభాగ్యము కల్గించు. శంకరుని ఢీకొని నీశక్తి సాటిలేదని ఋజువుచేసిన లోకమాతవు"(వినాయకుని వలెనెబ్రోవవె_మధ్యమావతి)

కామాక్షిదేవిని దర్శించిన పిమ్మట ఏకాంబరేశ్వరుని కనులారగాంచి పంతువరాళిరాగంలో శివశివ యనరాదా యనే కీర్తన గానంచేస్తూ తనను రక్షించమని వేడుకొన్నాడు.

శివపార్వతుల. వినాయకుని పూజించి శక్తిస్వరూపుడయిన సుబ్రహ్మణ్యేశ్వరుని ధ్యానించరపోతే ఆయనకు కోపంరాదూ! "స్వామీ! నీవు మన్మదకోటివి బహుసుందర మూర్తివి. సకల జనావళికి నయనానందకరమగునట్లు నృత్యంచేసే నెమలి నీ దివ్య వాహనం. జ్ఞానఫలము నీవు. శివశక్తి నీలో యిమిడియున్నది. రాక్షస సంహారానికి నీవు ఆదికర్తవు. శ్రీరాముని సోదరియైన పార్వతి తనయుడవు నిన్ను ఆశ్రయించిన నన్ను దయజూడుమని విన్నవించుకొన్నాడు.

ఉపనిషద్ బ్రహ్మేంద్రులవారు త్యాగరాజు పాడిన కీర్తనల వెంటవుండి ఆనందించాడు. త్యాగరాజు తన గానప్రతిభతో బ్రహ్మేంద్రులవారి ఆశీస్సులు పొందవలెనని శ్రీరాముని దివ్యలీలలు వర్ణిస్తూ ఆరభిరాగంలో "సాధించెనే ఓమనసా" అనే కీర్తనలో మధురంగా దేవస్తుతిజేశాడు. ఘనరాగ పంచరత్న కీర్తనలలో బహువ్యాప్తిచెందిన కీర్తన. రాగ విస్తారానికి, పల్లవిలోని సంగతులకు, భావ పరంపరకు యీ కీర్తన ప్రాముఖ్యత వహించినది.

భగవంతుడయిన శ్రీకృష్ణుడు కూడా సమయానికి తగినట్లు చాతుర్యంగా మాట్లాడేవాడు. తమకు శ్రీకృష్ణుడు జన్మిస్తాడని, గడ్డు దినాలు పోతాయని భ్రమించిన దేవకీ వసుదేవులకు ఒక పట్టాన వారి బాధలు తొలగిపోలేదు. శ్రీకృష్ణుని దేవకి కనినప్పటికీ ముద్దు ముచ్చటలన్నీ యశోద, నందులే అనుభవించారు. చిన్ని ప్రాయమునే మధుర మురళీ గానముతో సకల జనావళినాకర్షించుకొన్నాడు. పండితుల హృదయములలో నిలచిపోయాడు. మునివంద్యులను గోపికల రూపమున జన్మింపజేసి గాఢానులింగనముతో వారికి జన్మను చరితార్థం జేశాడు. యశోద ముద్దులకు నవ్వుతూ, నవ్వులోనే తానెవరయింది తెలిపి ఆమెచేత నమస్కరింపజేసుకొన్నాడు. అట్టి కృష్ణుడు ఎవరు? ముందు యుగంలో సుగుణ పారావారుండు. మానవేంద్రుడు, వీరనారీ సోదరుడు. ఇనకులశ్రేష్టుడు, మృదు సుభాషి, భగవంతుని నిందింపకూడదని. అలుకకూడదని, వికృత పురుషుల సహచర్యం కూడదని మృదువుగా భక్తుని మందలించు రాముని కరుణ ఒకనాడు మనపై ప్రసారమవుతుంది."

పై మధుర భావాలను ఉపనిషత్ బ్రహ్మేంద్రుల వారు యెంతో మెచ్చుకొన్నారు. మనసా ఆశీర్వదించారు.

వరదరాజస్వామి తిరునాళ్ళను జూడవచ్చిన తన మిత్రుడు కోవూరు సుందరేశ్వర మొదలియార్‌ను బ్రహేంద్రులవారు త్యాగరాజుకు పరిచయం చేరారు. మొదలియార్ భక్తుడు, సంగీత ప్రియుడు, సారస్వతాభిమాని. త్యాగరాజు పరిచయానికి యెంతో సంతోషపడ్డాడు. త్యాగరాజుని తమ గ్రామం రావల్సిందిగా ఆహ్వానించాడు. త్యాగరాజు మొదలియార్ ఆహ్వానాన్ని స్వీకరించాడు.

కంచి నుంచి తన ప్రియ శిష్యుడయిన వెంకట రమణ భాగవతార్ స్వగ్రామమయిన వాలజాపేట చేరాడు. నగర ముఖ

ద్వారములోనే వెంకటరమణ భాగవతార్ యితర పెద్దలతో స్వాగత మిచ్చాడు. శిష్యుని యింటిలో పండ్రెండు దినములుండి జ్ఞాన మొసగరాదా, పరమాత్ముడు వెలిగే ముచ్చట, మోక్షము గలదా భువిలో మొదలైన కీర్తనలను సృష్టించి, గానంచేసి పుర ప్రజల నానందపరచి సుందర మొదలియార్ కోరిక పరికాలం మద్రాసు బయలుదేరి, తిరువత్తియూర్‌లో శిష్యుడైన కుప్పయ్యర్ యింటిలో విడిది చేశాడు. కుప్పయ్యర్ ప్రముఖ వైణికుడు.

తిరువత్తియూర్‌లో వెలిసియున్న త్రిపుర సుందరిపై పంచరత్న కీర్తనలు గానం చేశాడు. సావేరి రాగంలో "కన్నతల్లి నీవు నా పాలగలుగ గాసిచెంద నేలనమ్మ", ఆరభిలో "సుందరి నిను వర్ణింప బ్రహ్మాది సురల కయినా తరమా" అపరూపమయిన బేగడ రాగంలో "సుందరి నన్నిందరిలో జూచి బ్రోవవదమ్మ" మధుర కల్యాణిలో "సుందరి నీ దివ్య రూపము జూడ దొరికె నమ్మా!" యని త్రిపురసుందరిని యెన్నో రీతుల వర్ణించి శిష్యుల పుర ప్రజల మన్ననల గావించాడు. మద్రాసు బందరు వీధిలో నివ సించుచుండిన సుందరేశ మొదలియార్ నిత్యం తిరువత్తూరులో త్యాగరాజు జరిపే ఆరాధనోత్సవంలో పాల్గొని మధుర గానాన్ని తనివిదీర రసాస్వాదన గావించేవాడు. ఒక శుభ దినాన మొదలి యార్ త్యాగయ్యను మద్రాసుకు తీసుకొని వెళ్ళి తిరువళిక్కేణి లోని పార్థసారథి కోవెలలో పూజలు సలిపాడు. త్యాగయ్య పార్థ సారథి మోహన రూపం కనులారా జూచి "పారి వెడలిన పార్థ సారథిని గనరె" యనే కీర్తనను గానం చేశారు.

సుందరేశ మొదలియార్‌కు త్యాగరాజుమీద యెనలేని భక్తి కల్గింది. తన స్వస్థలమయిన కొవ్వూరుకు విజయం చేయమని, కొవ్వూరులో వెలసియున్న సుందరేశ్వరుని కొలువమని అర్థిం చాడు. చిరునవ్వుతో త్యాగయ్య భక్తుని కోరికను మన్నించాడు, కొవ్వూరుకు పయనమయిన త్యాగరాజు యెక్కిన పల్లకిని స్వయంగా మోసి వారిపైనున్న భక్తి విశ్వాసాలను ప్రకటించు కొన్నాడు.

కొవ్వూరులో నిలచిన దైవం సుందరేశ్వరుడు. లోక రక్షకుడు. పిలచిన పలికే బోలాశంకరుడు. లోకోత్తర శక్తులను తన పిడికిటలో పెట్టుకున్న ఆదిమూర్తి. సుందర దివ్య స్వరూ పుడు. నాట్య చక్రవర్తి. పురుషత్వానికి ఆదిబింబము. అంభోరుహ లోచనుడు. పరమ దయాకరుడు. గంగాధరుడు భూభారాన్ని మోస్తున్న ఆదిశేషుని ధరించిన దైవాగ్రజుడు నమ్మినవారిని నయముగ బ్రోచే కారుణ్యమూర్తి. నాదస్వరూపుడు. లింగరూప ములోగాక నేత్రానందకరంగా వెలసిన సకల గణాధిపతులు సేవించే సంగీతమూర్తి. అట్టి ఆదిమూర్తిని "ఈ వసుధ నీవంటి దైవము నెందుగానరు. భావుకము కల్గి వర్ధిల్లు కోవూరు సుందరేశ గిరీశ" యని వేనోళ్ళ పొగడినాడు త్యాగయ్య. ఖరహరప్రియ రాగములో "కోరి సేవింపరారె కోర్కెలీడేర", పంతువరాళిలో శంభో మహాదేవ శంకరగిరి జారమణ, కల్యాణిలో నమ్మివచ్చిన నను నయముగ బ్రోచు, శంకరాభరణ రాగంలో సుందరేశ్వరుని జూచి సురలజూడ మనసువచ్చునా యని నోరార కీర్తించి బ్రహ్మానందం పొందాడు త్యాగయ్య.

మొదలియార్ తన జన్మ సార్థకమైనదని తలంచాడు. సంసార కష్టములు తెలిసిన మొదలియార్ త్యాగయ్యకు తెలియ కుండా కొంత సొమ్మును పల్లకీలో దాచేడు. త్యాగరాజు మొదలి యార్‌ను దీవించి అతని భక్తి విశ్వాసానికి కృతజ్ఞత దెల్పి తిరువయ్యారు ప్రయాణం సాగించాడు.

## త్యాగబ్రహ్మం మరో పేరు త్యాగరాజు

త్యాగయ్య వస్తున్న మార్గ మధ్యంలో దొంగల సైర్వ విహారం యెక్కువని తెలిసీ తమవద్ద యేమున్నదని ప్రయాణం కొనసాగించాడు. కాని దొంగల అటకాయింపు జరుగనే జరిగింది. కొండలలోని రాళ్ళను దొర్లించడం, విసరడం ప్రారంభించారు. శిష్యులు, బోయీలు దెబ్బతిన్నారు. రాళ్ళవర్షం విపరీతం గావడంతో యిక గురువువారికి తెలుపుదామని పల్లకి ఆపి, త్యాగయ్యకు విషయం విన్నవించుకొన్నారు.

మనవద్ద యేమున్నదని దొంగలు ఆటంకము కల్గిస్తున్నారని ప్రశ్నించాడు. ఒక శిష్యుడు భయముతో చేతులు జోడించి, స్వామీ మొదలియార్‌గారు తమకు తెలయకుండా కొంత సొమ్ము పల్లకీలోన వుంచారని చెప్పాడు. త్యాగయ్య బాధతో, చూచారా! మనకు తెలియక పోయినా ధనం మనకెంతో హాని కల్గిస్తున్నదని శిష్యుని మందలించి ఆ దొంగలను పిలువ బోయేసరికి వారేవచ్చి త్యాగరాజు కాళ్ళమీద పడారు. త్యాగరాజు సంభ్రమంతో యేమిటది, మీకు కావలసినది ధనమేగదా, తీసుకవెళ్ళండని శిష్యుని డబ్బు సంచి తెచ్చియివ్వమని ఆదేశించాడు. దొంగలు వారి దేహంపై ఉన్న దెబ్బలు జూపుతూ" రక్షించండి స్వామీ! మీరు సామాన్యులని మిమ్ముల దోచుకో యత్నించాం. కాని మాకు మీరు మహాను భావులన్న విషయం తెలియదు. మమ్ముల మన్నించండి. ఇక మీ జోలికి రాము" యని దీనంగా చెప్పారు. ఏమిటి అని అసలు విషయం చెప్పమన్నాడు త్యాగరాజు. మేము విసరిన రాళ్ళే తిరిగి మాపైకి వచ్చి మమ్ముల గాయపరిచాయి స్వామీ! ఎవరో యిద్దరు బాణాలు వదిలి మమ్ములనే గాయపరిచారు. ఆ కొండల పైన వున్నారు స్వామియని చెప్పగానే ఎక్కడ అంటూ ఆ వైపు చూచాడు. కాని యేరి? కనుపించలేదు. త్యాగరాజు ఆశ్చర్యంతో నలువైపులా పరికించాడు. ఎవ్వరూకనుపించలేదు. కాని జరిగిన విషయం స్పష్టమయింది త్యాగరాజుకు. త్యాగరాజు దొంగలను జూచి మీరు ధన్యులు నేను ఎంతో కాలంనుంచి ఆ సుందర మూర్తులను జూడవలెనని పూజలు సల్పుచున్నాను. కాని ఆ మహాభాగ్యం మీకు దక్కింది. మీరు దొంగలు గాదు. మీకు కనిపించినది సామాన్య మానవులుగారు. దివ్యపురుషులు, రామలక్ష్మణులు. మీ పాపాలన్నీ నిర్మూలమయినాయి, మీ జన్మలు తరించాయి. ఇదిగో యీధనం తీసుకొని యికనయినా మంచిగా బ్రతికి నలుగురికి సాయపడండని దొంగలను సాగనంపి తనను, తన బృందాన్ని కాపాడుచున్న రామ లక్ష్మణులను కీర్తించాడు. "ముందు, వెనుక యిరుప్రక్కల దోడై" యనే కీర్తనలో. పుత్తూరు గ్రామం చేరాడు. గ్రామ మొదలులో వున్న ఆలయం వద్ద జనము గుమిగూడి వుండడం జూచాడు. ఒక శిష్యుణ్ణి పిలిచి విషయం తెలుసుకొని రమ్మన్నాడు

త్యాగరాజు. ఒక స్త్రీ భర్త శవం ముందు కూర్చొని విలపిస్తున్నది. ప్రక్కనే చిన్నబాలుడు కూడా యేడుస్తున్నాడు.

అరణ్య ప్రాంతములోని గ్రామము ఆనాటి పుత్తూరు. రాత్రిళ్ళ పులులు నిర్భయంగా గ్రామములోనికి వచ్చి దొరికిన జంతువులనుగాని, మనుషులనుగాని చంపి లాక్కొని పోవడం అలవాటయిపోయింది. అందువల్ల ప్రజలు సంధ్యపడగానే తలుపులు బిడాయించుకొనే వారు. తరువాత ఎవ్వరు వచ్చినా తలుపులు తీసేవారు కారు.

గడచిన రేయి ఒక యాత్రీకుడు, భార్యబిడ్డతో పుత్తూరుజేరి ప్రతి యింటికివెళ్ళి తలుపులు తట్టసాగాడు వసతికోసం. ఎవరూ తలుపులు తీయలేదు. చివరకు విసిగి, ఆలయంలో నిద్రపోదామని ఆలయము దగ్గరికి వచ్చిచూడగా తలుపులు బంధించి వున్నాయి ఎక్కడ పిలిచినా యెవరూ పలుకలేదు. భార్యను బిడ్డను బయటనే వుండమని, ప్రహరీ గోడ దుమికి లోనికివెళ్ళి తలుపు తీసానని గోడయెక్కి లోపలివైపు దుమికాడు. అతడు దుమికిన ప్రదేశం లోనే బావి వుండడంవల్ల అందులో పడి ప్రాణాలు విడిచాడు. ఎంత సేపయినా భర్త బయటికి రాకపోవడంతో భార్య కేకలు వేయ సాగింది ఎవ్వరూ యిండ్లలోనుంచి బయటకు రాలేదు. ఏదయినా పులి ఎవరినో చంపిందనే భయంతో చివరకా స్త్రీ సొమ్మసిలి పడిపోయింది. పిల్లవాడు వెక్కివెక్కి యేడ్చి నిద్రపొయ్యాడు. పులులు ఆ ప్రాంతములోనికి రాలేదుగాని యమభటులు మాత్రం ఆ వైపు వచ్చారు. తెల్లవారగనే ప్రజలు గుమిగూడారు. ఆ స్త్రీ యేడుస్తూ విషయమంతా చెప్పింది. వెంటనే కొంతమంది యాత్రీకుడు గోడ దుమికిన చోటుకు పోయిచూడగనే బావిలో శవం కనుపించింది. బావిలోనుంచి శవాన్ని వెలుపలికి తీసి ఆలయం వెలుపల వుంచారు.

ఈ వార్తను త్యాగరాజుకు విన్నవించాడు శిష్యుడు. త్యాగరాజు బ్రాహ్మణుని అకాల మృత్యువుకు బాధపడ్డాడు. పల్లకి దిగి జనము మధ్యకువచ్చి స్త్రీ బాలుని రోదన జూచాడు ఎవరో స్వాములవారు అంటూ ప్రజలు దారిచ్చారు. త్యాగరాజు కంట తడిపెట్టాడు. వెంటనే త్యాగరాజు శవము తలను తన తొడమీద పెట్టుకొని రామనామ జపం జేశాడు ప్రజలు ఆశ్చర్యపడ్డారు. రామా నేను నీ కొరకు చేస్తున్న తపోఫలాన్ని దారవోస్తున్నాను. ఈ బ్రాహ్మణుని పునర్జీవితుణ్ణిచేయి. నేను జీవితములో పుణ్య కార్యము లేమయినా జేసివుంటే అందుకు ఫలితాన్ని సత్ఫలితాన్ని యీ యువతి మాంగల్యాన్ని రక్షించడమేనని నేను మనసారా నిన్ను ప్రార్థిస్తున్నాను (నా జీవాధారా, నానోము ఫలమా—బిలహరిరాగము) అని గానం చేస్తూ తులసి తీర్థాన్ని శవము నోటిలో పోయగనే నిద్రనుండి లేచినట్లులేచాడా బ్రాహ్మణుడు అతని భార్య యెంతో సంతోషించింది. దంపతులిరువురు త్యాగరాజు పాదాలను తమ ఆనందాశ్రువులతో కడిగారు. పురప్రజలు త్యాగరాజు మహిమకు అచ్చెరువొంది సాష్టాంగ ప్రణామం చేశారు. త్యాగరాజు అందరికి కృతజ్ఞత తెలిపి రామనామ జపముకన్న మించిన శక్తి లేదని ప్రజలందరు సద్భక్తులయితే గ్రామములో క్రూర జంతువుల బెడద వుండదని, దీవించి తిరుపతికి ప్రయాణం కొనసాగించాడు.

( సశేషం )

---

# ఉపాధి కల్పన

(35 వ పేజీ తరువాయి )

**డోంగ్రీ కుట్టు పథకం:**

పారిశ్రామిక శిక్షణ సంస్థలకు కావలసిన డోంగ్రీలు ఆసుపత్రులకు, ప్రభుత్వ శాఖలకు కావలసిన వస్త్రాలు యిక్కడ తయారుచేస్తున్నారు. కుట్టుపని శిక్షణ పథకం క్రింద శిక్షణ పొందిన వారికి యీ పథకం క్రింద ఉపాధి కల్పించబడుతున్నది. ఇటీవల 60 వేల రూపాయల విలువైన కేన్వాస్ సంచుల్ని కూడా యీపథకం క్రింద తయారుచేశారు.

**అగరువత్తుల తయారీ పథకం**

ఒక కేంద్రములో 200 మందికి ఉపాధి కల్పిస్తూ అగరు వత్తుల్ని తయారు చేయడానికి ఉద్దేశిస్తున్నారు.

ఈ పైన పేర్కొన్న పథకాలేగాక అచ్చు పని కుట్టు పని, జింగ్‌జిగ్ పని, తెలుగు టైప్‌రైటింగ్, షార్టుహేండ్. నిరుద్యోగులైన ఇంజనీర్లు వైర్‌మన్ ప్లంబర్‌లకు సంబంధించి శిక్షణ పథకాలు కూడా చేపట్ట బడుతున్నాయి.

8 వ తరగతి ప్యాసయిన అభ్యర్థులకు నెలకు 7 రూ.ల స్టయిపెండు యిస్తూ టైలరింగు 'ఎ' క్లాసుకు చేర్చుకుంటున్నారు. శిక్షణకాలం 1సం॥ ప్రస్తుతం 9 టెయిలరింగ్ శిక్షణకేంద్రాలు నెల కొల్పబడ్డాయి. వీటిలో 440 మంది శిక్షణ పొందుతున్నారు.

వైర్‌మన్. ప్లంబర్ వృత్తుల కోర్సులో 8 వ తరగతి ప్యాసయిన అభ్యర్థుల్ని చేరుటక్కు శిక్షణకాలం 2 సం॥లు నెలకు 20రూ. చొప్పన స్టయిపెండు యిస్తారు. హనుసేసీ ఆలం వద్ద ఒక శిక్షణ కేంద్రం వుంది. దీనిలో 51 మంది శిక్షణ పొందుతున్నారు.

చదువుకున్న నిరుద్యోగులు లాభసాటి వృత్తులను చేపట్ట డానికి వీలుగా యీ శిక్షణ పథకాలు ఎంతగానో తోడ్పడుతున్నాయి.

# స్వాతంత్ర్యయోధుల వీరభూమి

# బంగారు బంగ్లాదేశ్

వావిలాల గోపాలకృష్ణయ్య

(గత సంచిక తరువాయి)

ఈనాడు శ్రీ ముజిబూర్ రహమాన్ బంగ్లాదేశ్‌కు సార్వభౌమాధికారం-స్వాతంత్ర్యం కలిగిన రాష్ట్రంగా ప్రకటించవలెనని ఆ విధమగు రాజ్యాంగం నిర్మాణం కావలెనని కోరి అధిరాజ్యాంగ రచన ద్వారా లభించే అవకాశాన్ని పాకిస్తాన్ ప్రెసిడెంటు తిరస్కరించినందువల్ల ప్రజలచే-అధిక సంఖ్యాక బెంగాలు ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధులను త్రోసిరాజుచేసి మిలటరీ పాలనను ఏర్పచటచే చివరకు బంగ్లా ప్రజలే తమ ప్రభుత్వాన్ని ప్రకటించుకున్నారు

మార్చి 27 వ తేదీ విదేశీ పత్రికా విలేఖరులను యాహ్యాఖాన్ మిలటరీ పాలకులు విమానంలో ఎక్కించి విదేశాలకు పంపివేశారు. మిలటరీ విఘాతక కృత్యాలు తెలియకుండా చేయాలని నిర్ణయించారు. తమ ఘాతుక ఆయుధాలతో స్త్రీలు, పురుషులు, బాలురులు, బాలికలు, రోగులు, వైద్యశాలలు అనే తేడా లేకుండా తూర్పు బెంగాలు ంతటా మారణహోమం చేసివేశారు. ముజిబూర్ రహమాన్‌తో సంభాషణలు సాగుతున్నవని యాహ్యాఖాన్ పత్రికలకు చెప్పాడు మరురోజు శ్రీ జుల్‌ఫికర్ భుట్టో ఢక్కాకు చేరాడు. 22 న ప్రెసిడెంటు నేషనల్ అసెంబ్లీ వాయిదా వేశానన్నాడు 2 వ సంప్రదింపులు విఫలమయ్యాయి. యాహ్యాఖాన్ కరాచీ వెళ్ళాడు. షేక్ ముజిబూర్ సర్వత్రా సమ్మె ప్రకటించారు పదివేల సైన్యం పశ్చిమ పాకిస్తాన్ నుండి దిగుమతి అయింది ఈ సైన్యం లంక మీదగా వచ్చింది దీనితో పాకిస్తాన్ సైన్యం బలం 70వేలైంది. ఆ రోజు యుద్ధం ప్రారంభమైంది సైనిక వాహనాలు, టాంకులు ఢక్కా పట్టణంలోకి పరుగులెత్తినవి అంతా చదును చేశాయి.

ఇంతకు తూర్పు బెంగాలు ప్రజల నేరం ఏమి? 1947 నుండి స్వేచ్ఛా ఎన్నికలు లేక నిరంకుశ పాలనను వ్యతిరేకంగా ప్రజాస్వామ్య ఉద్యమాలతో జాగరితం కావడం. ముస్లిమ్‌లీగుకు వ్యతిరేకంగా అవామీలీగు ప్రజల మన్ననలు బడయడం. ఉర్దూ-బెంగాల్ వివాదంగా ప్రజల ముందుంచి బెంగాలు త్రొక్కివేయ దలచినపుడు బంగ్లా భాషను అభిమానించడం, ప్రెసిడెంటు పదవి



నుండి అయూబ్ ఖాన్‌ను తొలగించి మిలటరీ నాయకులలో గుద్దులాట ఫలితంగా శ్రీ యాహ్యాఖాన్ ప్రెసిడెంటు పదవిని స్వీకరించి ప్రజల ఒత్తిడివల్ల ఎన్నికలను ప్రకటన చేయడంతో అవామీలీగు, అవామీ పార్టీలు విజయంసాధించడం, వారి విజయానికి కారణం అయిన ఎన్నికల ప్రణాళికను అమలు జరుపుటకు ప్రయత్నించడం, ఆ ఎన్నికల ప్రణాళికలో, ప్రజల ముందుంచిన తమ వాగ్దానాలు, ప్రజల తరఫున నేషనల్ అసెంబ్లీలో రాజ్యాంగ రూపం ఇవ్వాలని కోరడం, అందుకు రాజ్యాంగ రచనకు సంసిద్ధం కావడం – సంప్రదింపులు జరపడం–సంప్రదింపులలో యాహ్యాఖాన్‌తో కలసి మాటాడ్డం–తమకు ప్రజలిచ్చిన ఆజ్ఞను రాజ్యాంగంలో పొందుపరచవలెనని కోరడం, అందుకు యాహ్యాఖాన్, ముజిబూర్ రహమాన్ను పాకిస్తాన్ శతృవుగా ప్రకటించారు. వారి ఎన్నికల ప్రణాళిక వేర్పాటు ధోరణి అన్నారు. స్వాతంత్ర్యం బంగ్లాదేశ్ అవతరించాలన్న కోరిక వేర్పాటు ఉద్యమం ఎంతమాత్రం కాదని శ్రీ భషానీ, ఉద్ఘాటించారు. ఇంతకూ ఆ రాజ్యాంగ సూత్రాలు గమనించితే బోధపడుతుంది. ఆ ఆరు సూత్రాలు ఇవి.

అవామీలీగు రాజ్యాంగ సూత్రాలు :–1. 1940 లో ముస్లిమ్ లీగు లాహోరులో అంగీకరించిన ప్రాతిపదికపై ఫెడరల్ రాజ్యాంగం ఏర్పాటు చెయ్యాలి. ఆ నాటి తీర్మానం సారాంశం. భారతదేశం తూర్పుపశ్చిమాలలో అధిక సంఖ్యాకులుగా కలసి ఒకే చోటుగా ఉన్న ప్రాంతాలు రాజ్యాలుగా ఏర్పాటు చేయాలి. వాటిని స్వతంత్ర (ఇండిపెండెంటు) రాజ్యాలు చేయాలి. వాటికి స్వేచ్ఛా (అటానమీ) సార్వభౌమాధికారం (సావరినిటి) ఉండాలి. 2. ఫెడరల్ ప్రభుత్వంకు విదేశాంగ విధానం దేశరక్షణలు మాత్రమే ఉండాలి. 3. ప్రత్యేక ఆర్థిక విధానాలు, ద్రవ్య విధానాలు రాష్ట్ర పరమై వుండాలి. 4. ఫెడరల్ ప్రభుత్వానికి పన్నులు విధించే అధికారం ఉండకూడదు 5. విదేశవాణిజ్యంలో రాష్ట్రాలకు ప్రత్యేక పద్దుల క్రింద లెక్కలు ఉండాలి. 6 ప్రత్యేక సెమీ మిలటరీ (పారామిలటరీ) దళాలు ఉంచుకునే అధికారం తూర్పు బెంగాలుకు ఉండాలి.

వీటితోపాటు బ్యాంకులు, ఇన్సూరెన్సు జాతీయం చేయాలి బెంగాలి–ఉర్దు భాషలకు రెండింటికి సమాన హోదాఉండాలి శాసన సంస్థలలో, ఉద్యోగాలలో, సైన్యంలో, జనాభాదామాషాను బట్టి ప్రాతినిధ్యంఉండాలి. ఒడిదుడుకులు లేని స్థిరమైన విదేశాంగ విధానం భారతదేశంలో గల సంబంధాలలో నూతన పద్ధతులలో సమగ్రమగు నూతన విధానం న్యూ ఓరియంటేషన్ అమలు జరగాలి.

నిజంగా ఆలోచిస్తే–భారత పాకిస్తాన్–రాజ్యాంగపరిణామాలు 1940 నుండి పరిశీలన చేస్తే 1940 లో లాహోర్‌లో ముస్లిమ్‌లీగు చేసిన పై తీర్మానం కాంగ్రెసు చేసిన 1942 ఆగష్టు బొంబాయి క్విట్ ఇండియా తీర్మానంలోని రాష్ట్రాలలో రిసిడ్యుయరీ అధికారాలు వుండి ఎక్కువ స్వాతంత్ర్యం (అటానమీ) రాష్ట్రాలకు ఉంటే ఫెడరేషన్స్ కోరుతున్నామన్నది గాని అటుతరువాత 1946 ఎన్నికల ప్రణాళికల్లో ఫెడరేషన్లు ఉండే భాగాలను (అటానమీ) స్వేచ్ఛ ఉండాలన్నది కానీ 1946 కాబినెటు మిషను వారి సూచనలలో విదేశాంగ విధానం దేశరక్షణ రహదారులు కేంద్రానికి ఉండవలెనన్నది గాని గమనిస్తే మరి అవామీలీగు తూర్పు బంగ్లా ప్రజలు కోరిన కోర్కె వేర్పాటు అని ఎవరైనా అనగలరా? నిజమే. కేంద్రీకృత గుప్తాధికారంలో నియంతృత్వ పాలన సాగించిన మిలటరీ నాయకులకు ఆ విధంగానే ఉంటుంది. ఇది ద్రోహం అవుతుంది. అందుకు వారు చెల్లించిన విలువ పది లక్షల ప్రాణాలు సర్వనాశనం. 20 సంవత్సరాల పోరాటం అంటున్నారు మేం కాకపోయినా మా బిడ్డలైనా స్వాతంత్ర్యం అనుభవిస్తారు కదా! అంటున్నారు.

వీర యోధులుగా మార్చి 25 నుండి నిరంతరం పోరాటం సాగిస్తూ చివరకు ఎప్రిల్ 17 వ తేదీ "బంగాలు దేశ్" ను సర్వ సత్తాక ప్రజాస్వామిక రిపబ్లిక్‌గా దాని అధ్యక్షుడు శ్రీ షేక్‌ముజిబూర్ రహమాన్ తరఫున దాని తాత్కాలిక అధ్యక్షులు శ్రీ సయ్యద్ నజూర్ ఇస్లాం, కుస్తియా జిల్లాలోని మెహర్‌పూర్ సబ్ డివిజనులోని వైద్యనాథతల వద్ద మామిడిచెట్ల నీడలో పవిత్ర పరిసరాల మధ్యలో ప్రకటించారు. "నా బంగారు బంగ్లా దేశమా, నిన్ను ప్రేమిస్తున్నాను." అనే గీతంతో ప్రారంభించారు. ప్రధాన మంత్రి శ్రీ తాజుద్దీన్ అహమ్మద్ బంగాలీ ప్రజలను చంపే యత్నంతో పాకిస్తాన్ గోరీ కట్టుకున్నదన్నారు. ప్లాసీ యుద్ధంలో 1757 లో సురాజుద్దౌలా నుండి బంగ్లాదేశం స్వాతంత్ర్యం కోల్పోయింది. ఆ నాడు ఒక మామిడి తోపులోనేనని యీ నాడు ఆ జిల్లాలోనే మరో మామిడి తోటలో స్వతంత్ర బంగ్లాదేశ్ ప్రభుత్వం స్థాపింపబడిందని తాత్కాలిక అధ్యక్షుడు ప్రపంచ పత్రికా రచయిత సమక్షంలో ప్రకటించారు. బంగ్లాదేశం యుద్ధంలోనే ఉన్నది. పశ్చిమ పాకిస్తాన్ వలసదోపిడీ నుండి స్వయం నిర్ణయాధికారం సాధించడానికి మరోమార్గం లేకపోయింది అన్నారు. మామిడి తోటకు 'ముజిబుర్ నగర్' అని నామకరణం చేశారు. ప్రొఫెసర్ యం. యుసఫ్ ఆలీ మార్చి 26, 1971 న ప్రథమంగా చేయబడిన స్వాతంత్ర్య ప్రకటనను పునరుద్ఘాటించారు. కార్యక్రమమంతా స్వచ్ఛమైన బెంగాలీ భాషలో జరిగింది.

జాతీయ అవామీ పార్టీ నాయకుడు మౌలానా అబ్దుల్ హమద్ భషాని స్వాతంత్ర బంగ్లా అవతరించాలన్న కోరిక వేర్పాటు ఉద్యమం ఎంతమాత్రం కాదని, పశ్చిమ పాకిస్తాన్ స్వప్రయోజకులు జరిపిన పచ్చిదురాక్రమణకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటమని వ్రాశారు. భారత ప్రజలకొరకు లేఖ వ్రాస్తూ అందులో వారింకా ఈ విధంగా వివరించారు. పాక్‌సైనికాధికారులు నిరాయుధులు, నిస్సహాయులైన వేలాది బంగ్లా ప్రజలపైన – ప్రొఫెసర్లు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, కార్మికులు, కర్షకులు, జాతీయ అసెంబ్లీ సభ్యులు, మేధావులు, ముస్లిములు క్రైస్తవులు, హిందువులు, స్త్రీలు, బాలబాలురు, వృద్ధులు–వీరు వారని విచక్షణ లేకుండా అందరిపైన రాత్రింబగళ్ళు అన్నిరకాల మారణాయుధాలు ఉపయోగించి మూక ఉమ్మడి హత్యాకాండ సాగిస్తున్నారని, భవనాలను, రోడ్లను, ఇళ్ళను ధ్వంసం చేస్తున్నారని ఇంతటి కిరాతకము ఎక్కడా ఉండదని పేర్కొన్నారు. పోరాటం అనేది

ఇప్పుడు బంగ్లాదేశ ప్రజల జీవితంలో విడదీయరాని భాగమై పోయిందని. బెంగాలు ప్రజలపై పాశవిక శక్తులు, స్వప్రయోజన శక్తులు విలయ తాండవం చేస్తున్నదని తేలిపోతున్నది.

తమ ప్రభుత్వాన్ని గుర్తించవలసిందిగా వివిధ దేశాలను అభ్యర్థించారు. ఈ ప్రభుత్వాన్ని నాలుగు దేశాలు గుర్తించినవి. బంగ్లాదేశ్ ప్రభుత్వం ప్రకటించింది. భారత పార్లమెంటు జరుగుతున్న అన్యాయాలకు ఆవేదన తెలియజేస్తూ తీర్మానించింది. అమెరికా ప్రభుత్వం డోలాయమానంలో పడింది. సోవియట్ యూనియన్, పాకిస్తాన్ అఘాయిత్యాలను ఖండించుతూ ఆపు చేయవలసిందిగా కోరింది. దానికి జవాబుగా ఇండియా జోక్యాన్ని నివారించవలసినదిగా జోక్యం కలిగించుకోమని పాకిస్తాన్ ప్రభుత్వం సోవియట్ ప్రభుత్వాన్ని కోరింది. చైనా ప్రభుత్వం యిందులో ఇండియా జోక్యం కలిగించుకుంటే ఊరుకోమని హెచ్చరించింది. ప్రపంచ ప్రజానీకం అనేక ప్రభుత్వాలు ఈ మారణ హోమంకు ఆహుతి అవుతున్న బంగ్లాప్రజల యెడ ప్రగాఢంగా సానుభూతి వెలిబుచ్చుతున్నవి. భారతదేశం పార్టీవిభేదాలు లేకుండా ప్రగాఢ అనుబంధాన్ని ప్రకటించింది. ఇదీబంగ్లాదేశ్ వీరగాథ. బంగ్లాప్రజలు దృఢవిశ్వాసం, భవిష్యత్తు ప్రపంచప్రజలపై ధర్మంపై తమ దేశభక్తిపై అకుంఠిత విశ్వాసంతో వీరసమరం సాగిస్తున్నారు. ఈనివిజయాన్ని ప్రతిస్వాతంత్ర్యవాది ప్రతి మానవతావాది అభ్యుదయ కాముడు అభిలషించాలి సాధించాలి.

ఇప్పటికి దాదాపు 10 లక్షల మంది చనిపోయారు 80 లక్షల మంది కాందిశీకులుగా భారత దేశం చేరారు. ఈ ప్రభుత్వం మీద-ప్రజల మీద సానుభూతి చూపడంతప్ప గుర్తించిన ప్రభుత్వం లేకపోవడం విషాదకర విషయం. అమెరికా కాందిశీకుల సహాయానికి నిధులు యిస్తున్నది; యాహ్యాఖాన్‌కు ఆయుధాలుపంపుచున్నది. అమెరికా ప్రజలు తిరస్కరించినా నిక్సన్ ప్రభుత్వం పొరపాటుఅంటూ ఆయుధాలు పంపుతున్నది ప్రజాచైనా భారత దేశంమీద నిప్పులు కక్కుతున్నది. ప్రపంచ ప్రజలు ఈ మారణ హోమం నుండి బయట పడేందుకు ఆశలు చూస్తున్నారేగాని ఆచరణకు రావడంలేదు.

యాహ్యాఖాన్ నేషనల్ అసెంబ్లీ నిర్ణయించవలసిన రాజ్యాంగ రచనకు ప్రవీణుల సంఘం వేశానంటున్నాడు. ఇండియా యిప్పటికి కాందిశీకులపైనా 80 కోట్లవరకు ఖర్చుచేసింది.కాని ప్రభుత్వాన్ని గుర్తించటానికి వెనుకంజవేస్తున్నది. బంగ్లా ప్రజలు గెరిల్లా యుద్ధాలు సాగిస్తున్నారు. ఇంకవరకు నిలువడమేకాదు. విజయం సాధించడంలో విశ్వాసంతో ముందుకు సాగారు. ప్రపంచ ప్రజలు, ప్రభుత్వాలు ఈ ప్రజా విప్లవాన్ని విజయవంతంగా ముగిసేందుకు ముందుకు సాగాలి. (సమాప్తం)

# పాకిస్తాన్ పాలకుల అమానుష కృత్యాలు

## ఆంధ్ర ప్రదేశ్ శాసన మండలి నిరసన

**( బంగ్లా దేశ్‌లో పాకిస్తాన్ పాలకులు అనుసరిస్తున్న దమన నీతిని ఖండిస్తూ, బంగ్లాదేశ్ స్వాతంత్ర్య వీరులకు హృదయపూర్వకమైన మద్దతు ప్రకటిస్తూ ఆంధ్ర ప్రదేశ్ శాసన మండలి ఆగస్టు 31 వ తేదీన ఆమోదించిన తీర్మానం పూర్తిపాఠం )**

యాహ్యాఖాన్ సైనిక ప్రభుత్వం స్వాతంత్ర్య, శాంతి కాముకులైన బంగ్లాదేశ్ ప్రజల మీద జరుపుతున్న పాశవికమైన, అమానుషమైన దండయాత్రనూ, ప్రజలపై రుద్దిన రాక్షస పరిపాలననూ, అనుసరిస్తున్న జన హత్యాకాండ విధానాన్నీ యీ సభవారు ఖండిస్తున్నారు.

స్వాతంత్ర్యం, అభ్యుదయాలకై ప్రాణ త్యాగం చేసిన అసంఖ్యాకులైన బంగ్లాదేశ్ అమర వీరులకు ఈ సభవారు శ్రద్ధాంజలి ఘటిస్తున్నారు.

రకరకాల దమన నీతి విధానాలను వీరోచితంగా ఎదుర్కొంటున్న స్వాతంత్ర్య యోధులకూ, వారి నాయకుడు " బంగబంధు " కూ ఈ సభవారు జోహారులు అర్పిస్తున్నారు. " బంగబంధు" షేక్‌ముజీబుర్‌రహ్మాన్‌పై సైనికాధికారులు జరుపుతున్న రహస్య కపట విచారణను ఖండిస్తూ, వెంటనే 'బంగ బంధు' విడుదల సాధించాలనీ, బంగ్లాదేశ్ ప్రజలు ప్రకటించిన ఆశయాల కనుగుణంగా ఒక రాజకీయ పరిష్కార సాధనకు మార్గాన్ని సుగమ చేయాలనీ ప్రపంచ దేశాలన్నిటికీ యీ సభవారు విజ్ఞప్తి చేస్తున్నారు.

బంగ్లాదేశ్ వీర ప్రజలకు అండగా, వారి న్యాయ సమ్మతమైన పోరాటానికి మద్దతుగా నిలబడాలనీ, బంగ్లాదేశ్ గుర్తింపు విషయం ఆలోచించడంతోసహా అవసరమైన చర్యలన్నీ తీసుకోవాలనీ, భారతప్రభుత్వానికి ఈ సభవారు విజ్ఞప్తి చేస్తున్నారు.

ఏడున్నరకోట్ల బంగ్లాదేశ్ ప్రజల చరిత్రాత్మకమైన తిరుగుబాటు జయిస్తుందనే విషయంలో ఈ సభ వారు తమ ప్రగాఢ విశ్వాసాన్ని ప్రకటిస్తున్నారు.

బంగ్లాదేశ్ ప్రజల పోరాటానికీ వారి త్యాగానికీ ఆంధ్రప్రదేశ్ ప్రజల హృదయపూర్వకమైన సానుభూతి, మద్దతూ ఉండగలదని ఈ సభ వారు హామీ యిస్తున్నారు.

చిన్న కథ :

# ఆశాజీవులు

—కుమారి పద్మజా చౌధరి జెట్టి

" అన్నా: నీకు పోస్టు వచ్చింది.'' కవరు తెచ్చి యిచ్చింది సునీత.

కవరు చింపి చదువుకున్నాడు మధు అతని ముఖం ఆనందంలో వికసిత పద్మం అయ్యింది. రెండు సంవత్సరములుగా ఆశ్రయించుకున్న నిరాశ, నిస్పృహల స్థానంలో సంతోష రేఖలు చోటుచేసుకున్నాయి అతని కళ్ళలో

" హఠాత్తుగా అన్నకు ఆనందం యెందుకో ? " ఆలోచనలోనే వుంది సునీత.

'' అమ్మా! నాకు ఉద్యోగం వచ్చింది. '' పట్టరాని సంతోషంతో పెద్దగా అరిచాడు మధు. అర నిమిషంలో అమ్మ, తమ్ముళ్ళు, రాధిక తన చుట్టూచేరారు.

" ఇన్నాళ్ళకు ఆ యేడు కొండలవాడికి దయ కలిగింది నాయనా ? అంతా ఆయన చలవే. " సర్వాంతర్యామి భగవంతుడికి నమస్కరిస్తూ అంది సావిత్రి.

" అన్నయ్య ! నాకు క్రొత్త ఫ్రాక్ కొనిపెట్టవూ ? గారాబంగా అడిగింది, రాధిక, యెప్పుడో అన్న చెప్పిన కబుర్లు గుర్తుకు తెచ్చుకుని.

'' ఆలాగే నమ్మా ! '' మధు ప్రేమగా అన్నాడు.

'' నేను పి యు. సి. ప్రైవేటుగా వ్రాస్తా నన్నయ్యా! సెకండ్ టర్మ్ ఫీజు కట్టలేక మానివేసిన పెద్ద తమ్ముడు ఆశగా అడిగాడు '' అవును, ప్రైవేటుగా వ్రాయి, అవసరం అనుకుంటే ట్యుటోరియల్ కాలేజికి వెళ్తూండు. ''

అప్పుడే చినిగి పోయిన తన వోణీ వంక దీనంగా చూసుకుంది సునీత.

'' పిచ్చిది కొంచెం పెద్దదయ్యే టప్పటికి, చీర కావాలని నోరుతెరచి అడగలేక పోతూంది, '' అనుకున్నాడు మధు.

రెండు సంవత్సరాలుగా జరుపుకోని పండుగ ఆ రోజు వాళ్ళంతా జరుపుకున్నారు.

* * * *

జీతం జేబులో వేసుకొని బయలు దేరాడు మధు. ఆఫీసులో నుంచి అడుగు క్రింద పెట్టగానే, తళ తళ లాడే బట్టలతో వెళ్తూన్న యిద్దరు ఆడపిల్లలు కనిపించారు. వెంటనే అతని దృష్టికి చినిగిపోయిన వోణీ వైపు చూచు కుంటున్న సునీత తోచింది. అందరికీ బట్టలు కొనాలనుకుని నేరుగా బట్టల షాపుకు వెళ్ళాడు. అందరికీ క్రొత్త బట్టలు తీసికుని, యింటికి కావాల్సిన సామానంతా తీసికుని రిక్షా కోసం నిలబడ్డాడు.

" అయ్యా ! బాబూ! ధర్మం సెయ్యండి బాబూ! రెండు రోజుల నుండి తిండి లేదు బాబూ!'' వొక కాలు కుంటిదైన బిక్షగాడు జాలిగా, ఆశగా ప్రార్థిస్తున్నాడు। అతని వెనుకే కుంటి చెయ్యి చెల్లెలు " ఓ అన్నా ! నీ అనురాగం" పాట కమ్మగా పాడూతుంది.

వాళ్ళ యిద్దరినీ మార్చి మార్చి చూశాడు మధు ఒకరికి కాలు లేదు. యింకొకరికి చెయ్యి లేదు. కష్టపడి కడుపు నింపుకునే శక్తి గూడా భగవంతుడు యివ్వలేదు.

చినిగిన వోణీ కనపడకుండా చేయాలనే సునీత కళ్ళ ముందు కదలాడుతుంది. '' ఎవరైనా వొక గుమస్తా అయినా సునీతను పెళ్ళి చేసికోగూడదూ! చక్కని చుక్క" కట్నం యివ్వలేని మధు ఆలోచిస్తున్నాడు.

"నా చెల్లెలుకు కూడా తిండిలేదు బాబూ? ఆడకూతుర్నికూడా యెండబెడ్తున్నాను బాబూ ! కాస్తా ధర్మం చేసి పుణ్యం కట్టుకోండి బాబూ !" అడుగుచున్నాడు కుంటివాడు.

" సంపాదించలేదు, చెల్లెలు కడుపునిండడానికి. ఎవరో యిస్తే చెల్లెలు కడుపు నిండితే ఆనందిస్తాడు" అనుకున్నాడు మధు.

'' అవును! యిద్దరం వొకే కోవకు చెందిన వాళ్ళమే. చెల్లాయి కడుపు నిండితే చాలనుకుంటాడు అవిటివాడు. మరి నేను? చెల్లాయిని వొకడెవరైనా పెళ్ళిచేసికుంటే బాగుండుననుకుంటాను.'' తనను యెదుటి భిక్షగాడితో పోల్చి చూచుకుంటున్నాడు.

" తను సంపాదించలేకపోయినా చెల్లెలు కడుపు నిండాలనుకోవటంలో తప్పేం లేదు. అది మానవులకు సహజం. తను అసమర్థుడైనా తనవాళ్లు యెలాగో వోలా హాయిగా వుండాలనుకుంటాడు. '' సమర్థించుకున్నాడు. '' బాబూ!" జాలిగా ప్రార్థిస్తున్నాడు పంగువు.

జేబులో చెయ్యి పెట్టాడు

రెండు రూపాయలున్నాయి. వాని వంకే ఆశగా చూస్తున్నాడు భిక్షగాడు. వానిపై పే రెప్పవేయకుండా చూస్తుంది వాడి చెల్లెలు.

రెండు రూపాయలు తనకుఎంతో విలువైనవి ఎన్నాళ్ళుగానో చూద్దామని వీలుపడక వూరుకున్న సునీత సినిమా చూడవచ్చు: రాధికకు రింగ్ కొనవచ్చును. ఆ రెండు రూపాయలూ తన ఆత్మీయుల కోరికలు తీర్చి తనను ఆనందపరుస్తాయి. వాటికోసమై తను తల బ్రద్దలు కొట్టుకుంటున్నాడు. ఆఫీసుకు వెళ్ళి ఫైళ్ళలో తల దూర్చాడు ఆ రూపాయలే సాటి మానవునికి ప్రాణాలతోసమానము.

మధు చేతులు అప్రయత్నంగా ముందుకు వెళ్ళాయి. జరుగనిది జరిగినట్లుగా, దేముడు దిగొచ్చి వరాలిచ్చినట్లుగా, సంబరంగా చేతులు చాపాడా భిక్షగాడు. భిక్షగాడి చేతిలో నోట్లుంచి సామానంతా భుజాన వేసికుని యింటి ముఖం పట్టాడు మధు. రిక్షాకు డబ్బు లేక.

చెట్టు క్రింద కూర్చుని చేతికి రెండు రూపాయలు చూపిస్తూ చెల్లెలుకు కబుర్లు చెప్తున్నాడు భిక్షగాడు. అన్నా చెల్లెళ్ళకు రూపాయలు చూడగానే కడుపులు నిండాయి.

''చెల్లెమ్మ! యన్భై పైసలు సిన్మాకు, యిరవై పైసలు నీకు పూలు. మిగ్తా రూపాయి లాటరీ టిక్కట్టు. నువ్వు అదృష్ట జాతకురాలివే. లేకపోతే ఆ రెండు రూపాయిలు రావటమేంటే మనకు? నీ పేరుతో మనకు లాటరీ వస్తుంది.''

ఆశ పడటం కలలు కనటం మానవనైజం.

'' నువ్విక్కడ కూకోవే, నేనిప్పుడే వస్తాను. ఆడెవరో దొరలొచ్చిండు. ఆళ్ళకాడ అడుక్కువస్తా. ఈపూటకు కడుపులు నిండుతాయి. '' యెదురుగా వున్న పెద్ద హోటల్ వైపుకు కష్టసాయంతో పరుగులు తీశాడు. అప్పుడే కారులో నుంచి నలుగురైదుగురు దిగి హోటల్ వైపుకు వెళుతున్నారు. టెర్లిన్ సూట్లు ధరించిన పెద్దమనుష్యులు.

"బాబు! ధర్మం సెయ్యండయ్యా! నాలుగు రోజులనుండి తిండిలేక ఆడకూతురు కూడా పడుంది. మీ పేర్ చెప్పుకు బ్రతుకుతాం." జాలిగా ప్రార్థించాడు.

పోవోయ్ పో, వెధవ న్యూసెన్సు. అసలు యిటువంటి వాళ్ళను షూట్ చేస్తే ప్రభుత్వానికి, ప్రజలకూ హాయి." విసురుగా వెళ్ళారందరూ.

నిరాశతో అక్కడే జారిగిలబడ్డాడు భిక్షగాడు.

ఎవ్వరైనా ధర్మం చెయ్యకపోతారా అని ఆశ.

మానవుడెప్పుడూ ఆశాజీవేగా మరి! చేతిలోవున్న రూపాయితో తనకు పెద్ద అదృష్టం పట్టబోతూంది. కలను కళ్ళముందు సృష్టించుకుని ఆ పూట కడుపు నింపుకోవటానికి యెవ్వరైనా ధర్మం చెయ్యకపోతారా? అని యెదురు చూస్తున్నాడు.

లోపలనుంచీ సర్వర్ విస్తళ్లూ అన్నితెచ్చి డస్ట్ బిన్‌లో వేస్తున్నాడు. పూర్తిగా తినకుండా మిగిల్చివేసిన స్వీట్సు వున్నాయి. భోజనం వుంది. కడుపుకాలేవాళ్ళ ఆకలి తెలియకుండా కడుపు పగిలిందాక తిన్నవాళ్ళ పని యిది డబ్బు విలువ తెలియక జల్సా అని మజా అని బూడిదలో పోసేవాళ్ళ పని యిది. బీదాబిక్కీ యాచిస్తే పైసా యివ్వనివాళ్ళ పని యిది. జాలియెండిన వాళ్ళ పని యిది. మదంనిండిన వాళ్ళ పని యిది పెద్ద పెద్ద సంస్థల పేరుచెప్పి వేలకువేలు దానంచేసి ప్రతిఫలంగా "అపరకర్ణాది" బిరుదులు గ్రహించి, వాళ్ళ పలుకుబడిని, గౌరవాదుల్నీ అధికం చేసికునే వాళ్ళ పని యిది. మరి భిక్షగాడికి పైసాయిస్తే వచ్చేదేంటి? మానవత చీకటి బురదలో దిగబడినప్పుడు జవాబు అందదు. మధులాంటి కొందరివల్ల తీరే సమస్యా యీ ఆకలి?

ఆశగా డస్ట్‌బిన్ వైపు అడుగులు వేశాడు కుంటివాడు. ఆలశ్యం అయితే కుక్కలు చేరుతాయి. కర్రతో నడుస్తున్నాడు. వీలైనంత త్వరగా వెళ్ళాలి. లారీవాడు కొడ్తున్న హారన్ మోత వినిపించలేదు. "ఆ పదార్థాలు తీసుకురావాలి. చెల్లాయికి పెట్టాలి." సడెన్ బ్రేకుతో లారీ ఆగిపోయింది.

రక్తంమడుగులో కుంటివాడు......చెల్లెలు కడుపు నింపటం కోసం ప్రాణాలు కోల్పోయిన కుంటివాడు బిగపట్టిన గుప్పిలి విడివడింది. చేతిలో రూపాయలు రక్తంలో జలకాలాడుతున్నాయి.

ఒక జీవి జీవన సర్వస్వం రాలిపోయింది.

అనేక కోరికలు తీర్చి ఆనందపరిచే రెండు రూపాయలు యెర్రగా చూస్తున్నాయి చుట్టూమూగిన మనుష్యుల వంక...... మానవత్వం, మమతలూ మర్చిపోయిన మనుష్యుల వంక.

# మహానంది పుణ్య క్షేత్రము

గునుపాటి భోగీశ్వరం

జగద్విఖ్యాతములై వెలయునట్టి మహాపుణ్య క్షేత్రములు మన ఆంధ్రప్రదేశములో అనేకములున్నవి. అట్టివానిలో అతి ప్రాచీనమైన పరమ పవిత్ర శైవక్షేత్రము మహానంది పుణ్య క్షేత్రము. మహానంది క్షేత్రము కర్నూలు జిల్లాలో నంద్యాల పట్టణమునకు పదిమైళ్ళ దూరములో వెలసియున్నది. ఈ పుణ్య క్షేత్రము నల్లమల కొండలమధ్య నుండుటచే చల్లగానుంటుంది. సహజ నిత్యకళ్యాణకారియై ఒప్పుచున్న మహానంది క్షేత్రమునకు చుట్టుప్రక్కలా అరణ్య ప్రాంతమగుటచే కళకళలాడే ఫలవృక్షాలతో ప్రకృతి సౌందర్యం చూపరులకు కనుల పండువుగావుంటుంది. దివ్య ప్రకృతినీ, భగవంతుడినీ దర్శించి సేవించడంవల్ల చిత్త మాలిన్యం క్షాళితం కావడమే కాకుండా హృదయనైర్మల్యం చేకూరి మనస్సుకు ఈశ్వర సాక్షాత్కారయోగ్యత ప్రసాదిస్తుంది.

ప్రశాంత ఆహ్లాదకర వాతావరణంతో ప్రకృతి దృశ్యాల మధ్య అలరారుతున్న మహానంది పుణ్యక్షేత్రమును దర్శించుటకు యాత్రికులు ప్రతి శివరాత్రికి వేల సంఖ్యలో వస్తుంటారు. శిల్ప శోభా సమన్వితమైన ఈ దేవాలయ నిర్మాణం హృద్యం. దివ్య శిల్ప ప్రాభవాన్ని, శాస్త్రనైపుణిని వేనోళ్ల చాటుచున్నదీ క్షేత్రం.



## పురాణ గాథలు

శిలాదుడనే మునీశ్వరుడు భార్య కోరిన రీతిగా ఈ ప్రదేశము నందు శంకరుని గురించి తపస్సు చేశాడట. సంతాన



ప్రాప్తికై శిలాదుడీ తపస్సు చేశాడు. అతని తపోభక్తికి మెచ్చి శివుడు సాక్షాత్కరించి వరము కోరుకొనుమనినాడు. శిలాదుడు పరమేశ్వర సాక్షాత్కారముతో కలిగిన ఆనందములో తన భార్య కోరికనే విస్మరించాడు. అంత శంకరుడే వల్మీక రూపము ధరించగా అందుండి ఒక మగ శిశువు ఉద్భవించాడు. ఆ బాలుడే పరమేశ్వరుడని ఆ పుట్ట ఉన్న ప్రాంతములో శివుడు వెలసినాడని పురాణ విదితము.

ఆ బాలుడు వల్మీకమునందే నివసించుచూ శివుని గూర్చి తపస్సు చేయుచుండెను. ఆ కాలములో ఆ ప్రదేశాన్ని పాలించుచున్న నందమహా రాజుగారి పశువుల మందలలో ఒక ఆవు ప్రతి దినమూ పుట్ట వద్దకు వెళ్లి బాలునికి పాలిచ్చుచుండెడిది. ఈ సంఘటన చూచిన పశువులకాపరి ఈ వృత్తాంతమంతయూ నంద మహారాజుకు విన్నవించాడు. రాజు ఆ ప్రాంతమునకు వెళ్ళి వింతనంతయు తిలకించి పుట్ట చెంతకురాగా, ఆవు బెదరిపోయి పరిగెత్తుచుండగా ఆవు కాలిగిట్ట బాలుని శిరస్సుపైపడి రంధ్రమేర్పడి శివలింగముగా మారిపోయెనట. ఈ శివలింగమే నేటి క్షేత్రమునగల ఈశ్వరుడు. ఆ బాలకుడు లింగరూపధారి యగుటకు ముందు పరమేశ్వరుని వాహనముగా నుండునట్లు కోరెను. కావున ఈశ్వరుడు నందునిపేర ఇచట వెలసినాడు. ఆ పరమేశ్వరుడే ఇచటిన నందీశ్వరుడని పురాణ గాథ.

## పంచ తీర్థములు

మహానంది పుణ్యక్షేత్రమున పంచతీర్థములు గలవు. ఇచటి పుష్కరిణిలో శ్రీశైల తీర్థము, నృసింహ తీర్థము, కాశీ తీర్థము, నందితీర్థము, దేవద్రోణ తీర్థము — పంచతీర్థములు కలియుటచే దీనిని పంచధార తీర్థమని వ్యవహరిస్తుంటారు. అంతేగాక పంచ తీర్థముల గుర్తింపుకుగాను ఆ పుష్కరిణి మధ్యలో పంచలింగములు ప్రతిష్ఠించబడియున్నవి. నంది నోటినుండి నీరు వచ్చుచున్నట్లు ఏర్పాటు చేసియున్న ఈ పుష్కరిణి దృశ్యము తిలకించదగినదే కాని వర్ణించనలవికాదు. ఇందలి జలముతోనే స్వామివారికి అభిషేక మొనర్తురు.

## నవ నందులు

మహానంది క్షేత్రమున తొమ్మిది నందులున్నవి. అవి ప్రథమనంది, నాగనంది, వినాయకనంది, గరుడనంది, శివనంది, మహానంది, సూర్యనంది, విష్ణునంది, సోమనంది అని వ్యవహరించబడతాయి. ఈ నందుల ఆలయాలన్నీ ఒకదాని సమీపంలో మరొకటి పదిహేను మైళ్ళ లోపుననే ఉన్నాయి. నందుల ఆలయము లున్నందువలన "నంద్యాల" పట్టణ మేర్పడినదని ఊహించ వచ్చును.

## చారిత్రిక ప్రాముఖ్యము

ఈ ఆలయము పదుకొండవ శతాబ్దినాటి కాలములో నిర్మించి యుండవచ్చునని చరిత్రకారులు ఊహించుచున్నారు. ఆలయము ముందున్న శాసనములనుబట్టి నరసింహ దేవరాయలు ఈ ఆలయము



నందలి నందీశ్వరునికి అనేక కానుకలిచ్చినట్లు తెలియుచున్నది. ఆలయ ముఖద్వారము పశ్చిమదిశగా నుండుటచే విగ్రహ ప్రతిష్ఠ మునిచేతనే జరిగియుండవచ్చునని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఆలయ గోపురాదులు జైనదేవాలయ శిఖరాలను పోలియుండుటచే ఉత్తర భారతమునుండి వచ్చిన శిల్పులే ఈ ఆలయ నిర్మాత అని ఊహించబడుచున్నది.

నయన మోహనమైన శిలాశిల్పసంపదలను తిలకించి తన్మయ హృదయులయ్యే నిమిత్తం, నందీశ్వరుని అనుగ్రహం పొందే నిమిత్తం యాత్రీకులు తప్పక దర్శించదగ ప్రదేశం మహానంది క్షేత్రం.




## జీవన సంధ్యలు

( నాటిక )

రచన : స్వర్ణరాజు హనుమంతరావు

వెల : రు. 1.50

ప్రతులకు : డా. ఎస్. ఆర్. సంగమేశ్వరరావు, కృష్ణలంక, విజయవాడ—2, లేక రచయిత పేర, భాస్కరపురం, మచిలీపట్టణం.

**పంచాయతీ** ప్రసిడెంటుగా ఉంటున్న ఒక డాక్టరు తన భార్య వసంత పతిత అయిందని తెలుసుకొని ఆమెకు విషమిచ్చి చంపడానికి పూనుకుంటాడు. వసంత పతనానికి కారణం పంచాయతీ మెంబర్లైన పాపయ్య, దాసు, అనే వారి పన్నాగాలతో ఆమె మనస్సు పాడుచెయ్యడం వల్ల. ఆమె నైతికంగా పతనమైపోయి శీలాన్ని కూడా చెడగొట్టుకుందని నాటిక మధ్యలో రంగయ్యచేత చెప్పించబడింది. ఇవన్నీ ముందు జరిగిపోయిన సంఘటనలు.

తనుచేసిన ఘోరకృత్యానికి డాక్టరు మానసిక సంఘర్షణతో నాటిక ప్రారంభమౌతుంది. ఒకవంక భార్యమీద పగతోనూ, ఇంకోవైపు ఇంకేం చెయ్యాలో తెలియని పరిస్థితిలోనూ, డాక్టరు సతమతమౌతుంటాడు. పాపయ్య, దాసు, అనే పంచాయతీ మెంబర్లు యింట్లోతిని, ఇంటివాసాలు లెక్కపెట్టే రకాలుగానూ మేకవన్నె పులులు, తేనెపూసిన కత్తులుగానూ ప్రేక్షకులకు పరిచయం చెయ్యబడతారు. అంతేకాదు, ఇతరుల ఆడవాళ్ళు పతితలని ఊరంతా దుష్ప్రచారం చెయ్యడమే వీళ్ళ పనిగా చెప్పబడుతుంది. నాగభూషణం భార్య బంగారక్క గురించి వీరు అదే ప్రచారం చేసారు. డాక్టరు భార్య వసంతను కూడా వీళ్ళు మాయమాటలతో పతితను చేసారు. అసలు డాక్టరుమీద గాని నాగభూషణంమీద గాని వీళ్ళకున్న ద్వేషం, విరోధం, ఎందుకో తెలియదు. అందువల్ల వాళ్ళ చర్యలన్నీ " Motiveless Malignity "గా కనిపిస్తాయ్ ప్రేక్షకులకి.

రంగన్న పాత్రకు చాలా ప్రాముఖ్యం యివ్వబడింది. అతను చివరవరకూ డాక్టర్ నౌకరుగానే కనిపిస్తాడు. కాని అతను డాక్టరు కంటే ఎక్కువ చదువూ, సంస్కారం ఉన్న వ్యక్తిలా మాట్లాడతాడు; ప్రవర్తిస్తాడు. అతని సంభాషణలు మాత్రం ఉత్తమ పాత్రకు చెందినవి. దీన్ని సమర్థించడంకోసం కాబోలు రచయిత ఒకే ఒక్కచోట [47వ పేజీలో] రంగన్న ఉద్యోగం ఏం చేసినా డాక్టరు తండ్రిగారికి ఆంతరంగిక సహచరుడనీ, డాక్టరుకు ఆంతరంగిక అనుచరుడనీ చెప్పిస్తాడు. అదే రంగన్నను డాక్టరు "ఇంతవరకు విశ్వాసంగల ఇంటి నౌకరువవని వదిలేశాను" అంటాడు: [34వ పేజీ]. రంగన్నకూడా " యీ యింటి నౌకరుగా చేయవలసిన పని మరొకటి ఉంది. అదికూడా చేసేసి వెళతాను బాబూ " అంటాడు [36వ పేజీ]. నౌకరు పాత్రను అంత సంస్కారవంతుడిగా చిత్రించడానికి తగిన ఆధారం నాటకంలో లేదు

డాక్టరు ఇచ్చిన slow poison వల్ల వసంత చావదు. కాని చివరి ఘట్టంలో చనిపోడానికి నిద్రమాత్రలు మ్రింగి ప్రవేశిస్తుంది. ఆమె అంతవరకూ బ్రతికి ఉండడం డాక్టరుకు ఏ శిక్ష పడకుండా కాపాడ్డానికని సూచించబడుతుంది. కాని ఆత్మహత్యా ప్రయత్నంకంటే హత్యాప్రయత్నం ఇంకా పెద్దనేరం. హత్యచెయ్యడానికి ప్రయత్నించబడ్డ వ్యక్తి బ్రతికి ఉన్నాసరే హత్యాప్రయత్నం నేరమే. అందువల్ల వసంత మళ్ళీ రావడం, నిద్రమాత్రలు మింగి చచ్చిపోవడంలో సరియైన లక్ష్యం కనిపించదు. పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న డాక్టరు వసంత కనిపించగానే పతిత అయిన ఆమెను క్షమించి, మళ్ళీ చేరదీయడానికి ప్రయత్నించే సమయంలో, డాక్టరులో యీ మార్పు వస్తుందని ఊహించలేక ముందుగానే నిద్రమాత్రలు మ్రింగివచ్చిన వసంత డాక్టరు చేతుల్లోనే ప్రాణాలు విడిస్తే అటు డాక్టరు సంస్కారం దృష్ట్యా, నాటకీయత దృష్ట్యా యింకా బాగుండేదేమో అనిపిస్తుంది

కథావస్తువులో కొన్ని లోపాలున్నప్పటికీ నాటకీకరణ చాలా బాగుంది. సంభాషణలు పాత్రోచితంగా ఉన్నాయ్. అక్కడక్కడ వ్యంగమైన హాస్యం చిందులు తొక్కుతుంది. డాక్టరు భావనలో ఉన్న వసంత వచ్చినప్పుడల్లా ప్రేక్షకుల్లో ఉత్కంఠ కలుగుతుంది.

ఈ నాటిక జాగ్రత్తగా ప్రదర్శిస్తే తప్పక రక్తికడుతుంది.

—మధుర శ్రీ

## వసుచరిత్ర-సాహితీ సౌరభము

రచయిత : పుట్టపర్తి నారాయణాచార్యులు

ప్రచురణ : శ్రీ రామరాజ భూషణ సాహిత్య పరిషత్తు, భీమవరం

వెల : ఐదు రూపాయలు

శ్రీరామరాజభూషణ సాహిత్య పరిషత్తు, భీమవరం వారు తెలుగుదేశంలో ఒక కవి యొక్క కావ్యాలను అధ్యయనం చేసేందుకు ఆవిర్భవించిన సాహిత్యసంస్థ. ప్రత్యేకంగా సమావేశాలుచేస్తూ ప్రచురణలు చేస్తూ రామరాజభూషణుని సాహిత్య తేజస్సును తెలుగుదేశంలో వ్యాపింపజేసే ప్రయత్నంచేస్తూవున్నారు ఈ పరిషత్తువారు. ఇందుకు వీరు అభినందనీయులు. ఇంతకు పూర్వం వీరు ప్రకటించిన 'భూషణ కిరణావళి' తెలుగుదేశంలో ఉత్తమ గ్రంథంగా ప్రశస్తిని ఆర్జించింది

ఇది శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో కొన్ని యేండ్లకు పూర్వం ఉపన్యసించిన మూడు ఉపన్యాసాల సంకలనం పుట్టపర్తివారు ఈ ప్రౌఢ కావ్యాన్ని గురించి అపూర్వములైన విశేషాలను వెల్లడిస్తూ, గ్రంథస్థం కాకుండా పరంపరగా రాయలసీమ ప్రాంతాలలో ప్రచారంలోఉన్న వసుకావ్య విశేషాలను తమ విశిష్టమైన పలుకుబడితో వ్యాఖ్యానం చేసినారు.

వసుచరిత్రను గూర్చి వరుణవారి గ్రంథం ప్రామాణికమైంది. ఈ గ్రంథంలో పుట్టపర్తివారు చారిత్రక విషయాల చర్చల జోలికి అంతగా పోకుండా కావ్య సౌందర్య పరిశీలనమందే యెక్కువ శ్రద్ధ వహించారు. సామాన్యముగా లక్షణార్థములో రూఢములైన వాచ్యార్థమును పోగొట్టుకొన్న శబ్దాలకు ఏక కాలంలో వాచ్య లక్షణార్థములను సంక్రమింపజేస్తూ రచన చేసే శిల్పం రామరాజభూషణుని శిల్పపద్ధతికి మకుటాయమానమైంది. తొలి వ్యాసంలో శ్రీ నారాయణాచార్యులుగారు ఈ లక్షణమును సోదాహరణంగా నిరూపిస్తూ ఆశ్చర్యాన్ని కలిగించే విశేషార్థాలను వ్యాఖ్యానించినారు. "అతులశైవలవతీశతము లీనెడు మీకు" "ఆమందానికి మౌళి(బూని" "లలితైణాంక శిలాలవాలమగు" "కావున నీవసజానన" ఇత్యాది పద్యములలో వాడిన శబ్దాలకు కవి ఏ విధమైన వైలక్షణ్యాన్ని అనుసంధించినాడో అపూర్వంగా వివరించారు. ఈ వ్యాసంలోనే రామరాజ భూషణుని సంగీత కళారహస్యనిధిత్వానికి సంబంధించిన వివరాలు కూడా ఉన్నవి శ్రీ పుట్టపర్తివారు స్వయముగా సంగీత విద్యావిదులూ, వైణికులూ కావడంచేత ఆయన ఈ విషయం సాధికారంగా చెప్పగలరు.

సంస్కృతంలో విద్వాంసులను పరీక్ష చేయడానికి భాగవతం ఎలా ప్రామాణిక గ్రంథమో, తెలుగులో వసుచరిత్ర అలాంటి స్థానం పొందింది. ఈ గ్రంథంలో ప్రతీ శబ్దం సార్థకంగా గంభీరమైన అర్థంలో ప్రయోగింప బడినదని విద్వాంసుల అభిప్రాయం. వసుచరిత్రలో గ్రంథ గ్రంథులు కూడ చాలా ఉన్నాయి. నవాంబుహాంబక అన్న ఒక సంబోధనకు ఆపద్యానికి సుమారు పాతిక పద్యాల ముందున్న 'తనకెప్పు నెటికప్పునవె పూపి' మొదలైన పద్యంలో ఉన్న సంబంధాన్ని నిరూపిస్తూ-నవాంబురుహాంబక అంటే శివుడు విష్ణువు, బ్రహ్మ, మన్మథుడు అన్న నాలుగు అర్థాలు ఎలా చెప్పవచ్చునో నిరూపించారు.

సంగీత రహస్యాలను చెప్పుతూ—'సరిగా పంచమ మేవగించి' మొదలైన పద్యంలోని రహస్యాలను విపులంగా వివరించడమేకాక 'అకుటిల సౌమ్యమాన నిలయస్ఫురణంబును' అన్న పద్యంలో లక్ష్మీనారాయణ కల్యాణ గీతాలు పాడినారని చెప్పడమే కాకుండా ఏ రాగమున పాడినదియు చెప్పబడ్డదని దానిని నిరూపించారు. జ్యోతిశ్శాస్త్ర విషయములను వివరించడంలో ఉన్న వైశిష్ట్యాన్ని 'అళిఘట మీన కేసరి' ఇత్యాది పద్యాలలో నిరూపించినారు.

ఆయన వైశిష్ట్యాన్ని నిరూపించుతూ 'ఆంధ్ర సాహిత్యములో రామరాజు భూషణుడొక విచిత్ర వ్యక్తి. గొప్ప నాయకుడు సౌందర్యమును భావించిన, పూజించిన రసికుడు తన్ను తాను మరువని కలినుడును, మరచు లలితుడును' అని చెప్పి అతనిని భావించుటకు శక్తియు, రక్తియు కావలెనని చెప్పినారు.

రెండో వ్యాసం మను వసుచరిత్రల పరస్పర సంబంధాన్ని నిరూపించేది. రామరాజు భూషణునికి ఒక వైపు శాకుంతలమూ, రెండోవైపు మనుచరిత్రమూ ఆదర్శ గ్రంథాలు. మను చరిత్రను అన్ని విధాలా మించే గ్రంథం రచించాలనే స్పర్ధతో రచించాడు. ఈ వ్యాసంలో రసకల్పనలో పెద్దనను ఎలా భూషణకవి మించలేక పోయాడో పుట్టపర్తివారు వివరించారు. ఈ వ్యాసంలో ఇరువురు కవుల రచనా శిల్పభేదము విపులంగా నిరూపితమయింది.

ఈ వ్యాసంలో వసు గిరికా వివాహలగ్నం మిథునం కావడమూ అది చైత్రి రాత్రి రావడం సమంజసమా అనే ప్రశ్న వేశారు పుట్టపర్తివారు. భట్టుమూర్తి జ్యోతిశ్శాస్త్రంలో కూడా నైపుణ్యం కలవాడే కదా! ఈ పొరపాటు ఎలా వచ్చింది అని దానికొక సమాధానం సూచించారు. మేషరాశి ఒక్కొక్క అంశ తిరోగమనించడానికి అరవై సంవత్సరాల కాలం పడుతుంది. ఉదయరాశియైనది రాత్రి వచ్చుటకు కనీసము పదివేల ఎనిమిది వందల సంవత్సరములు కావలయును. అందువల్ల వసురాజు కాలమునాడు చైత్రి రాత్రులందు కన్యాది కుంభాంతము రాశులుండి యుండవచ్చునని వారు ఒక సమాధానము సూచించినారు. కాని వసురాజు కాలము అంత దూరము పోవుటకు వీలులేదు. ద్వాపరాంతములోని పాండవుల ప్రపితామహుడగు శంతనుని మామ యగుటచేత వసురాజు ఐదారువేల యేండ్ల కాలం కన్నా పూర్వానికి భారతీయ గణితం ప్రకారమైనా పూర్వుడనడానికి వీలు లేదు కదా. ఈ సందేహమును ఇంకా పండితులు విచారించవలసి యున్నది.

వసుచరిత్ర—ఇతర విశేషాలు అన్న మూడవ వ్యాసంలో నాటి చారిత్రికాంశాలు ఎలా సూచితమవుతున్నవో సూచితమవుతున్నది. పెనుగొండ వద్ద నున్న 'ముత్యాల వంక' వాగు పెన్నా నది నుండి పర్వతము ఛేదించి తేవలసివచ్చినదట. ఆ పని రామరాయల కాలములో 'పరాపు బుక్కయ్య' అనే జలయంత్ర ప్రవీణుడిచేత చేయబడ్డది. ఈ 'ముత్యాల వంక', కావ్యంలో శుక్తిమతి అయిందని పుట్టపర్తివారి భావం.

ఇంకా ఈ వ్యాసంలో కథానాయకుడికీ, కృతిపతికీ అభేదం కల్పించే కన్నడకవి సంప్రదాయం కూడా ఈ కావ్యంలో ఉన్నట్లుగా సూచితమవుతున్నది. ఇందుకోసం అవతారికలోని అనేక పద్యాలకూ కావ్యంలోని అనేక పద్యాలకూ నాటి చారిత్రిక విషయాలకూ సమన్వయం చూపించారు పుట్టపర్తివారు. ఈ వ్యాసంలో వ్యాకరణ విశేషాలు, ఇతరకవు తోడి సామ్యము వివరింపబడ్డది.

కావ్య సౌందర్యమును అధ్యయనం చేసే దృష్టితో తెలుగు కావ్యాలపై ఇటీవల కొన్ని గ్రంథాలు వెలువడినా వాటి సంఖ్య తక్కువే. అలాంటి వాటికోవలో శ్రీ నారాయణాచార్యుల వారి గ్రంథం విలక్షణమయింది. ఇలాంటి గ్రంథాలు ఇంకా రచించి పరంపరగా వ్యాఖ్యాతములై సాహిత్యరూపం పొందని అనేక రహస్యాలను వారు ఇంకా వివరిస్తూ రచించవలెననే కోరిక. వసుచరిత్రకు సమగ్రమయిన వ్యాఖ్యానం రచించవలెననే వారి సంకల్పం త్వరలో సఫలం కావలెననే ఆకాంక్ష.

1972లో వసుచరిత్ర రచన పూర్తి అయి నాల్గువందల సంవత్సరాలు పూర్తి అవుతున్నవి. ఈ సందర్భాన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, రామరాజుభూషణ సాహిత్య పరిషత్తు వారు, ఈ గ్రంథమును ఇతోధికంగా అధ్యయనం చేసేందుకు అనువుగా కార్యక్రమాలు చేపట్టగలరని ఆశిస్తున్నాను.

—సుప్రసన్న



## మహిళా మండలి భవనానికి శంకుస్థాపన

మహిళా సంక్షేమం, యాత్రా విషయాల శాఖామంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీ యిటీవల ఆదిలాబాదు జిల్లా నిర్మల్ పంచాయతీ సమితిలోని నర్సాపురం గ్రామంలో మహిళా మండలి భవనానికి శంకుస్థాపన చేశారు. ఆమె ఒక బాలవిహారానికి కూడా ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు జిల్లా పరిషత్ అధ్యక్షులు శ్రీ జి. నరసింహారెడ్డి అధ్యక్షత వహించారు. గ్రామస్థులు సమర్పించిన సన్మాన పత్రానికి మంత్రిణి సమాధానమిస్తూ సంక్షేమ కార్యకలాపాలపట్ల మహిళలు ఉత్సాహం ప్రదర్శించి అధిక సంఖ్యలో యీ కార్యక్రమానికి హాజరైనందుకు గ్రామస్థులను ముఖ్యంగా మహిళలను అభినందించారు. అభివృద్ధి కార్యక్రమాలలో మహిళలు శ్రద్ధాసక్తులు చూపాలని ఆమె వినతి చేశారు.

మహిళా భవనం త్వరలో పూర్తి కాగలదని జిల్లా పరిషత్ అధ్యక్షులు హామీయిచ్చారు. ఆ తర్వాత మంత్రిణి స్థానిక ఉన్నత పాఠశాలను దర్శించారు. జిల్లా కలెక్టరు శ్రీ మొహమ్మద్ జియాయుద్దీన్ మహిళా సంక్షేమ శాఖా డైరెక్టరు శ్రీమతి శ్రీ రాజ్యం సిన్హా, శాసన సభ్యులు శ్రీ గడ్డెన్న గారలు కూడా ఆమెవెంట పర్యటించారు.

మంత్రిణి మండోల్ సమీపంలోని బాసర్ వద్దగల ప్రఖ్యాత సరస్వతీ దేవాలయాన్ని సందర్శించారు. అక్కడ ఆమెకు శాసన సభ్యులు శ్రీ గడ్డెన్న తదితరులు స్వాగతమిచ్చారు. దేవాలయావరణలో బీద ప్రజలకు అన్నదానం జరిగింది.

## వాణిజ్యమండలి భవనానికి శంకుస్థాపన

ఉప ముఖ్యమంత్రి, శ్రీ జె. వి. నర్సింగరావు, జులై 15 వ తేదీన ఏలూరులో పశ్చిమ గోదావరి వాణిజ్య, పరిశ్రమల మండలి భవనానికీ, ఆడిటోరియం నిర్మాణానికీ శంకుస్థాపన చేస్తూ ప్రస్తుత పరిస్థితులకు అనువైనవిధంగా సోషలిజం, సెక్యూలరిజం, ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు అనుగుణంగా తాము కూడా వ్యవహరించాలని వాణిజ్య వర్గాలకు విజ్ఞప్తిచేశారు.

మన జనాభాలో 85 శాతంకన్నా ఎక్కువ మంది రోజుకు ఒక రూపాయి కన్నా తక్కువగానే సంపాదిస్తున్నారని వివరిస్తూ ఉత్పత్తిని అధికంచేయడం ద్వారా ఉపాధి సౌకర్యాలను విస్తరింపజేస్తూ సమాజంలోని ఏ వర్గంలోను అసంతృప్తికి తావు లేకుండా కృషిచేయాలని విజ్ఞప్తి చేశారు. అనాదిగా మనలో కొనసాగుతున్న నిజాయితీ, త్యాగం, సేవాభావాలను నిలుపుకుంటూ సమాజానికి సేవచేయాలని ఉద్బోధిస్తూ వస్తువుల కల్తీల విషయంలో కఠిన చర్యలు తీసుకోవడం జరుగుతుందని ఉపముఖ్యమంత్రి హెచ్చరించారు.

మనం ఎదుర్కొంటున్న అన్ని సమస్యలను గాంధీ మార్గంలో పరిష్కరించు కోవాల్సిన అవసరాన్ని గూర్చి నొక్కి చెప్పారు. పరిశ్రమలను నెలకొల్పకుండా డబ్బును బ్యాంకులలో నిల్వచేసే తత్వాన్ని ఆయన గర్హించారు.

ఆంధ్ర ప్రదేశ్‌లో జాతీయ రహదారులను రు. 36 కోట్ల ఖర్చుతో 911 మైళ్ళ వరకు విస్తరింపజేసే పథకాన్ని ఆమోదిస్తూ



విశాఖపట్టణంలో హెవీవెసెల్స్ అండ్ ప్లేట్స్ కర్మాగారానికి కేంద్ర ఉక్కుశాఖ మంత్రి మోహన కుమారమంగళం ప్రారంభోత్సవం చేశారు.



నల్లగొండ జిల్లా కలెక్టరు శ్రీ కె. ఓబయ్య నల్లగొండలోని ఎన్. జి. ఓ. హోంకు అగస్టు 15 వ తేదీన శంఖుస్థాపన చేశారు.



అగస్టు 15వ తేదీన కరీంనగర్‌లో కూచిపూడి నృత్యప్రదర్శన సందర్భంగా వరంగల్లు రీజినల్ ఇంజనీరింగ్ కళాశాల ప్రొఫెసర్ శ్రీ సోమయాజులుకు కరీంనగర్ కలెక్టర్ సతీమణి శ్రీమతి యస్. వి. సుబ్రహ్మణ్యం బహుమతి ప్రదానం చేశారు.

రు. 25 కోట్లు మంజూరు చేయడానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరించిందని ఆయన వెల్లడించారు. భూతలింగం నివేదిక పరిశీలనలో ఉందనీ, ఏలూరులో విద్యుచ్ఛక్తి ట్రాన్స్‌మిషన్ త్వరలోనే నెలకొల్పబడుతుందనీ ఆయన అన్నారు.

## నల్లగొండ జిల్లాలో 42 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

నల్లగొండ జిల్లా పరిషత్తుకు చెందిన ఒకటవస్థాయీ సంఘం సమావేశం జులై 15 వ తేదీ గురువారంనాడు కలెక్టరు శ్రీ కె. ఓబయ్య అధ్యక్షతన జరిగింది. నల్లగొండ జిల్లాలో ప్రణాళికా పథకాల అమలు తీరును సమావేశంలో సమీక్షించారు.

నాగారం, హుజూరునగర్, మోత్కూరు, ఆలేరు పంచాయతీ సమితులకు స్వల్పకాలిక ఋణంగా రు. 9 లక్షలు మంజూరుచేశారు.

విద్యుచ్ఛక్తి శాఖ డివిజినల్ ఇంజనీరు శ్రీ వామనరావు సమావేశంలో ప్రసంగిస్తూ గత సంవత్సరం 62 గ్రామాలకు వాటి పరిసర గ్రామాలకూ విద్యుచ్ఛక్తి సరఫరా చేశారని వివరించారు. ఈ సంవత్సరం 42 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసే పథకం విద్యుచ్ఛక్తి బోర్డు పరిశీలనలో ఉన్నదని ఆయన తెల్పారు.

పెద్దవూర పంచాయతీ సమితి అధ్యక్షుడు, శ్రీ రమణారెడ్డి ప్రసంగిస్తూ విద్యుచ్ఛక్తి సరఫరా కార్యక్రమాలలో తమ సమితి గ్రామాలను చేర్చుకోవాలని విజ్ఞప్తి చేశారు.

కలెక్టరు ప్రసంగిస్తూ బీటలుబారిన నీటివనరుల మరమ్మత్తుల నిమిత్తం ప్రభుత్వానికి విజ్ఞప్తి చేయడానికి వీలుగా చిన్నతరహా నీటివనరులకు సంబంధించిన నివేదికను సిద్ధంచేయాలని జిల్లా పరిషత్తు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరును కోరారు. జిల్లాలో పరిశ్రమలను నెలకొల్పే విధంగా స్థానిక వాణిజ్య వర్గాలను ప్రోత్సాహం చేయాలని సమితి సభ్యులకు విజ్ఞప్తి చేశారు.

## కుష్ఠరోగుల ఆసుపత్రికి మంత్రి రాక

మహిళా సంక్షేమం, యాత్రా విషయాల శాఖా మంత్రిణి శ్రీమతి రోడా మిస్త్రీ జులై నెలలో నిజామాబాదు జిల్లా డిచ్పల్లిలోని విక్టోరియా కుష్ఠరోగుల ఆసుపత్రిని దర్శించి అక్కడి రోగులను పరామర్శించి వారియోగక్షేమములు తెలుసుకొన్నారు.

## వీధి దీపాలకు ప్రారంభోత్సవం

సాంఘిక సంక్షేమ శాఖామంత్రి శ్రీ డి. పెరుమాళ్లు యిటీవల ఖమ్మం పంచాయతి సమితిలోని నాచేపల్లి గ్రామంలో వీధి దీపాలకు ప్రారంభోత్సవం జరిపారు. ఈ గ్రామంలో 15 వీధి దీపాలు. హరిజన వాడలో 5 విద్యుద్దీపాలు ఏర్పాటు చేయబడినాయి. అంతేకాకుండా 40 ఇండ్లకు విద్యుచ్ఛక్తి కనక్షన్లు యివ్వబడినాయి. వ్యవసాయం కొరకు 16 కనక్షన్లు యివ్వబడినాయి. ఈ గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరాను చేసేందుకుగాను పై కార్యక్రమాలకు రు. 82,500 లు ఖర్చు అయినవి.

ఈ సందర్భంలో మంత్రిగారు ప్రసంగిస్తూ బలహీన వర్గాల శ్రేయస్సు కొరకు ప్రభుత్వం ఇండ్ల స్థలాలను, బంజరుభూములను పంపిణీ చేస్తున్నదని విద్యా సౌకర్యాలు, త్రాగునీటి బావుల నిర్మాణము మున్నగునవి ఏర్పాటు చేయుచున్నదని చెప్పారు. ప్రభుత్వం కల్పిస్తున్న ఈ సౌకర్యాలను ప్రజలు సద్వినియోగం చేసుకోవలయునని చెప్పారు. హరిజనులు తమ పిల్లలకు చదువు చెప్పించాలని ఆయన హితవు చేసారు. మంత్రి హరిజన వాడలను కూడా దర్శించారు

## గ్రామీణ విద్యుచ్ఛక్తి పథకానికి ప్రారంభోత్సవం

ముఖ్య మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి జులై నెలలో నెల్లూరు జిల్లాలోని వెంకటగిరిలో గ్రామీణ విద్యుచ్ఛక్తి పథకానికి ప్రారంభోత్సవం జరుపుతూ సాంఘిక న్యాయం చేకూర్చటమే ప్రభుత్వ ధ్యేయమైవున్నదని చెప్పారు. అభివృద్ధి పనుల వలన సంక్రమించే లాభాలు ప్రజలందరికి సమానముగా పంపిణీకావడమే దీని భావమని చెప్పారు. ఈ గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా పథకానికి రు 90 లక్షలు ఖర్చు అయింది. ఈ పథకం వల్ల అనేక పరిసర గ్రామాలకు కూడా విద్యుచ్ఛక్తి సరఫరా కావడానికి అవకాశాలు వున్నవి.

ముఖ్యమంత్రి ఇంకా ఇలా అన్నారు: కొద్దిమంది వ్యక్తులు మాత్రమే అభివృద్ధి ఫలితాలను అనుభవించే పద్ధతికి స్వస్తి చెప్పాలి. అప్పుడే సాంఘిక న్యాయం ఏర్పడుతుంది. పేదరికం అంతరించిపోవడానికి మార్గం ఏర్పడుతుంది. వెంకటగిరి తాలూకా ప్రజలు వ్యవసాయ అభివృద్ధి కొరకు విద్యుచ్ఛక్తిని వినియోగించుకోవాలి. మెట్టప్రాంతాలైన తాలూకాలలో వ్యవసాయాన్ని అభివృద్ధి పరిచే నిమిత్తం అనేక చిన్నతరహా నీటిపారుదల పనులను చేపట్టడానికి ప్రభుత్వం యోచిస్తున్నది. భూస్వాముల దృక్పథములో మార్పు తీసుకొని రావడంవల్ల భూసంస్కరణలు సమర్థవంతంగా అమలు పరచవచ్చు ఆస్తికై పరిమితి విధించవచ్చు. గాంధీజీ చూపిన శాంతి అహింస మార్గంద్వారా భూస్వాములలో పరివర్తన తీసుకొని రావచ్చునని ముఖ్య మంత్రి అన్నారు.

ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు అధ్యక్షోపన్యాసం చేస్తూ ఈ పథకాన్ని సాధించిన వెంకటగిరి రాజా కృషిని ప్రశంసించారు.

## మత్స్యక్షేత్రానికి ప్రారంభోత్సవం

ఉపముఖ్యమంత్రి, శ్రీ జె. వి నర్సింగరావు, జులై 15వ తేదీన విజయవాడకు 17 మైళ్ళ దూరంలోని పోరంకిలో మత్స్య క్షేత్రానికి ప్రారంభోత్సవం చేశారు. కంకిపాడు పంచాయితీ సమితివారు రు 47,500 ల ఖర్చుతో యీ క్షేత్రాన్ని అభివృద్ధిపరిచారు. ఈ ప్రాంతంలోని నీటివనరులలో అధిక దిగుబడి నిచ్చే చేపపిల్లలను సరఫరా చేయడమే యీ క్షేత్ర ఉద్దేశం.



చిత్తూరు జిల్లా కలెక్టర్ శ్రీ బి. వి. రామారావు ఆగస్టు 15వ తేదీన బీదలకు అన్నదాన కార్యక్రమంలో పాల్గొన్నారు.



సమాచార పౌరసంబంధ శాఖమంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవ రావు చిత్తూరులో "అరుణోదయం" మాసపత్రికను ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు.

ఈ సందర్భంగా ఉపముఖ్యమంత్రి ప్రసంగిస్తూ నీటివనరులు గల ప్రతిగ్రామంలో మత్స్యపరిశ్రమను అభివృద్ధిపరచడానికి మత్స్య శాఖ ఒక బృహత్ప్రణాళికను తయారుచేసిందని అన్నారు.

కృష్ణా కలెక్టరు శ్రీ సి. ఎస్. శాస్త్రి ప్రసంగిస్తూ ఆశించిన ప్రయోజనాలు సిద్ధించి తద్వారా యువకులకు ప్రోత్సాహం కలిగించే విధంగా పథకాలను అమలు జరపడానికి కృషిచేయాలని మత్స్యశాఖా సిబ్బందిని ఉద్బోధించారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు యీ ఉత్సవానికి అధ్యక్షత వహించారు

## హరిజన కాలనీకి శంకుస్థాపన

ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి నర్సింగరావు, ఏలూరువద్ద గల శనివారపుపేట... హరిజనులకొరకు ఉద్దేశింపబడిన రెండు ఇండ్ల కాలనీలకు శంకుస్థాపన చేశారు. యిక్కడ యిటీవల సంభవించిన అగ్నిప్రమాదంలో హరిజన ఇండ్లు పూర్తిగా దగ్ధమై పోయాయి. ఒక్కొక్క కాలనీలో 100 ఇండ్ల చొప్పున హరిజనులకు ఇండ్లు నిర్మించబడుతాయి. ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు శాసన సభ్యులు శ్రీ ఎం. వెంకటనారాయణ అధ్యక్షత వహించారు

## నల్లగొండ జిల్లాలో రక్షిత మంచినీటి సరఫరా

నల్లగొండ జిల్లా పరిషత్తు 6వ స్థాయీ సంఘం సమావేశం జూలై 15 వ తేదీన జరిగింది. జిల్లా కలెక్టరు శ్రీ ఓబయ్య సమావేశానికి అధ్యక్షతవహించారు. రోడ్లు, భవనాలు, నీటి పారుదల శాఖల ఆధ్వర్యంలో ప్రణాళికా పథకాలక్రింద జరిగిన పనులను యీ సమావేశంలో సమీక్షించారు.

సమావేశంలో పాల్గొన్న సమాచార, పౌర సంబంధ శాఖామంత్రి ప్రసంగిస్తూ నిధుల నిమిత్తం ప్రభుత్వానికి విజ్ఞప్తి చేయడానికి వీలుగా మంచి స్థితిలోలేని రోడ్లన్నిటి మరమ్మత్తులకు అవసరమైన నిధులనుగూర్చి సమగ్రమైన నివేదిక తయారు చేయాలని ఎగ్జిక్యూటివ్ ఇంజనీరును కోరారు.

## 12 లక్షల ఎకరాల బంజరు భూమి హరిజనులకు పంపిణీ

మధ్యతరహా నీటి పారుదలశాఖా మంత్రి, శ్రీ ఆర్. నారప రెడ్డి, యిటీవల నెల్లూరు జిల్లా సూళ్ళూరు పేట పంచాయతీ సమితీ సమావేశంలో ప్రసంగిస్తూ హరిజనులకు ఇండ్ల స్థలాలుకేటాయించడంతోపాటు 12 లక్షల ఎకరాల బంజరు భూమిని ప్రభుత్వం పంపిణీ చేసిందని అన్నారు.

## గరివిడి గనుల కార్పొరేషన్‌ను మూసి వేయకుండా నిరోధించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి

శ్రీకాకుళం జిల్లా పరిషత్తు సమావేశం యిటీవల జరిగింది. జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ జే. శ్రీరాములు నాయుడు సమావేశానికి అధ్యక్షత వహించారు. శ్రీకాకుళం జిల్లా, చీపురుపల్లి తాలూకా గరివిడిలోని ఫెర్రో ఎల్లాయ్స్ గనుల కార్పొరేషన్‌ను, అధిక విద్యుచ్ఛక్తి రేట్ల నెపంపై మూసివేసే ప్రతిపాదనను, నిరోధించాలని జిల్లా కలెక్టరు ద్వారా ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానాన్ని ఆమోదించారు.



ఖమ్మం జిల్లా పైనంపల్లి పడుగు గ్రామంలో ఆగస్టు 22 వ తేదీన ...మంత్రి శ్రీ పి. పురుషోత్తమరెడ్డి ప్రసంగించారు.

## కుంతల జలపాతం-యాత్రావిషయాల శాఖామంత్రిణిచే పరిశీలన

మహిళా సంక్షేమం, యాత్రా విషయాల శాఖామంత్రి శ్రీమతి రోడామిస్త్రీ ఇటీవల ఆదిలాబాదు జిల్లాలోని కుంతల జల పాతాన్ని దర్శించారు. మంత్రి పోచారం జలపాతాన్ని కూడా తిలకించారు.

జిల్లా కలెక్టరు శ్రీ మొహమ్మద్ జియావుద్దీన్ ప్రకృతి సౌందర్యాన్ని ఇనుమడింపచేస్తున్న ఈ జలపాతాలను యాత్రా



ఆగస్టు 15వ తేదీన ఒంగోలు జిల్లా కలెక్టర్ శ్రీ కె. చంద్రయ్య ఎ. బి. ఎం. కళాశాల మైదానంలో పెరేడ్ తిలకిస్తున్న దృశ్యం.

కేంద్రాలుగా అభివృద్ధి పరచవలసిందిగా మంత్రిని అభ్యర్థించారు. జాతీయ రహదారి నుంచి ఈ జలపాత ప్రాంతాలకు రోడ్లు వేయవలసిందిగా ఆమె కలక్టరుకు సూచించారు.

## హరిజన కాలనీకి ప్రారంభోత్సవం

ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి నర్సింగరావు ఇటీవల కృష్ణా జిల్లా తిరువూరు పంచాయతి సమితిలోని చింతలపాడు గ్రామం దగ్గర జ్యోతినగర్ అనే హరిజన కాలనీకి ప్రారంభోత్సవం జరిపారు. ఇక్కడ 1969 లో తుఫానుల ఫలితంగా నిరాశ్రయులైన 60 హరిజన కుటుంబాలకు పునరావాసం కల్పించేందుకై జిల్లా పరిషత్తు అభివృద్ధి సంఘం ఈ కాలనీని నిర్మించింది.

జిల్లా కలెక్టరు శ్రీ వి. యన్. శాస్త్రి అధ్యక్షత వహించారు.

## నల్లగొండ జిల్లా పరిషత్ సమావేశం

నల్లగొండ జిల్లా పరిషత్తు సర్వసభ్య సమావేశం, పరిషత్తు అధ్యక్షుడు శ్రీ కె. రంగారెడ్డి అధ్యక్షతన జరిగింది. 1971_72 సంవత్సరపు బడ్జెటును సమావేశంలో ఆమోదించారు. షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల సంక్షేమం నిమిత్తం రు. 7.30 లక్షలు కేటాయించారు. 1969_70 సంవత్సరపు పరిపాలనా నివేదికను ఆమోదించారు. జిల్లాలో ఆర్థిక, ఆహార పరిస్థితులను గూర్చి సమీక్షించబడింది.

చిన్నతరహా నీటిపారుదల శాఖా మంత్రి శ్రీ పురుషోత్తమ రెడ్డి సూచనపై హాస్టళ్ల తీరుతెన్నుల పరిశీలనకై ముగ్గురు సభ్యులతో ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. జిల్లా కలక్టరు యితర అధికారులు కూడా సమావేశంలో పాల్గొన్నారు

## బాపినీడు నగర్‌కు ప్రారంభోత్సవం

ఆర్థికమంత్రి శ్రీ కె. విజయభాస్కరరెడ్డి, యిటీవల పెనుమంట్ర పంచాయతీ సమితిలోని దరగరావిపాలెంలో బాపినీడు నగర్‌కు ప్రారంభోత్సవంచేశారు. రు. 1.6 లక్షల ఖర్చుతో 82 గృహాలు యీ కాలనీలో నిర్మించబడినాయి.

ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ జిల్లాలో హరిజన, గిరిజనుల నిమిత్తం యింతవరకు 2,000 గృహాలను నిర్మించారనీ 70,000 గృహాలు నిర్మించాలని ఉద్దేశించారనీ అన్నారు. ఈ సంవత్సరం గిరిజనుల సంక్షేమానికి రు. 2.5 కోట్లు కేటాయించారని మంత్రి వెల్లడించారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ అల్లూరి బాపినీడు ఉత్సవానికి అధ్యక్షత వహించారు.

## నరసంపేట సమితి గ్రామాలలో రక్షిత మంచినీటి సరఫరా

వరంగల్లు జిల్లా నరసంపేట పంచాయతీ సమితి సమావేశం సమితి అధ్యక్షుడు శ్రీ జి. ప్రతాపరెడ్డి అధ్యక్షతన జరిగింది. సమితిలో అభివృద్ధి కార్యక్రమాలను గూర్చి సమీక్షించారు.



లఘు పరిశ్రమల మంత్రి శ్రీ జి. సి. వెంకన్న జూలై 3, 4 తేదీలలో తిరుపతిలో జరిగిన ఆంధ్రప్రదేశ్ లఘు పరిశ్రమల అభివృద్ధి సంస్థ సమావేశంలో ప్రసంగించారు.

కోనపురం, రేలకుంట, నెక్కొండ, దుగ్గొండి, లెంకలపల్లి గ్రామాలలో రక్షిత మంచినీటి పథకాలను ప్రభుత్వం మంజూరు చేసింది. బ్లాక్ అభివృద్ధి అధికారి శ్రీ మహమ్మద్ నిజాముద్దీన్ సమావేశంలో ప్రసంగిస్తూ, 1971 జూన్ నెలలో సమాజాభివృద్ధి కార్యక్రమంక్రింద కమ్యూనికేషన్ పనుల నిమిత్తం రు. 24,000లు ఖర్చుచేయడం జరిగిందనీ 16 పనులలో 12 పనులు పూర్తిచేశారనీ అన్నారు. హరిజనులకు యిండ్ల స్థలాలు కేటాయించడానికి 41 గ్రామాల్లో భూమిసేకరణ పనులను చేపట్టారనికూడా ఆయనఅన్నారు.

## సి. ఆర్. రెడ్డి కాలేజి భవనం అభివృద్ధి

ఆర్థికశాఖామంత్రి శ్రీ కె. విజయభాస్కరరెడ్డి ఏలూరులో ఇటీవల సి.ఆర్. రెడ్డి కాలేజీలో ఉత్తర బ్లాకుకు ప్రారంభోత్సవం జరిపారు. ఈ సందర్భంలో మంత్రి ప్రసంగిస్తూ విద్యార్థులు



ఆగస్టు 15వ తేదీన కరీంనగర్ జిల్లా కలెక్టర్ శ్రీ యస్. వి. సుబ్రహ్మణ్యం హెల్త్ యిన్స్పెక్టర్ శ్రీ కె. అమృతరెడ్డికి కుటుంబ నియంత్రణ బహుమతి యిచ్చారు.

## తెలుగు రచయితల సమావేశం

సమాచార, పౌరసంబంధ శాఖామంత్రి, శ్రీ ఎ. వాసుదేవ రావు జూలై 26న నిజామాబాదులో స్థానిక తెలుగు రచయితల సంఘం "ఇందూరు భారతి" ద్వితీయ వార్షికోత్సవంలో ప్రసంగిస్తూ ప్రజాస్వామ్యం విజయవంతంగా కొనసాగడానికి సమాజం అప్రమత్తంగా ఉండటం చాలా అవసరమన్నారు. సమాజంలోని. రాజకీయాలలోని చెడును రచయితలు వెల్లడి చేయాలని ఆయన అభిప్రాయపడినారు.

కార్మిక వర్గాన్ని, బలహీనవర్గాలనూ తగిన విధంగా గౌరవించడం జరగడంలేదనీ, దీనివల్ల సమాజానికి ప్రమాదం వాటిల్లే అవకాశం ఉందనీ ఆయన హెచ్చరించారు. సాహిత్యం ద్వారా అసంతృప్తిని వ్యక్తం చేసినంత మాత్రాన సరిపోదనీ. దానివలన ప్రయోజనం కలుగదనీ. సమాజం పరిస్థితులకు అనుగుణంగా వ్యవహరిస్తూ తగిన సంస్కరణలకు పూనుకునే విధంగా రచయితలు ప్రబోధించాలని ఆయన అన్నారు.

జిల్లా పరిషత్ అధ్యక్షుడు శ్రీ కె. రాజారెడ్డి సమావేశానికి అధ్యక్షత వహించారు.

శ్రీ కుందుర్తి జూలై 24 న, శ్రీ ఎ. సూర్యప్రకాశ్ రచించిన "స్పందన" వచన కవితా సంపుటిని ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ రచయితలకు, సామాజిక స్పృహ, సమకాలీన కావ్యవస్తు స్పృహ వుండాలన్నారు.

స్థానిక చిత్రకారులు ఏర్పాటుచేసిన పెయిటింగ్ ప్రదర్శనకు శ్రీ కుందుర్తి ప్రారంభోత్సవం చేశారు.

## గవర్నరు వరంగల్లు పర్యటన

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయి, అగస్టు 3వ తేదీన వరంగల్లులో ప్రసంగిస్తూ వరంగల్లు నగరంలో పారిశ్రామిక అభివృద్ధికి మంచి అవకాశాలు ఉన్నాయనీ.ఈప్రదేశం అభివృద్ధికి నీటికొరత ప్రధానమైన అవరోధంగా ఉన్నప్పటికీ, భూగర్భ జలాల వినియోగ అవకాశాలకు స్థానిక సంస్థలు కృషి చేయాలని అన్నారు. పరిశ్రమలను నెలకొల్పదలచిన పెద్ద పారిశ్రామిక వేత్తలు భూగర్భ జలాల వినియోగం ద్వారా నీటి సరఫరాకు స్వంతఏర్పాట్లు చేయవచ్చుననికూడా ఆయన అభిప్రాయ పడినారు. వరంగల్లు నగరం మునిసిపాలిటీవారు అగస్టు 3వ తేదీన సమర్పించిన పౌర సన్మానానికి సమాధానం చెబుతూ గవర్నరు పై విధంగా అన్నారు.

మంచినీటి కొరతను గూర్చి ప్రస్తావిస్తూ యీ సమస్యను ప్రభుత్వం పరిశీలిస్తుందని గవర్నరు హామీ యిచ్చారు. వరంగల్లులో జరిగిన విద్యాభివృద్ధిని ప్రశంసిస్తూ కాకతీయ వైద్యకళాశాల రాష్ట్రంలో ఉత్తమమైనదనీ అభిప్రాయపడుతూ దాని నిర్వహణ తీరును ప్రశంసించారు. భవిష్యత్తులో పెరిగే జనాభాను అవసరాలనూ దృష్టిలో ఉంచుకొని ప్రణాళికను తయారుచేయాలని మునిసిపాలిటీ వారికి సలహా యిచ్చారు.

వరంగల్లు మునిసిపాలిటీ అధ్యక్షుడు శ్రీ పి. ఉమారెడ్డి గవర్నరుకు సన్మాన పత్రం సమర్పిస్తూ నీటి సరఫరా పరిస్థితిని డ్రైనేజీని మెరుగు పర్చాలనీ కోరారు.

కాకతీయ వైద్యకళాశాలలోని ఆడిటోరియంలో నెలకొల్పబడిన 35 ఎం. ఎం. ప్రొజెక్టరును గవర్నరు లాంఛనప్రాయంగా ప్రారంభోత్సవం చేశారు.

గవర్నరు తన పరివారంతో వరంగల్లు కోటను సందర్శించారు.

## ఒకనాటి గ్రామం పునర్నిర్మాణం

శ్రీకాకుళం జిల్లా సీతంపేట సమితికి చెందిన కడగండి పంచాయతీలో ఒకప్పుడు "వాంద్రజోల" అనే గ్రామం వుండేది.

సుమారు అర్థ శతాబ్దికి పూర్వం ఆగ్రామంలో వ్యాపించిన కలరా వ్యాధి కారణంగా గ్రామీణులు గ్రామం వదలి సమీప కొండ గ్రామాలలో జీవిస్తున్నారు.



ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి బోర్డు చైర్‌మన్, నల్లగొండ జిల్లా పుట్టపాక గ్రామంలో ఆగస్టు 12వ తేదీన విద్యుచ్ఛక్తితో నడిచే పంపుసెట్టుకు ప్రారంభోత్సవం చేశారు.

---

నేడు ఆగ్రామం పునర్నిర్మాణం జరిగి ఆంధ్రప్రదేశ్ 'హోం' శాఖా మాత్యులు శ్రీ జలగం వెంగళరావు గారిచే ప్రారంభోత్సవం జరిగినది.

ఈ గ్రామానికి చెందిన 250 ఎకరాలు సర్వే చేయించి, ఆ ప్రాంతములో బలిసిపోయిన చిట్టడవులను బుల్డోజర్లతో బాగు చేయించి, చుట్టుప్రక్కల గ్రామాలనుండి 51 సవర కుటుంబముల వారిని ఆ గ్రామములో జీవించడానికి ఏన్నుకొని వారికి ఉచితముగా యిండ్లు,5 ఎకరముల పొలాన్ని, విత్తనములు, పశువులును పంపిణీ చేసిరి.

వీరినందరినీ "జాయింటు ఫార్మింగు సొసైటీ"గా, ఏర్పాటు చేసి, నిత్యావసర వస్తువులు అమ్మ "డిపోను", వారి పిల్లల చదువులకు ఆశ్రమ పాఠశాలను, మంచినీటి బావిని నిర్మించిరి.

ఆ ప్రాంతములో గల అయిదు పాతచెరువులను బాగు చేయిస్తున్నారు.



కరీంనగర్ జిల్లా కోరట్ల గ్రామంలో ఆగస్టు 20వ తేదీన ముఖ్యమంత్రి రక్షిత నీటి సరఫరా పథకానికి ప్రారంభోత్సవం చేశారు.

## పంచాయతీ సమితి సమావేశం

కార్వేటినగరం పంచాయతీ సమితి సాధారణ సమావేశము 4-8-71వ తేదీన పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ పి. వరదారెడ్డి గారి అధ్యక్షతన జరిగినది. సమావేశములో సమితి ప్రాంతమున సాధింపబడిన అభివృద్ధి కార్యక్రమాలను సమీక్షించి, 1970-71 సంవత్సరమునకు తయారుచేయబడిన పరిపాలన నివేదికను పరిశీలించి ఆమోదించారు.

విద్యుత్ సరఫరా సమితిలో 20 శాతము గ్రామములకే అందచేయబడినది. సమితిలోని 115 గ్రామములకుగాను 22 గ్రామములకే విద్యుత్ సరఫరా కలిగించబడినది. పరిపాలన నివేదికలో ఇంతవరకు జరిగిన అభివృద్ధిని సమీక్షిస్తూ, ఇంకను త్వరగా విద్యుత్ సరఫరా రైతులకు అందచేయవలసియున్నదని సూచింపబడినది.

## చినకొడప్పగల్ గ్రామసభ

జులై 20వ తేదీన బాన్సువాడ పంచాయతీలోగల చిన కొడపగల్ గ్రామంలో శ్రీ వై. సాయరెడ్డి సర్పంచ్‌గారి అధ్యక్షతన గ్రామసభ జరిగింది. దీనికి తాలూకా నాయకులు మరియు ప్రభుత్వాధికారులు విచ్చేసి సభను జయప్రదమొనర్చిరి.

శ్రీయుత జి. కృష్ణారెడ్డి బాన్సువాడ పంచాయతీ సమితి అధ్యక్షులు గ్రామ పాఠశాలలో 7వ తరగతికి ప్రారంభోత్సవం చేశారు. మధ్యాహ్నము బీదవారికి ప్రభుత్వమువారు సహాయ రూపముగా యిచ్చిన వస్త్రములు శ్రీ కృష్ణారెడ్డిగారు పంచారు.

గ్రామంలో పనులు పూర్తిచేయుటకుగాను గ్రామపంచాయతీ నుండి రూ. 16,000 పంచాయతీ సమితి నుండి రూ. 22,600/- జిల్లాపరిషత్తు నుండి రూ. 33,000/-లు మంజూరు చేయబడింది.

## విద్యుదీకరణ

గార పంచాయతీ, సమితి, ఇప్పిలి, మధురా, "కణుగుల, వానిపేట" గ్రామంలో 29-7-71 న. అసిస్టెంటు ఇంజనీరుగారి అధ్వర్యమున. విద్యుచ్ఛక్తి ప్రారంభోత్సవం జరిగింది. సర్పంచ్ శ్రీ లోలుగు నరసింహప్పారావు నాయుడు స్విచ్ ఆన్ చేసిరి. ఈ విద్యుత్తు సప్లై వలన ఈ ప్రాంత రైతులు విరివిగా వ్యవసాయం అభివృద్ధి చేసుకొనుటకు మంచితోడ్పాటు కలిగించినందుకు ప్రభుత్వమునకు కృతజ్ఞతలు తెల్పారు.

## రచయితలకు విజ్ఞప్తి

ఆంధ్రప్రదేశ్ పత్రిక గ్రామాల్లో సామాన్య ప్రజల దగ్గిరకు వెళ్లే పత్రిక. అందువల్ల రచనల్లో సాధ్యమైనంతవరకు సరళమైన వ్యావహారిక భాష వాడితే అనుకూలంగా వుంటుంది.

(ప్ర. సం.)

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLICRELATIONS AND TOURISM, ANDHRA PRADESH, HYDERABAD.
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PR ADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD

